The Largest Circuluted
Telugu Monthly

# చతుర

డిసెంబరు 1989
రూ. 4/-



# సంగీత స్వర లహరి వింటూ సమయం గడపండి




మిరకిల్ ఐ
పొజిషన్‌లో ఉంచబడిన సంగీత ధ్వని. మధ్య రాత్రిలో వినిపించదు.






భారతదేశంలో
మ్యూజికల్ గడియారాల
తయారీలో ప్రథములు

**Ajanta®**
**QUARTZ**
the touch of tomorrow's technology

రిజిస్టర్డు ఆఫీసు:
పృథ్వీరాజ్ ప్లాట్. పో. బా. నం.: 116
మోర్వి 363 641
ఫోన్లు: 3627, 2280, 2457, 2433
టెలెక్స్: 0167-212 ATCM
గ్రామ్: VANITHA

KPS/AM/9-89-TEL









అన్ని ప్రముఖ దుకాణాలలో లభ్యం.

హెచ్చరిక। మా గడియారాలన్నిటిపైన "అజంతా" గుర్తు చూడండి. నకిలీలను గురించి జాగ్రత్త పడండి.



# భ్రాంతిపై సమీక్షలు

**అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన జయగారి 'భ్రాంతి' నవలపై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.**

## 'భ్రాంతి' కాదు 'క్రాంతి'

*(ప్రథమ బహుమతి రు.100/- పొందిన సమీక్ష)*

'భ్రాంతి' నవల ముఖ్యంగా రెండు విషయాలను చెప్తోంది. ఒకటి యవ్వనంలో స్త్రీ పురుషుల మధ్య కలిగే ఆకర్షణే 'ప్రేమ' కాదనీ, ఒకరివల్ల మరొకరికి అవగాహన, అభిరుచులు అభిప్రాయాలలో సారూప్యం అవసరమనీ, అలా ఏర్పరచుకున్నవారి బంధం పెళ్లిగా స్థిరపడితే వారి జీవితం స్వర్గధామం అవుతుందనీ 'ప్రేమ'కు నిజమైన భాష్యాన్ని చెప్పడం.

రెండవది- నేనేమి చేయలేననీ, నేను అసమర్థుణ్ణనీ న్యూనతతో సోమరులుగా కాలం గడిపే శరత్‌లాంటివారిలో నవచైతన్యాన్ని స్వయంశక్తిపై ఆత్మవిశ్వాసాన్ని కలిగించి స్ఫూర్తిని ఇవ్వడం.

ప్రస్తుతం మనం అనుసరిస్తున్న పెళ్ళిచూపుల విధానంలో వధూవరులు కేవలం బాహ్యసౌందర్యంపై ఆధారపడతారు కాని వారి అంతఃసౌందర్యంతో, అభిరుచులతో, అభిప్రాయాలతో నిమిత్తంలేదు. మహాతత్త్వవేత్తకు గయ్యాళి భార్య లభించడం, కళలంటే అభిరుచిగల భార్యకు, వాటిని అసహ్యించుకొనే భర్త లభించడం చూస్తున్నాం. కాబట్టి యువతీ యువకులకు వారి జీవిత భాగస్వామిని ఎన్నుకోడానికి తగిన వ్యవధి, పరిస్థితులను కల్పించాలి.

ఆలోచనకు రూపం కల్పించిన నవల 'భ్రాంతి'. మరో చెప్పుకోదగిన అంశం- ప్రతి పాత్రనూ చక్కగా ఎనలైజ్ చేయగలగడం. ఉదాత్తమైన వ్యక్తిత్వాలకు ప్రతిరూపాలు శాలిని, వసంత్‌లు. శరత్ ముందుగా తన జీవితాన్ని ఒక ఆటగాతీసుకుని సోమరిగా ప్రవర్తించినా శాలిని,వసంత్‌లప్రోత్సాహంతో జీవితాన్ని ఒక ఛాలెంజ్‌గా తీసుకుని సాధించగలిగాడు. పెద్దలు వెంకట్రామయ్య, రుక్మిణీ నాథరావు, సరస్వతమ్మ, శకుంతల మొదట్లో మూర్ఖంగా ప్రవర్తించినా చివరకు తమ తప్పుతెలుసుకుని పిల్లల్ని దీవించారు. తమకు తగిన భాగస్వాముల్ని ఎన్నుకున్న తమ సంతానానికి తమ ఆశీస్సులు అందించారు. ఈవిధంగా సమాజంలో రావలసిన మార్పుకు రచయిత్రి ఆహ్వానం పలికారు. భ్రాంతి నవల అజ్ఞాన తిమిర సమాజంలో వెలుగురేఖలు ప్రసరింప చేసి 'క్రాంతి'ని ప్రోత్సహిస్తుందనడంలో సందేహంలేదు.

**–గుబ్బల సత్యనారాయణమూర్తి- ఏలేశ్వరం**

## భావుకత+సౌందర్యం=భ్రాంతి

**(ద్వితీయ బహుమతి రు.75/- పొందిన సమీక్ష)**

ఒక సాధారణ స్థాయిలో ఉన్న వ్యక్తి పట్టుదల ఉంటే జీవితంలో ఎలా ఉన్నత శిఖరాలు అధిరోహించగలడో ఆ పట్టుదలే లేకపోతే ఎలా దిగజారిపోతాడో తెలియజెప్పే నవల "భ్రాంతి". క్లుప్తంగా "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్న నానుడికి అక్షర నిర్వచనం ఈ నవల.

శరత్, శాలినిల మొదటి కలయికను ఎంతో సహజంగా, అందంగా మలిచారు రచయిత్రి.





కనీసం ఒక అరగంటపైనా మనసువిప్పి మాట్లా డుకోని వారికి సమాజం కారణంగా ఎన్నో అపవాదులు రావటం, చివరికి అనుకోకుండా పెళ్లి కుదరటం ఇదంతా అనేక మలుపుల్తో సాగుతూ కథకు కొత్తదనాన్ని తెచ్చిపెట్టింది.

యూనివర్శిటీలో వసంత్ చేసిన ఉప న్యాసం ఎంతో భావాత్మకంగా, మనసుల్ని మథించినట్లుగా ఉంది. వసంత్‌వంటి ఒక మంచి స్నేహితుడు దొరికినంత మాత్రాన శాలిని తను అంతగా ప్రేమించిన శరత్‌ను వదిలి వసంత్‌ను వివాహం చేసుకోవటానికి పూనుకోవటంలో అంత సహజత్వం కనుపించదు. శరత్‌ను తన కలల రాజకుమారుడి రూపంలో చూసి ఆశ్చర్యానందాలు పొందిన శాలిని అతను తన చదువుకు చేయూతనిచ్చాడనే కృతజ్ఞతాభావంతో మాత్రమే అతన్ని పెళ్ళాడటానికి ఒప్పుకున్నానంటుంది. "కృతజ్ఞత ప్రేమకాదు కదా!" అని స్నేహితురాలివద్ద తను చేసిన పనిని సమర్థించుకుంటుంది. కాని శాలిని, శరత్‌ల దృక్పథాలు వేరు కాబట్టి శాలినిని వసంత్‌తో కలపడం సముచితమే. ఆటగా జీవించాలని ప్రయత్నించి చివరకు ఆ ఆటలో ఓడిపోయి, మరొకరి అండకోసం ఎదురుచూసిన శరత్ పాత్ర నేటి సగటు భారతీయ యువకుని సజీవ జీవిత చిత్రణే.

ఈ నవలలో వసంత్ పాత్ర చెప్పుకోతగ్గది. రచయిత్రి తన భావుకతనంతా ఈ పాత్రలో చూపించారు. మనస్తత్వ శాస్త్రం తెలిసిన వ్యక్తి సుఖంగా ఉండగలడని చెప్పిన వసంత్ ప్రతి వారినీ తనదైన దృక్కోణంతో పరిశీలించి వారి కనుగుణంగా ప్రవర్తించిన తీరు ప్రశంసనీయం. నేటి నిరాశాపూరిత యువతకు ఇలాంటివారే ఆదర్శప్రాయులు.

భావుకత, సౌందర్యం, జీవితం వెరసి "భ్రాంతి" నవల.

– పి.వి.ఎల్.ఎన్.ప్రసాద్ - నెల్లూరు

## అలరించే సహజ నవల

*(తృతీయ బహుమతి రు.50/- పొందిన సమీక్ష)*

ప్రస్తుతం మార్కెట్‌లో విరివిగా దొరుకుతున్న మసాలా నవలలకు భిన్నంగా నూతన కథావస్తువుతో అలరించే సహజమైన నవల భ్రాంతి. వాస్తవికత ప్రధానంగా గల రచన ఇది.

నవలలో శాలిని - వసంత్‌ల జీవితం ఒకవైపున, శరత్ - సుజాతల జీవితం మరొకవైపున చిత్రించారు. వాళ్ళ జీవితాలు అలా ఎందుకున్నాయో, ఎవరు కారణమో కూడా తెలుపుతూ నవలా రచన జరిగింది. ఇది మంచి నవలకుండాల్సిన ముఖ్యగుణం.

రచయిత్రి కథావస్తువులో కూరుకుపోకుండా కథను నడిపించారు. పాత్రలతో మమేకమైపోలేదు. తన కథావస్తువుకు సంబంధించిన పడికట్టుమాటల్ని ఉపయోగించలేదు. కథావస్తువును గురించి పాఠకుడు తీవ్రంగా స్పందించేలా రచన సాగింది.

శాలిని తన చదువుకు, సంస్కారానికి సార్థకత చేకూర్చే విధంగా శరత్‌కు ఒక బ్రతుకుతెరువును సూచించి ఆత్మవిశ్వాసంతో జీవితాన్ని ఎదుర్కొనే ధైర్యాన్ని అతనిలో కలిగించే ముగింపు నవలకు సహజంగా వుంది.

ఊహాలోకాలలో విహరించే అసహజమైన కథావస్తువులతో విసిగిపోయిన తెలుగు పాఠకులకు ఈ నవల 'ఒక మంచి నవల చదివాము' అన్న తృప్తినిస్తుంది. అందుకు రచయిత్రిని మనసారా అభినందించాలి.

–జగదాంబ- తిరుపతి

## ప్రేరణ

*(రూ.25/-బహుమతిపొందిన సమీక్ష)*

"భ్రాంతి" నవలను చదువుతున్నపుడు నవల చదువుతున్నామనే భ్రాంతి కలుగకపోవడం విశేషం. నవలలోని పాత్రలు వారి మనఃప్రవృత్తి సహజంగా చిత్రీకరించారు రచయిత్రి. శాలిని, శరత్ ప్రేమికులయినప్పటికి చదువు విషయంలో భిన్నధృవాలు. వారి ప్రేమ విషయంలో శాలిని తల్లిదండ్రులు సగటు తల్లిదండ్రులుగా ప్రవర్తించడం, శరత్ తండ్రి వెంకట్రామయ్య ముందు శాలినిని నిరసించిన తరువాత ఆమెపై అభిమానం చూపడం, ఆమెను కోడలిగ చేసుకుని తన

ముఖచిత్రం: వాసు

"జ్ఞానతృష్ణ" తీర్చుకోవాలనుకోవడం ఈ నవలకు ఫ్లస్‌పాయింట్స్. సుజాత శరత్ శాలినికి కాబోయే భర్త అని తెలిసికూడా చొరవతీసుకోవడం, ప్రేమించడంలో అర్థంలేదు. శాలిని భర్తతో తొలిసారిగా పుట్టింటికి వచ్చినపుడు ఆవేశంలో అవమానించినా, తరువాత హొటలుకువచ్చి వాళ్లను యింటికి తీసుకెళ్ళడంలో కన్నవాళ్ళ ప్రేమను తెలియచేసినారు రుక్మిణీ నాథరావు, సరస్వతమ్మలు. సుజాత అభ్యర్థనపై శరత్‌ను ప్రగతివైపు నడిపించాలని, శాలిని అనుకోవడం అందుకు వసంత్ సహకరించడం బావుంది. కానీ నిజజీవితంలో "ఇలా జరుగుతుందా!" అని అన్పించకపోదు. ఏమయినప్పటికి శాలినివల్ల వ్యక్తిగా తీర్చబడిన శరత్ "నా తల్లివి, తండ్రివి, గురువు, ప్రేయసివి నీవే" నంటూ శాలిని పాదాల్ని స్పర్శించడంలో అతని వ్యక్తిత్వం వెళ్ళడవుతుంది. నేటి అమ్మాయిలకు "ప్రేరణగ" శాలిని పాత్రను చిత్రించిన రచయిత్రి అభినందనీయురాలు.

- కె.అనూరాధ- ఎమ్మిగనూరు

## అర్థవంతమైన ముగింపు

(రు.25/-బహుమతిపొందిన సమీక్ష)

ఈ నవలా యుగంలో తప్పకుండా రావల్సిన నవలే. వాస్తవంలో ప్రేమిస్తున్నామన్న భావాన్నే ప్రేమిస్తారు తప్ప అది నిజంగా "ప్రేమ"కాదు. సినిమాలు, నవలల్లోకూడా ప్రేమ దశలవారీగా, మొదటి కలయిక, రెండో కలయికలో కొంత సాహసం, మూడోసారికి సినిమా లేదా పిక్నిక్కు ఉత్తరాలు, రాత్రులలో కలలు- ఇలా చిత్రితమౌతున్నాయి ప్రేమలు. టీనేజ్ ప్రేమకూడా ఈ వరవడిలోనేసాగి, చదువుతోపాటే ఆగిపోతుంది. జీవితంలాగే ప్రేమనీ చాలా తేలికగా, థ్రిల్‌గానే భావిస్తున్నారందరూను. ఆ ఉరవడిలో ఒక గంటయినా ఆత్మావలోకన చేయగల్గితే తామేమిటో అర్థంచేసుకోగల్గుతారు యువత. కాని ఆ వయసు, వేగం అందుకు అవకాశమివ్వవు. అందుకు వయో, మానసిక పరిణతి అవసరం అన్న అంశాన్ని నొక్కిచెప్పారు రచయిత్రి. ఒక వయసులో ఎంతో ప్రభావంచూపి, ఉద్రూతలూగించే 'ప్రేమభావన' పరిణితిచెందాక, బాధ్యత తెలిసేక చాలా సాధారణము, సహజము అయిపోతుంది. ఆ పరిణితి సాధించేవరకు మనిషి ఓపికగా వేచిఉండాలి.

ప్రేమకు గమ్యం థ్రిల్ కాదు పెళ్ళి. పెళ్ళికి గమ్యం ప్రేమరాహిత్యం కాదు జీవనయానం అన్న అవగాహన కల్గించిందీ నవల. యువతరానికి ఇవన్నీ అర్థమయ్యేలా ఇతివృత్తాన్ని తీర్చిన తీరు, చెప్పినశైలి, 'ఎనలిటికల్ అవుట్ లుక్' అంటే ఏమిటో చూపేలా సమర్థవంతంగా చెప్పారు రచయిత్రి. ముగింపుకాస్త 'వేగం'గాఉన్నా స్త్రీపురుషులమధ్య బాధ్యతాయుతమైన స్నేహంకూడా ఉంటుందనే సందేశం అందించింది. ఇది కూడా యువతరం గ్రహించాల్సిన మరో అంశం. ఆబాలగోపాలమూ వెర్రెక్కిపోయే ప్రేమ కథల్లా ప్రారంభించి, భ్రాంతిని దూరంచేసే మనోపరిణతి విద్యద్వారా, జీవితంలో బాధ్యతాయుతమైన ఎదుగుదలద్వారా, సామాజిక స్పృహద్వారా సాధ్యమనే పాజిటివ్ దృక్పథంతో, "అంతామామూలుగానేఉంది" అనుకొనే ఉదాసీనత సోమరితనమని, దాన్ని వదుల్చుకొమ్మని మెత్తగానయినా సూటిగాచెప్తూ అర్థవంతమైన ముగింపునిచ్చిన రచయిత్రి అభినందనీయురాలు.

– పి.లక్ష్మిచూడామణి- భాకరాపేట

## చక్కని నవల

(రు. 25/-బహుమతి పొందిన సమీక్ష)

నేటి యువతలో నెలకొనివున్న 'భ్రాంతి' తొలగించి, వాస్తవాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రీకరించి తరాల అంతరాలమధ్య నేటి యువతి పాత్ర ఎలావుంటే బావుంటుందో 'శాలిని' పాత్రద్వారా చక్కగా చూపించారు రచయిత్రి.

వయసులో వున్న శరత్,శాలినిలమధ్య నిజమైన అవగాహన, ప్రేమ లేదనీ, అది ఒట్టి భ్రాంతేననీ నిరూపించారు. దానిలోపడి జీవితమంతా నరకప్రాయం చేసుకోకుండా ఆపాత్రల్ని ఆదర్శవంతంగా మలిచారు. శాలినిలాంటి





ఉన్నత భావాలు కలిగిన యువతికి వసంత్ లాంటి భర్త లభించటమే ఒక విశేషం. వసంత్ పాత్రద్వారా మగాళ్ళలోని మంచితనాన్ని చక్కగా చిత్రీకరించారు. గమ్యంలేని శరత్ జీవితాన్ని ఆదర్శంగా మలిచి, చాకులా తయారుచేసి సమాజంలోనికి పంపించటంద్వారా చక్కని ముగింపునిచ్చారు. స్నేహం, ప్రేమ, భ్రమలను విడదీస్తూ సమర్థంగా చిత్రీకరించారు.

పోతే 'ఇన్‌ఫాట్యుయేషన్', 'డిస్కొరెన్స్','హేండ్సమ్‌గై', 'ఆబ్సరిడిటీ' లాంటి ఆంగ్లపదాలు నవలలో ఎక్కువ. శరత్,శాలినిలను...''ఆకాస్తా కానిచ్చేశారా లేక మనువు వరకు ఆగుతారా?'' అని పాలేరు ప్రశ్నించటం, కాస్త ఎబ్బెట్టుగావుంది. నవల ప్రారంభంలో మందకొడిగా నడిచి సాయంత్రం చెరువుదగ్గర కలుసుకోవటం వంటి సన్నివేశాలతో వాస్తవానికి రవంత దూరంగావున్నా శాలిని మద్రాను వెళ్ళటం, వసంత్‌తో పరిచయం, ఆమె మానసిక సంఘర్షణ,జీవితంపై ఆమెకున్న నిర్దుష్ట అభిప్రాయాలు, వీటితో నవల వేగం పుంజుకుంది. వసంత్,శాలిని, వెంకట్రామయ్య పాత్రలు వున్నతంగా వున్నాయి.

కాసింత భావుకత, మరికాసింత వాస్తవికత రంగరించి నేటి యువతకు అందించిన చక్కని నవలగా భ్రాంతిని చెప్పుకోవచ్చు.

''డిగ్రీలు కూడు పెట్టవు. కాని అవి అవసరం'', ''శరత్... ఇహనుంచీ ఎప్పుడూ ఇది నావల్లకాదు. నేను చెయ్యలేను'' అనే మాటలు నాదగ్గర అనకు. అవి ఎంత నీచమైన, దిగజారుడు మాటలో అర్థమయ్యాయా?''- వంటి డైలాగులు చాలా కాలం జ్ఞాపకం ఉంటాయి.

నేటి సమాజంలో యువతి అంటే 'శాలిని'లా వుండాలనిపించేవిధంగా మలిచారు ఆపాత్రను. స్త్రీ సహజమైన లాలిత్యం, తియ్యని వూహలు, చదువు, స్వతంత్రభావాలు, మంచి స్నేహం, గౌరవం, స్థిరమైన నిర్ణయం, సాధించగలననే ధీమా...అన్నీ కలబోసి 'శాలిని'గా తీర్చిదిద్దారు రచయిత్రి. ఈ నవల చదివి కొందరిలోనైనా ''భ్రాంతి''చెదిరిపోయి...వాస్తవికత కళ్ళముందు కదలాడితే ఈ నవల ప్రయోజనం నెరవేరినట్లే!

— అడుసుమిల్లి మల్లికార్జున- కావలి

## 'హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే'

మా నవలపై శ్రీ వంతుల బాలసుబ్రహ్మణ్యశర్మగారి సమీక్ష మాకు తీవ్ర మనస్తాపాన్ని కలిగించింది. శ్రీ శర్మగారు మా ఈ నవల ఇతివృత్తంతోనే పాతిక, ముప్పయ్యేళ్ళ క్రితం ఒక ప్రముఖ వార పత్రికలో 'గులాబిముళ్ళు' అనే సీరియల్ నవల వచ్చినట్లూ, దాన్నే ఈనాటి పరిస్థితులకు అనుగుణంగా మార్పు చేసి మేము తిరిగి రాసినట్లూ మాపై పరోక్షంగా నిందారోపణ చేశారు.

'ఈ తరం పాఠకులకు ఈ ఇతివృత్తం కొత్తదే. అంతవరకూ అది రచయితలకు విజయమే' అనే శ్రీ శర్మగారి వాక్యాలు పిల్లి గిల్లి జోల పాడినట్లున్నాయి. గమ్మత్తైనదేమిటంటే మేమూ ఈ తరం పాఠకులమే, రచయితలమే కావడం. మాలో కోలపల్లి ఈశ్వరరావు వయసు 27, యం.ఐ.కిషన్ వయసు 35 సంవత్సరాలు.

పాతిక, ముప్పయ్యేళ్ళ క్రితం ఎవరో రాసిన, ఏదో వార పత్రికలో ప్రచురింపబడిన సదరు 'గులాబిముళ్ళు' అనే సీరియల్‌ను మాలో ఏ ఒక్కరూ చదవలేదన్నది మాత్రం యదార్థం.

మేమేదో చౌర్యానికి పాల్పడ్డామన్న అభిప్రాయాన్ని పాఠకులలో కలగచేసిన శ్రీ శర్మగారు సదరు 'గులాబిముళ్ళు' నవల ఏ సంవత్సరం, ఏవార పత్రికలో ప్రచురింపబడినదీ తెలియజేయటం న్యాయం. పాఠకుల ఆరోపణలోని నిజానిజాలు తెల్సుకోవడానికి సదరు వివరాలు స్పష్టంగా ఇవ్వాలి కదా?దయచేసి ఆ వివరాలను పత్రికాముఖంగా తెలియజేయవలసిందిగా శ్రీ శర్మగారిని కోరుతున్నాము.

శ్రీ వంతుల బాలసుబ్రహ్మణ్యశర్మగారు తమ ఆరోపణ నిరూపించుకోగలిగితే మేము యావత్ పాఠక లోకం ముందు దోషులుగా తల దించుకుంటాం.

ఓ అస్పష్టమైన చిన్న లేఖ ద్వారా ఓ యువ రచయితల జంట భవితవ్యానికి సమాధి కట్టే హక్కు ఉంటుందని ఎవరూ భావించరనే నమ్ముతున్నాం.

— కోలపల్లి ఈశ్వరరావు

— ఎం.ఐ.కిషన్

# చతుర

సంపుటి: **12** డిసెంబర్: **1989** సంచిక **11**

ఇరవై సంవత్సరాలు తన కుటుంబమే లోకంగా బ్రతికిన ఆమె వేరే ప్రపంచం ఒకటుందనే విషయమే మరిచి పోయింది. వాళ్ళకోసం తన సరదాలు అణచుకుంది.

తను దైవంగా భావించిన భర్త 'నన్నర్థం చేసుకో' అంటూ దూరం చేసినపుడూ, ఇన్నేళ్ళూ తన మమకారాన్ని రుచిచూసిన, కన్నకూతురే 'రేపొద్దున్నే వెళ్ళిపోమ్మా' అన్నప్పుడూ, అన్యాయాన్నెదిరిస్తుందనుకున్న చిన్నకూతురు 'జరగాల్సిందేమిటో చూసుకోవాలి గానీ ఒకరిని తిడితే ఏం లాభం' అని తనకు ఎదురు నీతులు చెప్పినప్పుడూ ఆమె గుండెలు వ్రయ్యలయ్యాయి.

కానీ... అనుకోని పరిస్థితులెదురై ఆమెను పూర్తిగా మార్చివేస్తే!!

అలాంటి స్థితిలో ఆమె తీసుకున్న నిర్ణయాలేమిటి? ఆమెలోని ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి, వివేకాన్ని మేల్కొల్పిన పరిస్థితులు ఏ రూపంలో ఎదురయ్యాయి? పిరికి మనిషిగా, అబలగా వున్న ఆ మనిషి

## మానవి

గా ఎలా మారగలిగింది? తన లక్ష్యం వైపు ఏ విధంగా పయనించింది?

విలువైన జీవితాన్ని వేదనతో, రోదనతో కాకుండా లక్ష్యసాధనకోసం కృషి చేస్తూ అర్థవంతంగా గడపాలని ఆదేశిస్తూ సాగిన ఓల్గా నవల మానవి ఈ నెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.



'రైలు దిగగానే రోహిణీవాళ్ళింటికి వెళ్ళిపోవాలి' కృష్ణా ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కాక ఈ మాట వందోసారి అనుకుంది వసంత.

'రోహిణి అప్పటికి ఆస్పత్రి నుంచి వచ్చేస్తుంది. ఇద్దరం కలిసి భోంచేస్తూ కబుర్లు చెప్పుకోవాలి'- అనుకుంది.

పదేళ్ళ తర్వాత మళ్ళీ గుంటూరు వస్తున్నానన్న ఆనందం రైలెక్కినప్పటినుంచీ వసంత ముఖంలో దాగనంటూ బైటికి వస్తూనే వుంది.

ఎదుటి సీట్లలో ఉన్నవాళ్లెవరైనా పరీక్షగా చూస్తే హఠాత్తుగా ఆమె పెదవులమీద చిరునవ్వు మొలవటం, కళ్లు అరమోడ్పుగా మూసుకోవటం, చెక్కిళ్ళు ఎర్రబడటంలాంటి లక్షణాలు గమనించి "ఈమెగాని ప్రేమలోపడిందా" అని ఆశ్చర్యపడేవారే- ఆశ్చర్యం ఆమె వయసుని చూసి. వసంతకు రెండునెల్ల కిందటే నలభై ఏళ్ళు నిండాయి.

కానీ వసంత ఇప్పుడు నిజంగానే ప్రేమలో పడింది, గుంటూరుతో- గుంటూరులోని గత జీవితంతో- పాత స్నేహితుల జ్ఞాపకాలతో.

ఎప్పటి గుంటూరు-

అయినా వసంతకింకా బాగా జ్ఞాపకమే.

రైలు దిగగానే రిక్షా ఎక్కగానే తాను వెళ్ళేదంతా కళ్ళకు కడుతూనే వుంది.

గవర్నమెంటు ఆస్పత్రి రోడ్డు మీదుగా- ఆ సత్రం అలాగే వుందో లేదో? బ్రిడ్జి ఎక్కి దిగి, శంకర్ విలాస్ మీదుగా తాలూకా ఆఫీసు దాటి తిన్నగా హరిహర మహల్‌దాకా వెళ్ళాలి. ఇంట్లో రోహిణి ఎదురుచూస్తూనే ఉంటుంది.

బ్రిడ్జి ఎక్కబోయే ముందు ఒక్కక్షణం రిక్షా వెనక్కు తిప్పి తను చదివిన కాన్వెంటూ, కాలేజీ చూసి వస్తేనో- అనిపించింది వసంతకు.

రోహిణితో కలిసి వెళ్ళొచ్చులే అనుకుంది.

గుంటూరు స్టేషన్ వస్తుంటే 'ఈ గాలే వేరు' అనుకుని గుండెల నిండా గాలి పీల్చుకుంది.

అయితే వసంత అనుకున్నట్లు రోహిణి హాస్పిటల్ నుంచి ఇంకా ఇంటికి రాలేదు. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది.

స్నానం చేసి బద్ధకంగా పడుకుంది వసంత. మూడు గంటలవుతుండగా రోహిణి వచ్చి వసంతను లేపింది.

"పదేళ్ళ తర్వాతగాని తీరిక దొరకలేదన్న మాట గుంటూరు రావటానికి" అంది రోహిణి నవ్వుతూ.

"నీ ఉత్తరం చూసి నేను నమ్మనే లేదు. 'అలాగే రాస్తుందిగానీ ఇల్లు కదలదు' అని చెప్పాను రామారావుతో కూడా" అంది.

"బాధ్యతలన్నీ పూర్తయ్యాయిగా! ఇక ఇప్పుడు తీరిక చిక్కింది" నవ్వుతూ అంది వసంత. "అప్పుడే ఏం పూర్తయ్యాయి? మీ రెండోదాని పెళ్లి మిగిలే ఉందిగా" డైనింగ్ టేబిల్‌మీద ప్లేట్లూ, గ్లాసులూ పెడుతూ అంది రోహిణి.

"దాని పెళ్ళా- నేను చేసే పెళ్ళి అది చస్తే చేసుకోదు. అసలు పెళ్ళి చేసుకుంటుందా అన్నది కూడా అనుమానమే" అంది వసంత కంచాల్లో అన్నం వడ్డిస్తూ.

"అంత చురుకా?"

"చురుకో గిరుకో గానీ- నా ప్రాణం విసిగిపోతోందనుకో. అది వైజాగ్‌లో ఇంజనీరింగ్ చదవటమే నాకిష్టం లేదు. తండ్రీ కూతుళ్ళు కలిసి తమ పంతం నెగ్గించుకున్నారు. పెద్దదానికి అప్పుడే పెళ్ళిచేశానని ఆయనకు నామీద కోపం. నేనేం చెయ్యను చెప్పు. అది డిగ్రీ అయ్యాక మరి చదవనో అని రెండో సంవత్సరం నుంచే గంట వాయించి మరీ చెప్పింది. అందుకని మూడో ఏడు పరీక్షలు రాసేసరికి సంబంధం చూసి వుంచాను. దానికి నచ్చింది... చేసుకుంది. నేను లావణ్యను చెడగొట్టానని మా ఆయనా నవతా కలిసి నన్ను నానా మాటలూ అంటారనుకో" వసంత తన గోడంతా వెళ్ళబోసుకుంది.

"బాగుంది- పిల్ల పెళ్ళిచెయ్యటమంటే చెడగొట్టటమా?" రోహిణి నవ్వింది.

"అయ్యో- నీకు తెలియకపోతే మా నవతనడుగు చెబుతుంది. ఏదో ఒక వృత్తిలోనో, ఉద్యోగంలోనో స్థిరపడకుండా ఆడవాళ్ళు పెళ్ళిచేసుకోగూడదట. నువ్వసలు బి.ఎ చదవగానే పెళ్ళెందుకు చేసుకున్నావని నామీద ఒకటే పోట్లాడుతుంది"

రోహిణి పెద్దగా నవ్వుతుంటే వసంత కూడా




కూతురి మీద కోపం మర్చిపోయి నవ్వేసింది.

ఇద్దరూ ఒకరి సంసారపు కబుర్లు ఒకరు తెలుసుకున్నారు. రోహిణి ఇంటినీ, ఇంటి ముందున్న తోటనూ చూసి మెచ్చుకుంది వసంత.

"నా ఇల్లు చూసుకుని నేను గర్వపడతాను గానీ నువ్వొకపక్క డాక్టరుగా ప్రాక్టీసు చేస్తూ ఇంటినింత బాగా వుంచుతున్నావంటే ప్రత్యేకించి మెచ్చుకోవాలి" అంది వసంత.

నిజంగానే రోహిణి ఒక్క క్షణం ఊరికే కూర్చోదు. హాస్పిటల్ నుంచి వచ్చిన దగ్గర నుంచీ ఏదోఒక పని చేస్తూనే ఉంటుంది. అలమరాలు దులిపి సర్దటం, వంటిల్లు దగ్గరుండి సర్దించడం, పిల్లల చొక్కాలకు గుండీలు ఊడిపోతే కుట్టడం, బట్టలు ఇస్త్రీ చేయడం - ఇలా ఏదోఒక పని. ఇంటికి మెరుగులు దిద్దే పని - ఇంట్లోవాళ్లకి మరికాస్త సౌకర్యంగా వుండేపని చేస్తూనే వుంటుంది. బద్ధకం అన్నది ఆమెకు తెలియదు. ఎవరన్నా స్నేహితులొచ్చినా ఏదోఒక పని చేస్తూనే మాట్లాడుతుంది. ఐనా అప్పుడప్పుడూ చిరాకూ, అసహనం తప్పవు. రాత్రిళ్లు డెలివరీ కేసులు వస్తే రాత్రంతా నిద్రలేక ఉదయం పిల్లలు బడికి వెళ్ళే వేళకు లేవలేకపోతుంది. వాళ్ళు ఏ బ్రెడ్డో, జామో తిని తలలు వాళ్లకు చాతనైనట్టు దువ్వుకుని ఎలాగోలా బడికి వెళ్లిపోతారు. మధ్యాహ్నం వాళ్లకు భోజనాలు పెట్టడం కూడా రోహిణికి కుదరదు. అన్నీ టేబిల్‌మీద సర్దితే వాళ్లే పెట్టుకుతింటారు. సాయంత్రం వాళ్ల చదువులు ట్యూషన్ మాస్టరు చేతిలో పెట్టకతప్పదు. భర్త తన కేసుల గొడవతప్ప ఏమీ పట్టించుకోడు. అతను లాయరు. ఆదివారాలు కూడా క్లయింట్లు అతన్ని ఒదిలిపెట్టరు. ఆదివారాలు తనకు సీరియస్ కేసులు రాకుండా వుంటే రోహిణి పిల్లలతో కాలక్షేపం చెయ్యగలుగుతుంది.

"ఒక్కోసారి ఈ ప్రాక్టీస్ మానేద్దామా అన్నంత విసుగొస్తుంది వసంతా - మరీ పిల్లల గురించే నా దిగులంతా. మా పాపకి పదేళ్ళు. కానీ నాకంటే బాగా ఇల్లంతా చక్కబెడుతుంది. దానికి బాల్యం అనేది లేకుండా చేశానా అనిపిస్తుంది. పదేళ్లప్పుడు నేనెలా ఎంత హాయిగా ఉండేదాన్నో ఆలోచిస్తుంటే దిగులనిపిస్తుంది. మళ్లీ ఈ ప్రాక్టీసు లేకుండా వుండలేను. అపుడు జీవితం ఎందుకూ పెళ్లిచేసుకుని పిల్లల్ని కనటానికేనా - దానికోసం ఈ డాక్టరు చదువెందుకు అనిపిస్తుంది. నీకే దిగుళ్ళూ లేవు. హాయిగా పిల్లల్ని పెంచి సెటిల్ చేశావు"

"ఏం సెటిల్ చేశానో - మా నవత గురించి నాకెంత దిగులో నీకు తెలియదు. ఆ ఇంజినీరింగు చదివాకయినా పెళ్ళిచేసుకుంటుందో లేదో అనే భయంతో నాకొక్కో రోజు నిద్రపట్టదంటే నమ్ము"

"ఎందుకు చేసుకోదులే - అన్నట్టు శాంత మన కాలేజీకి ప్రిన్సిపాల్‌గా వచ్చింది తెలుసా?" రోహిణి విషయం మార్చేసింది.

"శాంతా - ఇక్కడే ఉందా? దానికి పిల్లలెంతమంది?" హడావుడి పడింది వసంత.

"శాంత పెళ్లేచేసుకోపోతే పిల్లలంటావు - బి.ఎ అయ్యాక శాంత గురించి పట్టించుకోలేదు నువ్వు" నిష్ఠూరంగా అంది రోహిణి.

"పెళ్ళి కాలేదా - అయ్యో పాపం - ఎందుకనీ?"

శాంత గురించిన జ్ఞాపకాలు వసంతను చుట్టుముట్టాయి. ఒకటో తరగతి నుంచీ బి.ఎ వరకూ శాంతావసంతలు కలిసి చదువుకున్నారు. బి.ఎ తర్వాత పెళ్లయి వసంత హైదరాబాద్ వెళితే శాంత ఎమ్.ఎ చదవడానికి విశాఖపట్నం వెళ్లింది. ఆ తర్వాత అపుడపుడూ ఉత్తరాలు రాసుకున్నా క్రమంగా ఆగిపోయాయి. అప్పుడప్పుడూ కొందరు స్నేహితుల కబుర్లు వినబడేవిగానీ శాంత మాట ఎవరూ చెప్పేవారు కాదు. కానీ శాంత స్నేహం వసంత మనసులో దీపంలా ఓమూల వెలుగుతూనే ఉంది.

పదేళ్లనుంచి పదిహేనేళ్లదాకా ఇద్దరికి సావిత్రి పిచ్చి. సావిత్రి నటించిన సినిమాలు ఒక్కోటి రెండుసార్లు చూసేవారు. సినిమా పత్రికల్లో వచ్చే బొమ్మలన్నీ జాగ్రత్తగా కత్తిరించి తెల్ల కాగితాల మీద అంటించి పుస్తకంగా కుట్టేవారు. పదో తరగతిలో ఓ అమ్మాయి జమున పార్టీని తయారుచేసింది. సావిత్రి పార్టీకీ, జమున పార్టీకీ మధ్య జరిగే తగాదాల్లో ఎలాగోలా శాంత తమకు విజయం సాధించి



పెట్టేది.

ఆ తర్వాత నవలల పిచ్చిపట్టుకుంది. నవలలన్నీ తెగచదివేవాళ్ళు. రంగనాయకమ్మ నవలల్లో మొగుడులాంటి మొగుడు తమకు దొరక్కూడదని ప్రార్థించేవాళ్ళు. సులోచనారాణి హీరో ఎలాగూ దొరకళ్ళే అని నిట్టూర్చేవాళ్ళు. రోజూ స్కూలుకి రాగానే ఏవో కబుర్లు గబగబా అరగంటైనా మాట్లాడుకోందే క్లాసుకి వెళ్ళేవారు కాదు. "చిత్రం - పెళ్ళయ్యాక శాంతను మర్చిపోయాను" ఆలోచనలు ముగిసేలోగానే ఇద్దరూ నిద్రలోకి జారిపోయారు.

మర్నాడు ఉదయం రోహిణి ఆస్పత్రికి ఎగ్గొట్టింది. ఇద్దరూ ఎడతెగని కబుర్లేవో చెప్పుకున్నారు. సాయంత్రం యిక తప్పనిసరై ఆస్పత్రికి వెళ్లటానికి తయారయింది రోహిణి.

"నువ్వు ఆస్పత్రి నుంచి వచ్చేదాక ఏం చెయ్యను. శాంత దగ్గరికి వెళ్ళొస్తాను" అంది వసంత.

★ ★ ★

ఉమెన్స్ కాలేజీని చూడగానే గుండె గొంతులోకి వచ్చినట్లయింది వసంతకు. ఆ తోటా, క్లాసు రూంలూ. అన్నీ ఒక్కసారి చిరునవ్వుతో వలకరించినట్లనిపించింది అప్పటి చెట్లు కొన్ని ఇంకా ఉన్నాయి.

పరిచయమైన బాట వెంటే ప్రిన్సిపాల్ ఇంటివైపు నడిచింది.

'పాపం శాంత- పెళ్ళి కాలేదు. ఒక్కతే ఎలా ఉంటుందో' అనుకుంటూ కాలింగ్‌బెల్ నొక్కింది.

పనిచేసే అమ్మాయి కాబోలు తలుపుతీసి "అమ్మగారు రాసుకుంటున్నారు- కూచోండి" అని వరండాలో కూచోబెట్టి వెళ్ళింది.

మరో నిమిషంలో వచ్చి పేరు కనుక్కుని వెళ్ళింది. వసంత ఇబ్బందిగా కూర్చుంది. నేరుగా ఇంట్లోకి వెళ్ళకుండా ఇలా వరండాలో కూర్చోవాల్సి రావడం ఎలాగో వుంది.

తన భర్త కోసం ఎవరైనా వస్తే వసంత ఇలాగే కూచోబెడుతుంది. శాంత కూడా అంత స్థాయికి చేరుకుందంటే బాధలేదుగానీ ఎందుకో శాంత ఇలాంటి పద్ధతులన్నీ పెట్టుకోకుండా ఇంటికొచ్చినవాళ్ళను తనే ఆహ్వానిస్తే బాగుండేదనిపించింది వసంతకు. పది నిముషాలకుగాని శాంత రాలేదు.

శాంత రాగానే ఎందుకో తనకు తెలియకుండానే లేచి నిలబడింది వసంత. శాంత వసంతను గుర్తుపట్టడానికి రెండు నిమిషాలు పూర్తిగా తీసుకుంది.

"వసంతా... నువ్వా! మైగాడ్- ఇప్పుడు ఇంత హఠాత్తుగా- ఎవరో అనుకున్నా. హాస్టల్ పిల్లల తల్లులెవరన్నా వచ్చారేమో అనుకున్నా. రా... కమాన్" అంటూ భుజంమీద చెయ్యివేసి చనువుగా లోపలికి నడిపించింది. వసంతకు బెరుకు తగ్గిందిగానీ బిడియం హెచ్చింది. కుశలప్రశ్నలూ, అతిథిమర్యాదలూ పూర్తయిన తర్వాత కూడా కాసేపు ముభావంగానే ఉండిపోయింది. పూర్వపు శాంత కాదీ శాంత అనిపించింది.

"చెప్పు... ఏంటి కబుర్లు?" శాంత ఉత్సాహంగా అడిగింది.

"ఇంత ఇంట్లో ఒక్కదానివే ఉంటున్నావా?"

"ఊఁ- పెళ్ళి చేసుకోలేదు. తమ్ముడి పిల్లలూ, మా సుజాతావాళ్ళూ వస్తుంటారు సెలవలకి. అప్పుడు ఇల్లంతా ఒకటే గోల"

"పెళ్ళెందుకు చేసుకోలేదు" శాంత బాధపడుతుందేమో అనే ఆలోచన తట్టేలోగానే ఆ ప్రశ్న వేసేసింది వసంత.

"నా చదువయ్యేసరికి మానాన్న పోయారు. అన్నయ్య తన దారి తను చూసుకున్నాడు. నేను ఉద్యోగం సంపాదించుకుని మా తమ్ముణ్ణీ, చెల్లినీ చదివించి వాళ్ళకు పెళ్ళిళ్ళు చేసీ కాలం గడిపేశాను. పెళ్ళి గురించి ఆలోచించేసరికి ఆ వయసు దాటింది. నాకూ చేసుకోవాలనిపించలేదు--" శాంత ఏమీ బాధపడకుండా మామూలుగానే చెప్పింది.

వసంత తన సంసారం గురించీ, పిల్లల గురించీ చెప్పింది. "పదేళ్ళ తర్వాత గుంటూరు ఇప్పుడే వచ్చాను తెలుసా శాంతా! పెళ్ళి అయితే ఇక ఆ లోకమే వేరనుకో. భర్తా, పిల్లలూ, వాళ్ళ బాధ్యతలూ వాళ్ళకే లోటురాకుండా చూసుకోవటం- నీ కాలేజీ పనికంటే తక్కువేంకాదు. ఎంత కష్టపడితే అంత తృప్తి. రోహిణి పాపం అటు ఉద్యోగం, ఇటు పిల్లలతో నలిగిపోతోంది. పిల్లలకు కడుపునిండా తిండి

కూడా పెట్టుకోలేకపోతోంది. దాన్ని చూస్తే ఎందుకీ ఉద్యోగాలు అనిపిస్తుంది. మా ఇద్దరు పిల్లలకీ ఏ లోటూ రాకుండా పెంచాను. ఆయన బైటిపని నిశ్చింతగా చూసుకోగలిగారంటే అదంతా నావల్లే. ఆయన జేబులో కర్చీఫ్‌తోసహా టైమ్‌కి అన్నీ సిద్ధంచేస్తాను. ఇప్పటికీ నేను లేకపోతే ఆయన ఎంత అవస్థపడతారో నేనిక్కడుండే ఈ వారంలో ఆయన పాపం ఎలా బతుకుతారో- అది తల్చుకుంటే వెంటనే వెళ్లిపోవాలనిపిస్తుంది'' తృప్తిగా గర్వంగా మెరుస్తున్న కళ్ళతో మాట్లాడుతున్న వసంతను చూసి మనస్ఫూర్తిగా ఆనందించింది శాంత. ''నీ ఆనందం చూస్తుంటే నాక్కూడా పెళ్ళిచేసుకుని తల్లినైపోవాలని ఉంది'' అంది కూడా.

''నిజంగానే నువ్వు చాలా పిచ్చిపని చేశావు. పెళ్ళి, సంసారం లేకుండా ఒంటరిగా బతకటం ఎందుకే- నాకు ఊహించుకోటానికే భయంగా ఉంది'' అంది శాంతవైపు జాలిగా చూస్తూ.

''ఏమో- నాకు నా జీవితం కూడా బాగుందే- నా ఉద్యోగం నా హాబీలు. వీటితో కాలం బాగానే గడిచిపోతోంది. ఒంటరిగా అనిపించడంలేదు. ఒక్కోరోజు తీరికే దొరకదు.

ఇద్దరూ ఎవరి జీవితాలను వాళ్ళు రెండోవాళ్లకు పరిచయం చేసే పనిలోపడ్డారు. శాంత తను సేకరించిన సంగీతపు క్యాసెట్లను చూపించింది. వీణ తీగలు మీటి చూపింది. తను ఆర్థిక విషయాల గురించి రాసిన వ్యాసాలు చూపించింది.

వసంత భర్త ప్రేమ గురించీ ఆయన తనమీద ఎలా ఆధారపడేదీ వివరంగా చెప్పింది. తను ఇల్లు ఎలా చక్కదిద్దుకునేదీ చెప్పింది. పెద్దకూతురు లావణ్యా పెళ్ళివిశేషాలన్నీ వినిపించింది. చిన్నకూతురు నవత గురించి దిగులుపడింది. ''నీలాగే అవుతుందేమోనే'' అంది బెంగగా.

''నాకేమే ... నేను దర్జాగా ఉన్నా. నాలాగా అయితే నువ్వు దిగులుపడటానికేం లేదు'' అంది శాంత. ఆ రాత్రికి అక్కడే పడుకుంటానని రోహిణీ అన్నపూర్ణకి ఫోనుచేసి చెప్పింది.

''ఏ టెన్షనూ లేకుండా నా అంతట నేను వేరేచోట ఉండటం ఇదే మొదటిసారి. ఇది కూడా బాగానే వుందే'' అంది చిన్నపిల్లలా.

''ఊఁ... నే చెబుతుంటే నమ్మవేం. పెళ్ళి చేసుకోకపోయినా ఏమీ అవదు. హాయిగానే ఉంటాం''

''సరేగాని- అసలు మగాడితోడు లేకుండా ఎలా ఉన్నావే- తోడంటే అదే-''

''అర్థమయిందిలే- ఆ తోడు నాకుందిలే'' అంది శాంత తేలిగ్గా.

''అంటే-''

''అంటే- నాకో ఎఫయిర్ ఉందిలే. అప్పుడప్పుడూ అతను వస్తుంటాడు. సెలవల్లో ఇద్దరం కలిసి ఎక్కడికైనా వెళ్తుంటాం... ఏంటది... అలా అయిపోయావు'' పాలిపోయిన వసంత ముఖం వంక చూసి నవ్వింది శాంత ''మరి- మరి- అతన్నెందుకు పెళ్ళి చేసుకోలా-''

''అతనికి పెళ్లయిపోయింది''

''పెళ్లయిపోయిందా''

వసంత నోట మాటరాలేదు. పెళ్లయిన అతనికి ఉంపుడుగత్తెగా ఉంటోందా శాంత. అసహ్యంతో ఒళ్లంతా జలదరించినట్లయింది. ఇదేంపని. అసలీ ఖర్మెందుకు లక్షణంగా పెళ్ళి చేసుకోక. అతనెక్కడ దొరికాడు? అతని పెళ్ళాం ఏం చేస్తోంది? అంత ఇష్టమైతే శాంతను చేసుకోకపోయాడా? ఆ పెళ్ళాన్ని వదిలి శాంతను చేసుకోకూడదా? వసంత మెదడంతా అశాంతితో నిండిపోయింది.

''పెళ్ళయిన అతన్తో ఏమిటే?''

శాంత నవ్వి ఊరుకుంది.

''పాపం. ఆ పెళ్ళాం గతేమిటి - ఆమెకిది తెలుసూ?''

''ఏమో - బహుశా తెలిసేవుంటుంది''

''పాపం - ఆవిడ నీకువడి ఎంత ఏడుస్తోందో''

స్నేహితురాలిమీద ఎంత ప్రేమ ఉన్నా ఆ మాట అనకుండా ఉండలేకపోయింది వసంత. శాంత ముఖంలో నవ్వు మాయమయింది. ఐదు నిమిషాలసేపు ఇద్దరూ మాట్లాడకుండా కూర్చున్నారు.

''ఛా... ఇంకో ఆడమనిషి ఉసురు పోసుకుంటావనుకోలేదే. ఈ పని నాకేం నచ్చలేదు''





అంది వసంత మళ్ళీ అసహనంగా.

"నీకు తెలియని ఆ మనిషి మీద చూపించే శ్రద్ధలో జాలిలో కాస్తయినా నామీద చూపించవేం వసంతా - నాగురించి ఆలోచించవేం?"

"నీ గురించి ఆలోచిస్తున్నా కాబట్టే నువ్వు చేసిన పని మంచిపని కాదంటున్నా"

"మంచి పని అని నేను చెప్పానా?"

"చెడ్డపని అని తెలిసి చెయ్యడం ఎందుకు?"

"చెడ్డపని అని నేను అనుకోవడంలేదు"

"మంచీగాక, చెడ్డాగాక ఏం పని అది? ఏమన్నా అర్థం వుందా ఆ పనిలో"

"మంచికీ చెడ్డకీ మధ్య జీవితం ఉంది వసంతా... నా జీవితం ఉంది. నేను ప్రేమ కోసం పురుషుడికోసం ఆరాటపడ్డాను - నా పరిస్థితులవల్ల మామూలుగా జరగాల్సిన పెళ్ళి జరగలేదు. డబ్బూ, కుటుంబ బాధ్యతలూ, చెల్లెళ్ళూ, తమ్ముళ్ళూ అన్నీ చుట్టుముట్టాయి. జరిగిందేదో జరిగింది. ఇంతే నా జీవితం అని సరిపెట్టుకునేంతలో రాధాకృష్ణ పరిచయమయ్యాడు. ఇద్దరికీ మంచి స్నేహమయింది. అతనికి బి.ఏ. చదువుతుండగానే మామయ్య కూతురితో పెళ్ళయింది. ఆమె అంటే ఇష్టమూ లేదు, ద్వేషమూ లేదు. మామూలుగా సంసారం చేస్తున్నాడు. మా స్నేహం మా ఇద్దరి జీవితాల్లోనూ అపురూపం. చాలా జాగ్రత్తగా కాపాడుకుంటాం"

"పోనీ ఆ భార్యంటే ఇష్టంలేదంటున్నాడుగా- విడాకులు తీసుకుని నిన్ను పెళ్ళిచేసుకోవచ్చుగా-"

"నేనే ఒద్దన్నాను"

"నీకు పిచ్చెక్కింది"

"లేదు- పిచ్చెక్కలేదు. ఇద్దరు పిల్లలతల్లి. ఆమె మళ్ళీ పెళ్ళిచేసుకోలేదు. ఒంటరిగా బతకాలి. ఇవన్నీ నాకారణంగా ఆమెకెందుకు. నాకు పెళ్ళి అక్కర్లేదు. రాధాకృష్ణ ప్రేమ కావాలి. నాకు హక్కులక్కర్లేదు. గుర్తింపు అక్కర్లేదు. రాధాకృష్ణ నా భర్తకాదు. ఒక మనిషి. నాకు నచ్చిన మనిషి. ఆ మనిషిని మనిషిగా నేను ప్రేమిస్తున్నాను. ఆ ప్రేమను నేను కంట్రోల్‌చెయ్యలేదు. అతనూ కంట్రోల్ చెయ్యలేడు. ఎందుకు చెయ్యాలి? సంవత్సరానికో నెలరోజులు మేం స్త్రీపురుషుల్లా బతికితే ఈ ప్రపంచం తల్లక్రిందులవుతుందా?" శాంత ఆవేశంగా అడిగింది.

"ఏమో... నీకుమాత్రం ఏం గౌరవం. ఎవరికో ఉంపుడుగత్తెగా-"

"వసంతా-"

"సారీ శాంతా..."

"ఫరవాలేదు- చరిత్రలో చాలామంది స్త్రీలు ఉంపుడుగత్తెలుగా ఉన్నారు. భార్యాభర్తల బంధం లేని ప్రతి ప్రేమలోనూ స్త్రీ ఉంపుడుగత్తె అయింది. నాకు భార్యగా ఉండటంకంటే ఉంపుడుగత్తెగా ఉండటమే బాగుంది. అది అగౌరవం అనుకోను. కానీ వసంతా-

పెళ్ళికి డబ్బుకావాలి.

పెళ్ళికి అందం కావాలి- పెళ్లికి వయసుకావాలి- పెళ్ళికి ఇంకా చాలా కావాలి.

ఆ పెళ్ళి నుంచి విడిపోతే మళ్ళీ పెళ్ళికాదు. సెక్యూరిటీ ఉండదు.

కానీ నాకు ప్రేమకావాలి. నాకు మనిషి కావాలి. నాక్కావాల్సిన మనిషి నాకు దొరకటానికి రెండు పెళ్ళిళ్ళు అడ్డం-

నాకు కాని పెళ్ళి

అతనికి అయిన పెళ్ళి-

డబ్బు, వయసు- వీటి ప్రమేయం లేకుండా స్త్రీపురుషుల బంధం కుదిరినా

పెళ్ళయి విడిపోయిన ఆడదానికి బతుకు దుర్భరం కాకపోయినా

మా సంబంధం ఇలా ఉండేదికాదు.

నాది అవినీతి అనేముందు నీతి గురించి ఆలోచించు. దానికీ డబ్బుకీ వున్న సంబంధాన్ని గురించి ఆలోచించు. పెళ్ళయిన ఆడదానికి భర్తతప్ప దిక్కులేని స్థితి గురించి ఆలోచించు.

ఇవన్నీ ఆలోచించి నాకు తోచిన మార్గం నేనెంచుకున్నాను.

అది నీకు నచ్చలేదు. ఆ విషయం ఇక వదిలేయ్" శాంత ముఖం వివర్ణమయింది.

మంచాలమీద దుప్పట్లు సరిచేసి "రా-

కూర్చుందాం'' అంది.

వసంతకు వెంటనే అక్కణ్ణించి వెళ్ళిపోవాలనిపించింది. శాంత బాధపడినా సరే- ఎలాగేలా అక్కణ్ణించి వెళ్ళిపోవాలనిపించింది.

''టైమెంతయింది'' అంది తన వాచీ చూసుకుంటూనే.

''పదిన్నర''

''రోహిణికి ఫోను చేద్దాం. రామారావుగారు వచ్చి నన్ను తీసుకెళ్ళగలరేమో! నాకు స్నానం చెయ్యకుండా నిద్దరపట్టదు. బట్టలు అక్కడున్నాయి. ఇంకొకరి బట్టలు వేసుకోవటం నాకిష్టం ఉండదు''

శాంత మాట్లాడకుండా వెళ్ళి రోహిణికి ఫోను చేసింది. ''వసంత అక్కడికే వస్తుందట. రామారావు వచ్చి తీసుకెళ్ళగలరా అని అడుగుతోంది''

''ఏం- అంత హఠాత్తుగా నిర్ణయం మార్చుకుంది. రాధాకృష్ణగాని వచ్చాడా?''

''రాధాకృష్ణ ప్రస్తావన మాత్రం వచ్చింది. వసంత అదే భరించలేకపోయింది''

శాంత నవ్వుతూ ఫోనుపెడితే వసంత ఆశ్చర్యంగా చూసింది.

''రాధాకృష్ణ రోహిణికి తెలుసు'' అంది శాంత మామూలుగా నవ్వటానికి ప్రయత్నిస్తూ. కాలింగ్‌బెల్ మోగితే శాంత వెళ్ళి తలుపుతీసింది.

హాస్టలు అమ్మాయిలు రూపా, లక్ష్మి నిలబడి ఉన్నారు.

''మేడమ్- రమ్యకు బాగా జ్వరంగా ఉంది. మెటాసిన్ వేసుకోమంటే- మేడం మేలుకున్నారేమో- ఏదన్నా మందిస్తారేమో అని ఏడుస్తోందండి'' అంది రూప.

''పద వస్తున్నాను. వసంతా... హాస్టలుదాకా వస్తావా- కూచుంటావా?'' అంది శాంత, పుస్తకమూ మందుల పెట్టె పట్టుకుని. వసంతకు ఒక్కత్తే కూచోవాలనిపించలేదు.

'వస్తాను పద' అంది.

నలుగురూ ఆ చీకట్లో చెట్లమధ్య నుంచి హాస్టల్ బిల్డింగ్‌వైపు నడిచారు.

శాంత హోమియో గురించి బాగా చదివింది. హాస్టల్లో పిల్లలకు అపుడపుడూ మందిస్తుంది.

రమ్యలాంటి పిల్లలు ఈ తియ్యటి మాత్రలకు బాగా అలవాటుపడ్డారు.

శాంత రమ్య దగ్గరకు నడిచింది.

''జ్వరం వస్తే చిన్నపిల్లలా ఏడుస్తారా?'' అంది నవ్వుతూ టెంపరేచర్ చూసింది. అవీ ఇవీ అడిగి ఓ మందు వేసింది. కాసేపు ఆ పిల్లకు కబుర్లుచెప్పి నవ్వించింది.

అదేగదిలో ఇరవైఏళ్ళక్రితం జ్వరం వచ్చి ఏడుస్తున్న తనను ఎలా నవ్వించిందో అలాగే రమ్యను నవ్విస్తున్న శాంతను చూసి ఆశ్చర్యపోయింది వసంత.

శాంత ఎంతో మారింది. ఏమీ మారలేదు ఇందులో ఏది నిజం- రెండూ నిజాలేనా తనకెందుకింత అశాంతిగా ఉంది. శాంతను నొప్పించటానికే గుంటూరు వచ్చినట్లుంది. శాంత దగ్గరకు రాకపోయినా బాగుండేది.

చల్లటిగాలిలో కూడా వసంతకు ఒళ్ళంతా చికాకుగా అనిపించింది. బుర్రంతా వేడెక్కిపోయింది. ఇద్దరూ ఇంటికొచ్చేసరికి రోహిణి కూర్చునివుంది. వసంత నిలబడేవుంటే కూచో అంది రోహిణి. ''వెళదాం'' అంది వసంత కూచోకుండా.

''ఎక్కడికి వెళ్ళేది ఇంతరాత్రి. నీబట్టలు తెచ్చాను. స్నానం చెయ్. రామారావు నన్ను దించివెళ్ళాడు. మనం రేపు ఉదయాన్నే వెళదాం''

వసంత బిత్తరపోయింది.

శాంత రోహిణి తలమీద చిన్నగా ఓ దెబ్బకొట్టి టీ పెట్టుకొస్తానని వంటింట్లోకి నడిచింది.

''శాంత బాధపడదూ నువ్వలా చేస్తే-'' రోహిణి మందలిస్తున్నట్టుగా అంది.

''నాకెందుకో అది చేసిన పని నచ్చలేదు''

''నీకు నచ్చకపోతే- నీకు నచ్చుతుందా లేదా అని ఆలోచించి చెయ్యాలా శాంత. నువ్వు ఉద్యోగం చెయ్యకుండా ఇంటికే అంకితం అవటం మాకిష్టంలేదు అంటే నువ్వు నీ జీవితం మార్చుకుంటావా?''

''అదీ ఇదీ ఒకటేనా?''

''సరిగ్గా ఒకటే కాకపోవచ్చు. కానీ ఎవరికి





# గోద్రెజ్

## ప్రవేశపెడ్తోంది

క్రొత్త

హై-ఫోమ్

సూపర్ **బిజ్**






## దీనితో మీకు లభించగలదు ఎక్కువ... తక్కువకు

**ఎక్కువ, మరింత ఎక్కువ...**

- ఎక్కువ శుభ్రపరిచే శక్తి ఎక్కువ మెరుపు విశిష్టమైన, అధిక శక్తివంతమైన ఫార్ములా, మురికిని, జిగటు-జిడ్డును సులభంగా తొలగించేస్తుంది.
- ఎక్కువ ఆదా.

**...తక్కువ, మరింత తక్కువ**

- తక్కువ వెల — మంచి నాణ్యతగల ఇతర ఉత్పాదనల కంటే సుమారు 20% తక్కువ వెల.
- తక్కువ దుర్వ్యయం






బాగున్న పద్ధతిలో వాళ్ళు బతుకుతారు. నువ్వు ఇంత చిన్నపిల్లలా ఆలోచిస్తావనుకోలేదు'' మందలింపుగా అంది రోహిణి.

''కానీ ఆ భార్య సంగతేమిటి?'' పంతంగా అడిగింది వసంత.

''ఆమె సంగతి ఆమె చూసుకుంటుంది. శాంత ఆమెకు చెయ్యగలిగిన సహాయం చేసింది. శాంత గట్టిగా పట్టుబడితే రాధాకృష్ణ విడాకులిచ్చి వచ్చేవాడే. శాంత ఆమె గురించి ఆలోచించే ఇలా బతుకుతోంది'' స్థిరంగా చెప్పింది రోహిణి. శాంత టీ తీసుకొచ్చింది. వసంత తాగనంది.

ముగ్గురూ కాసేపు మౌనంగా కూచున్నారు.

ఇద్దరితో సంబంధాన్ని శాంత ఎలా సహిస్తోంది? ఎందుకు సహిస్తోంది? - వసంతకు అర్థంకావటంలేదు.

''నీ సావిత్రి ఆల్బం పట్టుకురావే వసంతకు కాస్త హుషారొస్తుంది'' అంది రోహిణి.

శాంత లోపలికివెళ్ళి ఆల్బం తెచ్చింది.

చిన్నప్పుడు ఇద్దరూ కలిసి కుట్టిన తెల్లకాగితాల పుస్తకం. కాగితాలు పాతబడ్డా నలగకుండా ఉన్నాయి.

''ఇంకా ఉందా ఈ ఆల్బం'' అంది వసంత ఆశ్చర్యంగా పుస్తకం అందుకుంటూ.

''నాకెందుకో ఆ పుస్తకాన్ని పారెయ్యబుద్ధికాదు'' అంది శాంత.

ఆ పుటల్ని తాకుతుంటే పది పధ్నాలుగేళ్ళ వయసులోని తన జీవితాన్ని తాకుతున్నట్టే అనిపించింది వసంతకు.

అనేకరకాల భంగిమల్లో సావిత్రి-

మనసులో అగ్నిపర్వతం బద్దలవుతోందన్న భావాన్ని పలికిస్తూ ఒక పక్క.

అహ నా పెళ్ళంట అంటూ విరగబడి నవ్వుతూ ఒకపక్క.

వసంత ఫొటోల్ని వాటికింద తాము రాసుకున్న వ్యాఖ్యానాన్ని చూస్తోంది.

దేవదాసులో పార్వతిగా సావిత్రి ఫొటో కింది వాక్యాలు చదువుతుంటే శాంత అంది:

''చిన్నప్పుడు ఆ మాటల్ని ఎంతమెచ్చుకున్నామో గుర్తుందా?''

''దేవదాసే పార్వతి భర్త- పార్వతికి ఎవరితో వివాహమైనా సరే- అని. అది నిజంకూడా. పార్వతి అలాగే బతికింది. ఇవాళ రాధాకృష్ణ ఎవరి భర్తయినా నా ప్రేమికుడు నా మనిషి'' శాంత కళ్ళల్లో నీటి పొరలు.

''కానీ పార్వతి మీలాగా లేదుగా - భర్తనీ పిల్లల్నీ ఎలా చూసింది'' గొంతులో తిరస్కారాన్ని దాచలేకపోయింది వసంత.

''సేవలు చేసింది - ఒట్టి సేవలు. సమాజానికి భయపడిన దేవదాసు పిరికితనాన్ని చూసి, చేసేదిలేక సేవలు చేసింది. కానీ మనను మాత్రం దేవదాసుదే- ఇవాళ రాధాకృష్ణ భర్తగా తన విధులు నిర్వహిస్తున్నాడు- నన్ను ప్రేమిస్తున్నాడు.

''మేం విరహంలో తాగుబోతులమై చచ్చిపోవటంలేదు. అలాచేస్తే లోకం సానుభూతి తేలికగా దొరికేది. మాకు సుఖంగా ఉండేలా ఇతరులకి ఎక్కువ కష్టం లేకుండా ఉంటున్నాం. సుఖపడేవాళ్ళకు సమాజం సానుభూతి దొరకదు ఏం చేస్తాం?''

రోహిణి కలగజేసుకుని శాంత ధోరణిని ఆపింది.

''వసంత చేత నీ జీవితాన్ని ఆమోదింపజెయ్యాలని చూస్తావెందుకు శాంతా! నువ్వు వసంతనర్థంచేసుకో. వసంత జీవితం, ఆమె నమ్మకాలూ విలువలూ వేరు. వాటి ప్రకారం ఆమె నీజీవితాన్ని ఆమోదించలేదు, ఆమోదించదు

ఆవిషయం వదిలెయ్యండి.

ఏదో ఓ రకంగా పురుమడితో వుండే సంబంధాన్ని బట్టేనా మనల్నిమనం గుర్తించుకునేది.

రాధాకృష్ణతో సంబంధం లేకపోతే శాంత స్నేహం కావాలి. అని వసంత అనటం.

వసంత భర్తతో కాపురం చేస్తేనే ఆమె నా స్నేహితురాలని నేను అనటం. ఇదంతా ఎంత అర్థం లేని విషయం. ఆ విషయం కాకుండా మనకెంత జీవితం ఉంది. మనకెన్ని ఆలోచనలున్నాయి. ఎన్ని అనుభవాలున్నాయి.

ముప్పయ్ ఐదేళ్ళ అనుబంధం మనది. ఒక వ్యక్తి ఒకరి జీవితంలోకిరాగానే ఆ అనుబంధం తెగిపోవాలా? ఆ విషయాన్ని సానుభూ




తితో అర్థం చేసుకోటానికి ప్రయత్నించకూడదూ?

అర్థం కాకపోతే 'నాకర్థం కావటంలేదు. పోనీ ఆ కష్టసుఖాలేవో తనే అనుభవిస్తుందిలే' అని వూరుకోవచ్చు-

అందరం అందరం అదే పొరపాటు చేస్తాం. ఏదోఒక పురుషుడితో తప్ప స్త్రీని విడిగా చూడలేం". రోహిణి లేచివెళ్లి మంచంమీద పడుకుంది.

వసంత శాంత చేయిపట్టుకుని "శాంతా- సారీ" అని గొణిగింది.

శాంత కన్నీళ్ళమధ్య నుంచి నవ్వింది.

"పో- పోయి పడుకో. నాకిప్పుడు నిద్రపట్టదు. కాసేపు చదువుకుంటాను" అంటూ పక్కగదిలోకివెళ్ళింది. వసంతకు నిద్రపట్టలేదు.

"పురుషుడితో ఉండే సంబంధాన్ని బట్టేనా స్త్రీ జీవితం" అన్న రోహిణి మాటలు తలలో తిరుగుతున్నాయి. ఆ ప్రశ్న వసంతకు బొత్తిగా నచ్చలేదు.

"కాక? సురేష్ లేకపోతే తన జీవితం ఏముంది? సురేష్, లావణ్యా, నవత వీళ్ళే తనకు సర్వస్వం. వీళ్ళమీదే తను ఆధారపడింది. వాళ్ళు లేకపోతే తన బతుక్కి అర్థమేమిటి? ఏమీ లేదు-

"ఆమె సురేష్‌గారి భార్య" అని నలుగురూ అంటుంటే తనకెంతగర్వం.

"షీ ఈజ్ మై లిటిల్ ప్రెటీ వైఫ్" అంటూ పెళ్ళయిన కొత్తలో సురేష్ తనని స్నేహితులకు పరిచయం చేసిన తీరు తల్చుకుంటే ఇప్పటికీ తనకెంతో పరవశం.

"లావణ్యా, నవతల తల్లి- ముత్యాల్లాంటి పిల్లలు, చక్కగా పెంచింది"

అని అందరూచెప్పుకుంటుంటే తనకెంత తృప్తి. లావణ్యా పెళ్ళయి వెళ్ళిపోతుంటే ఒక వైపు దుఃఖం వచ్చినా ఇంకోవైపు తన బాధ్యత సక్రమంగా నెరవేర్చగలిగాననే నిశ్చింత. అనిపించింది లావణ్యా నవతల ప్రేమ ముందూ-

అమ్మా అంటూ వాళ్ళు కోరేకోరికలు తీర్చినపుడు తనకు కలిగిన తృప్తి ముందు ఏదన్నా నిలుస్తుందా? ఈ తన కుటుంబం, తన సంసారం ఇరవైఏళ్ళుగా తన రక్తమాంసాలు ధారపోసి పెంచుకున్న ఈ సుందరవనం లేకపోతే తన జీవితానికి అర్థంఉందా?

లేదు-

ఇంత అర్థవంతమైన జీవితం లేకా

ఆ జీవితాన్ని చూసి అసూయతో- వీళ్ళు భర్తతో లేని నీ జీవితం వేరు అంటున్నారు. అలాంటి జీవితం తనకు లేదు... ఒద్దు.

ప్రశాంతమైన తన ఇల్లు. పరిశుభ్రమైన తన ఇల్లు. పవిత్రమైన తన ఇల్లు.

అది లేని వీళ్ళు అర్థంలేని మాటలేవో చెబుతారు. వీళ్ళ జీవితాలు తన కనవసరం. తన ప్రపంచం వేరు, తన పరిధి వేరు. వారంరోజులకోసం వస్తే ఈ ప్రపంచంలో ఒక్క రోజు కూడా ప్రశాంతంగా గడపలేకపోతోంది.

వీలైనంత త్వరగా ఇక్కడినుండి వెళ్ళిపోవాలి. మళ్ళీ తన ఇల్లు. తనది మాత్రమే అయిన ఇల్లు చేరాలి. లావణ్యకు సంసారం చక్కదిద్దుకోవటం నేర్పాలి. నవత మనసు పెళ్ళివైపు మళ్ళించాలి. సురేష్ అలసట పోగొట్టి ఏ లోటులేకుండాచూడాలి" వసంత ఆలోచనలు అలా సాగుతూండగానే నిద్రపట్టింది.

తర్వాత రెండు రోజులూ వసంతకు కష్టంగానే గడిచాయి. ఒకరోజు స్కూలుకి వెళ్ళి వచ్చారు. అప్పటి టీచర్లు ఒకరిద్దరు బాగా పెద్దవాళ్ళయిపోయి ఉన్నారు. స్కూలు భవనం అలాగే ఉన్నా వాతావరణమంతా మారిపోయినట్లే ఉంది.

"మనల్ని భయపెట్టినట్లు ఇప్పటి పిల్లల్ని భయపెట్టలేకపోతున్నారు" అంది వసంత - కాంపౌండ్ అంతా గోలగోలగా తిరుగుతున్న పిల్లల్ని చూస్తూ.

"ఇప్పటి పిల్లలు వాళ్లనే భయపెడుతున్నారు" అంది రోహిణి తన పిల్లల్ని గుర్తుచేసుకుంటూ.

బెల్ కొట్టగానే పిల్లలందరూ క్లాసులకు పరిగెత్తారు. గ్రౌండంతా ఖాళీ అయింది. హఠాత్తుగా నిశ్శబ్దమైపోయిన ఆ గ్రౌండు మధ్యలో నిలబడిన ఇద్దరికీ అక్కడ ఆడిన ఆటలూ, పాడిన పాటలూ కలలా కళ్ళముందు కన్పించాయి. ఆ కలలో నుంచి ఓ పట్టాన

బైటకురాలేకపోయారు. ఆ తర్వాత రోజు వసంత పూనుకుని రోహిణి వద్దంటున్నా విన కుండా బూరెలూ, చక్రాలు, కజ్జికాయలూ వండింది.

"పిల్లలు నాలుగు రోజులు తింటారు. వాళ్ళ కెప్పుడూ బిస్కెట్లూ కేకులూ కొనిస్తావు. తినీ తినీ విసుగెత్తిపోయారు. నువ్వు హాస్పిటల్‌కి వెళ్ళి వచ్చేదాకా నేనేం చేస్తాను" అని రోహిణిని మాట్లాడనివ్వలేదు. రోహిణి నిస్సహాయంగా హాస్పిటల్‌కి వెళ్ళిపోయింది.

రోహిణి రెండున్నరకు హాస్పిటల్ నుంచి వచ్చేసరికి పనిపిల్ల సహాయంతో వసంత చెమటలుకక్కుతూ వండినవన్నీ డబ్బాల్లో సర్దు తోంది.

"ఎందుకంత కష్టం" అని రోహిణి అంటుంటే-

"సాయంత్రం పిల్లలు చూడు ఎలాతింటా రో" అంది వసంత చెమట తుడుచుకుంటూ.

సాయంత్రం రోహిణి పిల్లలిద్దరూ బూరెల్నీ చక్రాల్నీ చూసి కేరింతలుకొట్టారు.

"అమ్మా- నువ్వు వసంత ఆంటీ దగ్గర నేర్చుకో... మనం వండుకోవచ్చు" అన్నారు.

"ఇక రోజూ బూరెలంటే నేనెక్కడ వండిపె ట్టనే" అని భయపడింది రోహిణి.

ఆ తర్వాత ఇక వసంతకు పొద్దుపోలేదు. 'రేపు వెళ్ళిపోతాను' అని గోలపెట్టింది. వెంటనే టిక్కెట్టు తెప్పించింది.

ఆరోజు సాయంత్రం హాస్పిటల్ మానేసింది రోహిణి.

"రేపు వెళ్ళిపోతావుగా- శాంత దగ్గరకు వెళ్ళివద్దామా?" అని అడిగింది.

"ఒద్దులే- నాకిప్పుడు కదలాలనిపించ టంలేదు" అంది వసంత నిరాసక్తంగా.

"నువ్వు శాంత విషయంలో ఎందుకంత పిచ్చిగా ఉంటున్నావో నాకర్థంకావటంలేదు. పాపం తనెంత ఫీలవుతుందీ-"

"నువ్వెన్ని చెప్పు - శాంత చేసిన పని నాకు నచ్చలేదు, పెళ్ళి చేసుకుంటే చేసుకోవాలి. లేదూ - ఇక తనకా రాత లేదనుకుని నిగ్ర హంతో జీవితాన్ని నడుపుకోవాలి. అంతేగాని -"

అసహ్యంగా ముఖం చిట్లించింది వసంత.

"నిగ్రహంతో జీవితాన్ని గడుపుకోవాలి. ఎంత చక్కగా తేల్చిగ్గా చెప్పేశావు. ప్రేమ ఎదు రైనపుడు దానిని తిరస్కరించి నిగ్రహంగా ఉండటం తెలికేనా? అసలెందుకు ఉండాలి" వాదనకు సిద్ధమయింది రోహిణి.

"ఏమో - నాకు నచ్చదు. నేను ఒప్పుకోలే ను"

"నువ్వు ఆమోదించక్కర్లేదు. అర్థం చేసుకో వచ్చుగదా-" వసంత మాట్లాడకుండా కూచుంది. శాంతను చూడకుండానే హైద్రాబా దు రైలెక్కింది. హైద్రాబాద్‌లో రైలు దిగి ఆటోలో ఇంటికెళుతూ- "గుంటూరు గుంటూ రని వెళ్ళానుగానీ అదంతా భ్రమ. నాకు సంబంధించి గుంటూరుకి అర్థంలేదు. హైద్రా బాదే నిజం. ఈ నగరంలో నా జీవితమే నిజం" అనుకుంది.



మధ్యాహ్నం రెండున్నర ప్రాంతాల్లో ఇల్లు చేరిన వసంత రాత్రి ఎనిమిదిగంటలదాకా ఊపిరాడనిపనిలో మునిగిపోయింది.

ఇల్లంతా దుమ్ము, పనిమనిషి లేదు. ఇల్లంతా దులిపి - సర్దుకుని వంటచేసి, స్నానం చేసేసరికి ఎనిమిదిన్నర అయింది.

"సురేష్‌కి టెలిగ్రాం అందలేదా. రైలుకి రాకపోతేపోయాడు. కనీసం పెందలాడే ఇంటి కి రాడేం" అనుకుంటూ నిమిషాలు లెక్కపెట్ట సాగింది. ఈమధ్య మరీ ఇల్లు పట్టకుండా తిరుగుతున్నాడు. ఎప్పుడూ హాస్పిటల్ - పే షెంట్లూ - ఇదేలోకం. లావణ్య పెళ్ళికి అప్ప యిందని క్లినిక్ ఒకటి తెరిచాడు. ఈయన తోటి డాక్టర్లందరూ ఎంతెంత సంపాదించారో - ఈయనకు జీతం డబ్బులే ఆధారం. తనెంత

పొదుపుగా గుట్టుగా సంసారాన్ని నెట్టుకొస్తుందో ఎవరికీ పట్టదు. లావణ్యకు కట్నం అంటూ ఇవ్వకపోయినా చాలానే ఖర్చయింది. ఇద్దరూ ఆడపిల్లలేగా ఉన్నదేదో చెరినగం ఇవ్వండి అన్నారు లావణ్య మావగారు. నయం - అదే ఇప్పుడు రెండు లక్షలు గుమ్మరించండి అంటే ఏంచేసేవాళ్ళం? సురేష్‌కి ఊళ్ళోఉన్న పొలం నాలుగెకరాలు. అమ్మేసినా రెండు లక్షలు రాదేమో - ఆ పొలం, ఈ ఇల్లు చూసి చేసుకున్నారు వాళ్ళయినా.

హాస్పిటల్‌కి ఫోను చేసింది. లేడని చెప్పారు. క్లినిక్‌లో ఇంతసేపు ఉండడు. ఏంచేస్తున్నాడు. చిరాకుపడుతూనే నిద్రపోయింది వసంత. తన ఇంట్లో తనున్నాననే నిశ్చింతతో గాఢనిద్ర పట్టింది వసంతకు. కాలింగ్‌బెల్ మోతకు ఉలిక్కిపడి లేచింది. 'సురేష్ వచ్చాడు' అనుకుంటూ హడావుడిగా పరుగెత్తుకుని వెళ్ళి తలుపు తీసింది.

"ఎప్పుడొచ్చావు?" అంటూ లోపలికి వచ్చాడు సురేష్.

"నా టెలిగ్రాం అందలేదూ" అంటూ అతనితోపాటే లోపలికి నడిచింది కళ్ళు నలుపుకుంటూ.

"అందింది" ముభావంగా బదులిచ్చాడు సురేష్.

"మరి అలా అడుగుతారేం. గోల్కొండకు వచ్చేశాను. ఇంతసేపు ఎక్కడున్నారు?" అంటూ గడియారంవంక చూసింది వసంత.

నాలుగు-

"నాలుగైందా? తెల్లారబోతోందా. ఎక్కడున్నారు ఇంతసేపూ. నేను వస్తున్నానని తెలిసీ ఇంటికిరాకుండా ఎక్కడికెళ్ళారు?" వసంతకు కోపం వచ్చేసింది.

సురేష్ మాట్లాడకుండా బట్టలు మార్చుకోసాగాడు.

"ఎక్కడున్నారంటే మాట్లాడరేం - పార్టీ ఏమన్నా తగలడిందా?"

"కాదులే"

"మరిఎక్కడకు వెళ్ళారండీ - నేను లేనప్పుడు ఇంకొకళ్ళను ఎవర్నయినా చూసుకున్నారేమిటీ?" అంటూ సురేష్‌కి లుంగీ అందించింది. "ఔను" అన్నాడు సురేష్

"ఔను" అంటూ వెక్కిరింతగా మూతితిప్పింది వసంత. "ఎవరో ఆవిడ" కవ్విస్తున్నట్లు అడిగింది.

"నీలిమ- మా హాస్పిటల్లో డాక్టర్"

"ఛీ... పాడుమాటలు. ఎవరో ఆవిడగురించి అలాంటి మాటలెందుకు" మంచంమీద పడుకుని బద్ధకంగా ఆవులించింది.

సురేష్‌వచ్చి మంచం పట్టెమీద కూచున్నాడు.

"నిజంగా వసంతా. చాలారోజుల్నించీ నీతో చెబుదామనుకుంటూ చెప్పలేకపోతున్నాను. చెప్పకపోతే నిన్ను మోసం చేసినట్లు ఫీలవుతున్నా! నీలిమా నేనూ" అంటూ ఆగిపోయాడు సురేష్.

వసంత మెదడంతా ఖాళీగా అయిపోయినట్లనిపించింది. ఏమాలోచించాలో తెలియక పని చెయ్యటం మానేసింది. శరీరంలో సర్వావయవాలూ స్థంభించిపోయినట్లయి అలాగే సురేష్ వంక చూస్తోంది.

"నీలిమతో స్నేహం ఇంతదూరం వస్తుందని మేమిద్దరం అనుకోలేదు. కానీ జరిగిపోయింది. ఇది నీకు తెలియకుండా రహస్యంగా ఉంచటం నేనూ భరించలేకపోతున్నాను"

సురేష్ చెబుతున్నది వసంతకేమీ అర్థంకావటంలేదు.

"నీలిమ- నేను. నేను, నీలిమ, నేను నీలిమ" ఆ రెండుమాటలు మాత్రమే అర్థమయ్యాయి. అవే మెదడులో తిరుగుతున్నాయి.

'నీలిమా నేను- నీలిమా నేను'

"వసంతా- నన్నర్థంచేసుకోవాలి. నీకు అన్యాయం చెయ్యను"

సురేష్ మాట్లాడుతూనే ఉన్నాడు.

వసంతకు శరీరం, మనసూ కూడా స్వాధీనంలోకి రావటంలేదు.

"ఇదంతా అబద్ధం. అసలిదేం జరగలేదు. ఈ మాటలూ, ఈ ప్రస్తావనా ఏమీ జరగలేదు. మళ్ళీ పది నిమిషాల వెనక జీవితం వచ్చేస్తుంది"

శరీరమంతా పెనుగులాడుతోంది పదినిమిషాల వెనక జీవితం కోసం. మనశ్శరీరాలు




ఐక్యంగా యుద్ధం చేస్తున్నాయి కాలాన్ని చెరిపె య్యటానికి. క్రమంగా రక్తం వేగంగా ప్రస రించటం మొదలయింది గుండె గబగబ కొట్టుకుంటోంది.

''ఇవాళ నువ్వడగటం మంచిదయింది. అది నీదగ్గర దాచిపెట్టడం నాకూ నరకంగా ఉంది''

మళ్ళీ సురేష్ గొంతు వసంత శక్తిని హరించివే సింది.

''మాట్లాడు వసంతా''

''ఏంమాట్లాడను'' వసంత గొంతులో దుఃఖం పెద్ద కెరటంలా విరిగిపడింది.

వెక్కివెక్కి ఏడుస్తున్న వసంతను దగ్గరకు తీసు కున్నాడు సురేష్.

''వసంతా- నాకేం చెయ్యాలో తోచటంలేదు. నువ్విలా ఏడిస్తే ఎట్లా''

''ఏంచెయ్యను ఏడవక'' వసంత గొంతులో దుఃఖం, కోపం కలిసిపోయాయి.

''ఎన్నిరోజుల్నించీ''-

''ఆరునెలలయింది''

''ఆరు నెలలా- ఆరునెలల్నించీ'' వసంత ఏడుస్తోంది.

''వసంతా ఏడవకు- ఊరుకో. నీకేమీ అన్యాయం జరగదు''

''ఇంకేంజరగాలి. మీరు మాట్లాడకండి- వెళ్ళండి'' సురేష్‌ని నెట్టేసింది.

సురేష్ మాట్లాడకుండా కూచున్నాడు.

''ఆరు నెల్లనుంచీ నీలిమా ఆయనా లావణ్యా పెళ్ళినాటికే వీళ్ళిద్దరూ ఛీ- ఛీ

ఏంచెయ్యాలి. తన సంగతేమిటి- ఎంత ధై ర్యంగా చెబుతున్నాడు.

అమ్మో- ఎందుకిదంతా ఇలా జరిగింది.

ఇదంతా నాకే జరగాలా- నాకే జరగాలా నా సంసారం. నా ఇల్లు. నా భర్త. నా పిల్లలు-

ఇదంతా నాది.

ఇది ఎలా జరిగింది.

సురేష్‌కి నేనంటే ఇష్టంలేదా-

ఎన్నిసార్లు పొగిడాడు. నువ్వు భార్య కావటం నా అదృష్టం అని.

ముత్యాల్లాంటి పిల్లలనిచ్చావని ఎంత ముద్దు చేశాడు- అవన్నీ అబద్ధమా

ఇప్పుడు ఈ ఆరునెల్ల సంబంధం మాత్రమే నిజమా?

ఎలా ఔతుంది?

ఈ సంసారం అబద్ధమా- కాదు... కాదు.... కాదు... ఎలాగో దీన్నించి బైటపడాలి.

నేను చచ్చిపోకూడదు-

ఆమాట అనుకోగానే వసంతకు విపరీతంగా దుఃఖం వచ్చింది.

పెద్దగా ఏడుస్తున్న వసంత దగ్గరకు వచ్చా డు సురేష్. ''వసంతా- నిన్ను బాధపెట్టాలని నాకు ఏమాత్రం లేదు. నువ్వంటే నాకు కోపం లేదు''

''మీరు మాట్లాడొద్దు'' పెద్దగా అరిచింది వసంత.

''ఆరు నెల్లనుంచీ ఎందుకు దాచిపెట్టా రు?''

''నువ్వేమైపోతావోనని భయం వేసింది''

''నేనేమవుతానోనని భయం- ఆ భయం వుంటే ఈ పని జరుగుతుందా. ఒట్టిది. ఇవన్నీ ఒట్టి మాటలు. జరగవల్సిందేదో జరిగిపో యింది'' వసంత పిచ్చిగా ఏడుస్తోంది.

తెల్లవారింది. వసంత మంచంమీద నుంచి లేవలేదు. సురేష్ కాఫీ పెట్టి తెచ్చాడు. తాగలే దు. పది గంటలకు సురేష్ బైటికెళ్ళాడు.

''ఎక్కడికి వెళ్ళాడు? నీలిమ దగ్గరకేనా?''

అనుకోగానే లేచి కూచుంది వసంత.

నీలిమతో చెబుతాడా- వసంతతో చెప్పేశాను. ఇక రహస్యం లేదు అంటాడా. వసంత ఏడు స్తూ పడుకుంది.

అలా అని చెప్పుకుని ఇద్దరూ తనమీద జాలిపడతారా? నవ్వుకుంటారా?

ద్వేషంతో నిండిపోయింది వసంత మనసు. నెమ్మదిగా పక్కమీదనుంచి లేచింది. ఎదు రుగా పెద్ద అద్దం. అద్దంలో తన ముఖం తనకే భయంకరంగా కనిపించింది. అలసట, నీరసం, రాత్రంతా నిద్రపోకుండా ఏడ్చినందు వల్ల ఎర్రబడ్డ కళ్ళు. కళ్ళకింద నల్లటి గుంట లు మరింత స్పష్టంగా కనిపిస్తూ- వసంతకు తనమీద తనకేజాలనిపించింది.

తను అందంగా లేదా? ముసలిదైపో

యిందా? చెంపలమీద ఏర్పడబోతున్న ముడతలను పరీక్షగా చూసుకుంది.

అయిదు నిముషాలలాగే తన ప్రతిబింబం వంక చూసుకుని అక్కడ్నించి లేచింది వసంత. స్నానం చేసింది. కాఫీ తాగి వంట చేసింది. మనసులో ముసురుతున్న ఆలోచనల్ని అతి ప్రయత్నంమీద వెనక్కు నెట్టి పనులన్నీ చకచకా చేసింది. ఇల్లంతా శుభ్రంగా సర్దింది. ఈ సంగతి ఎవరితోనన్నా చెప్పాలి అనిపించింది. 'ఎవరితో చెప్పాలి- అన్నయ్యతో చెప్పి లాభంలేదు. అతనిలాంటి చిక్కులోంచి అతి కష్టమ్మీద బైటపడ్డాడు. అతను సురేష్‌కి చెప్పలేడు. ఒదినకు చెబితే ఏమంటుందో- ఆ ఆలోచన రాగానే బయలుదేరింది. ఆటోలో ఒదిన లక్ష్మి దగ్గరకు వెళ్ళింది.

"ఊరునుంచి ఎప్పుడొచ్చావు?" అంటూ ఎదురొచ్చింది లక్ష్మి.

"నిన్ననే ఒచ్చాను" అని నీరసంగా రాని నవ్వొకటి నవ్వింది వసంత.

"ఒంట్లో బాగోలేదా? అలా ఉన్నావు- కూచో" అంటూ మంచినీళ్ళు తేవటానికి వెళ్ళింది. లక్ష్మి మంచినీళ్ళు తెచ్చేసరికి వసంత చేతుల్లో ముఖం దాచుకుని ఏడుస్తోంది.

లక్ష్మి కంగారుపడింది. ఏమిటేమిటని హడావుడిచేసింది.

వెక్కిళ్ళ మధ్య జరిగిన విషయం వివరించింది వసంత.

"ఈ మగాళ్ళకిదేంపోయేకాలం. ఒక పక్క పిల్లల పెళ్ళిళ్ళవుతుంటే ఇంకోపక్క ఈ భాగోతాలు. ఛీ- సిగ్గెలా ఉండదో" ఛీత్కరించింది లక్ష్మి.

"ఒదినా... నేనేం చెయ్యను. నేనా ఇల్లు ఒదిలి ఉండలేను" అంటూ ఏడ్చింది వసంత.

"నీకేం ఖర్మ ఇల్లు ఒదలటానికి. ఇలాంటివన్నీ మున్నాళ్ల ముచ్చట్లే. ఆ నాలుగు రోజులూ నోరుమూసుక్కూచోవాల్సిందే. తప్పదు. నువ్వు తొందరపడి అతనితో తగాదాపడకు. కాస్త ఓపిక పట్టాలి. శాంతంగా ఉండాలి. నువ్వు తొందరపడ్డావంటే మొదటికే మోసం వస్తుంది. ఆ విసుగుతో అతగాడేం చేసినా మనకే నష్టం. ఏదో నాలుగురోజులు కొత్తమోజులో తిరుగుతారు. ఆ మోజు తీరేదాకా మాట్లాడకుండా ఉండటం తప్ప మార్గంలేదు. నువ్వు సతాయించినకొద్దీ అతను అటువైపు మొగ్గుతాడు. నువ్వు ఏడుస్తూ ఉండమాకు. ఏమీ జరగనట్టే నవ్వుతూ ఉండు. అతనికన్నీ అమర్చిపెట్టు. ఏలోపం రానివ్వమాకు. అసలిదంతా అతను నీతో చెప్పలేదనుకో. ఏంచేసేదానివి. అలాగే ఉండు. అసలు ప్రతి మగాడికీ ఈ బుద్ధి వంకరపోదు. నువ్వు కళకళ్ళాడుతూ కళ్ళ ముందు తిరుగుతుంటే ఆవిడమీద మోజు తగ్గిపోతుంది. నేను పడిన బాధలుకావూ ఇవన్నీ-"

లక్ష్మి తన అనుభవాన్నంతా రంగరించి వసంతకు నలహాలిచ్చింది. లక్ష్మి మాట్లాడినకొద్దీ వసంతకు ధైర్యం వచ్చింది. పరిస్థితి తన చేతుల్లోనే ఉందనిపించింది.

అక్కడే భోజనం చేసి నాలుగింటికి ఇల్లు చేరింది. సురేష్ ఇంట్లోనే ఉన్నాడు. వసంతను చూస్తూనే కంగారుగా అడిగాడు.

"ఎక్కడికెళ్ళావు? ఇంతసేపు ఎక్కడున్నావు?"

"ఒదినావాళ్ళింటికి" అంది గదిలోకి వెళ్తూ.

"నాకు చెప్పి వెళ్ళగూడదూ? నేను భోజనానికి వచ్చేసరికి నువ్వు లేవు. ఒస్తావు ఒస్తావని కూచుంటే రావు. ఏం చెయ్యాలో తెలియక భయంతో"-

"భయమెందుకు- నేను చావను" అంది వసంత కఠినంగా.

సురేష్ ముఖం పాలిపోయింది. "వసంతా... ఎందుకలా మాట్లాడతావు. నేను పడే బాధ నీకర్థం కాదు" అని గొణిగాడు.

"బాగానే అర్థం అవుతుంది. ఎంత బాధ లేకపోతే ఇంతపని చేస్తారు" రాని నవ్వొకటి నవ్వింది. సురేష్ ఆ వ్యంగ్యానికి సమాధానం చెప్పలేదు. వసంత లోపలికి వెళ్ళి కాఫీ కలిపి తెచ్చింది.

"బైటికెళ్దామా"- కాఫీ తాగుతూ అడిగాడు సురేష్. వసంతను కాస్తయినా శాంతపరిచి మాట్లాడాలని సురేష్ ప్రయత్నం.

"ఎక్కడికి?"- ఎంత అణచుకున్నా వసంత గొంతులో విసురు తగ్గటం లేదు.





"ఎక్కడికైనా కాసేపు అలా తిరిగొద్దాం"

"పదండి... నేను బట్టలు మార్చుకుని వస్తాను"

వసంత చాలారోజుల తర్వాత జాగ్రత్తగా, తీరికగా పొందికగా చీరె కట్టుకుంది. ఎప్పటిలా హడావుడిగా చుట్టుకోవాలనిపించలేదు. కళ్ళకు కాటుక దిద్దుకుంది. జడ ఒదులుగా చెవులమీదకు జుట్టుపడేలా వేసుకుని పిన్నులు పెట్టుకుంది. కుచ్చిళ్ళు సర్దుకుంటుంటే-

'నీలిమకు ఎంత వయసో' అన్న ఆలోచన వచ్చి ఒక్కసారి కంపించింది.

తనకంటే చిన్నది. తప్పకుండా చిన్నదే అయివుంటుంది- దుఃఖం పొంగి వచ్చింది. బలవంతాన ఆ దుఃఖాన్ని రెప్పలకింద అణిచి బైటికి వచ్చింది.

సురేష్ తనను చూడగానే ఆశ్చర్యపడటం, క్రమంగా ఆ ఆశ్చర్యం జాలిగా మారటం గమనించిన వసంతకు తనమీద తనకే అసహ్యం వేసింది.

'ఇక నవ్వుకుంటాడు. ఈవిడిప్పుడు పదహారేళ్ళ పిల్లలా మారబోతోందని నవ్వుకుంటాడు. ఆ నీలిమతో చెబుతాడేమో. తనింత పిచ్చిదేం. ఒకవైపు నేనూ నీలిమా అని అతనంత స్పష్టంగా చెబితే సిగ్గులేకుండా సింగారించుకుని స్కూటర్ వెనక ఎక్కి- ఛీ- ఛీ" స్కూటర్ మీద నుంచి దూకెయ్యాలనిపించింది వసంతకు. బలవంతాన నిగ్రహించుకుంది. టాంక్‌బండ్ దగ్గర స్కూటర్ ఆపాడు. ఇద్దరూ హుసేన్‌సాగర్ వంక చూస్తూ నిలబడ్డారు. అప్పుడప్పుడే ఆకాశాన్ని చీకటి అలుముకోబోతోంది.

"ఆవిడ వయసెంత?" హఠాత్తుగా అడిగింది వసంత.

"ఎవరూ? నీలిమా వయసు" తడబడ్డాడు సురేష్.

"నాకంటే చిన్నదేనా?" గొంతులో దుఃఖం దాగటం లేదు.

"అయివుంటుంది. నాకంత బాగా తెలియదు" ఇబ్బందిగా గొణిగాడు.

"అందంగా ఉంటుందా?"

"ఇప్పుడానంగతెందుకు వసంతా! లావణ్యకు ఉత్తరం రాశావా? అది రాసి చాలారోజులవలేదూ. నవత సంక్రాంతి సెలవలకు కూడా రాదట. పరీక్షలున్నాయని రాసింది. పిల్లలు లేకపోతే ఏమీ బాగాలేదు కదూ"- సురేష్ ఆపకుండా మాట్లాడుతున్నాడు.

'ఎంత మామూలుగా మాట్లాడుతున్నాడు ఏమీ జరగనట్టు. పిల్లలకీ తమకీ మధ్య, తమ యిద్దరి మధ్యా ఎవరూ లేనట్టు. తమది మామూలు కుటుంబం అయినట్లు'

వసంత రాబోతున్న కోపాన్ని బలవంతాన ఆపేసింది. అతను మామూలుగా మాట్లాడుతున్నాడు. తను వివేకంగా ఉండాలి. ఇప్పుడ తన్ని సాధించి మరీ దూరం కాకూడదు. ఇదంతా తొందరలో ముగుస్తుంది. అప్పుడతనే పశ్చాత్తాపపడతాడు.

ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వాళ్ళు పడిపోయారు.

'వెళ్లాం పదండి' అంది వసంత చల్లగాలి ఒంటికి తగిలేసరికి.

సురేష్ మౌనంగా లేచి స్కూటర్ తీశాడు.

★ ★ ★

"సాయంత్రం ఆలస్యంగా వస్తాను. నీలిమ దగ్గరకు వెళ్తున్నాను"

వసంతవంక చూడకుండా చెప్పేసి హడావుడిగా వెళ్ళిపోయాడు సురేష్.

వసంత నివ్వెరపోయి నిలుచుంది. తన పరిస్థితి తనకే అర్థంకావటంలేదు.

'ఏం చెయ్యాలి? ఎంత ధైర్యంగా చెప్పి వెళ్ళాడు! రాత్రి ఆలస్యంగా వస్తే 'ఎక్కడికి వెళ్ళారు' అని అడిగే అవకాశం కూడా లేకుండా ముందే చెప్పేశాడు. అతను అబద్ధం ఆడే బాధ తప్పించుకున్నాడు. మొత్తం బరువంతా తనమీద పడేశాడు. ఏం చెయ్యాలి?'

"మీరు నీలిమ దగ్గరకు వెళ్ళటానికి వీల్లేదు" అని చెబితే? చెబితే ఏమవుతుంది? 'వెళ్ళకుండా ఉండలేను' అంటాడు.

ఉండలేకపోతే నేను మీ భార్యగా ఉండను అనాలి.

'మంచిది' అంటాడు.

అప్పుడు తను అతని భార్యగా ఉండకుండాపోవటానికి సిద్ధంగా ఉందా?

లేదు. ఎట్టి పరిస్థితుల్లోనూ తను సురేష్





భార్యగానే ఉండాలి. ఈ ఇల్లు వదిలి సురేష్‌కి దూరంగా బతకలేదు. అమ్మో... ఈ ఇంటిని - తన ఇంటిని వదిలిపెట్టి పోవటమే-ఈ ఇల్లు తన ప్రాణం. తనకీ ఈ ఇంటికీ తేడా లేదు. వసంతకు గుండెఅంతా గట్టిపడిపోయినట్లయింది. 'ఇరవై సంవత్సరాలు ఎలా బతికాను. ఈ కుటుంబంకోసం ఎంత శ్రమించాను. ఈ ఇల్లుకాక వేరే ప్రపంచం ఒకటుందనే విషయమే మర్చిపోయాను. అతనికీ, పిల్లలకూ ఎక్కడ ఏచిన్న అసౌకర్యం జరుగుతుందో అని సరదాలూ, కోరికలూ అన్నీ అణిచేసుకున్నాను. అలా అణిచేసుకోవటం ధర్మమనుకున్నాను. అలా అణిచేసుకోకుండా తమ సరదాలకోసం, కోరికలకోసం సంసారాన్ని నిర్లక్ష్యం చేసేవారిని అవివేకులనుకున్నాను. చులకనగా చూశాను. అసహ్యించుకున్నాను. ఇవాళ రోహిణి పెద్ద డాక్టరు.

శాంత ప్రిన్సిపాలు. ఇకా చాలామంది తన స్నేహితులు చిన్నవో పెద్దవో ఉద్యోగాలు చేస్తున్నారు. వాళ్ళందరినీ చిన్నచూపు చూశాను. మొన్నటికి మొన్న రోహిణి తన వృత్తిలో పడిపోయి పిల్లలకు సరిగా తిండైనా పెట్టడంలేదని విసుక్కున్నాను.

పిల్లలిద్దరికీ ఏలోటూ లేకుండా పెంచానని గర్వపడ్డాను.

నిజమే-అలాగే పెంచాను. పెళ్ళయ్యే ముందుదాకా పెద్దదానికి ముద్దలు కలిపి తినిపించాను. నవత అలా తినిపించుకోదని దాని మీద కోపం తెచ్చుకున్నాను. వాళ్ళు కాలేజీకి వెళ్తున్నారంటే లేచేసరికి టిఫిన్ కాఫీలు సిద్ధం. స్నానంచేసి వచ్చేసరికి ఇస్త్రీబట్టలు సిద్ధం. జాకెట్లన్నీ తనే స్వయంగా ఇస్త్రీ చేసి వాళ్ళకు కావాల్సినవి సమస్తం సిద్ధంచేసి పెట్టేది. పెద్దదానికి నోట్సులు రాసిపెట్టేది. ఇక వాళ్ళకు ఏచిన్న అనారోగ్యం వచ్చినా నిద్రపోయేదా. రాత్రులకురాత్రులు వాళ్ళపక్కనే కూర్చుని ఎన్ని సేవలు చేసేది-

సురేష్‌కి మాత్రం బతుకంతా వీళ్ళ సేవల్లోనే. ఇప్పుడు వద్దనేస్తే ఈ బతుక్కు అర్థంఏమిటి?

ఇన్నాళ్ళూ తన బతుక్కి అర్థం వీళ్ళు ముగ్గురూ! ఇప్పుడు?

ఇప్పుడేమయింది? సురేష్ ఇట్లా చేస్తున్నాడని లావణ్యతో చెబితే అది ఊరుకుంటుందీ-తనకోసం ప్రాణాలివ్వదూ? వాళ్ళ నాన్నతో యుద్ధం చెయ్యదూ?

నవతకు సురేషంటే ఇష్టంగానీ లావణ్యా ఎప్పుడూ తన బిడ్డే.

అమ్మా-అమ్మా-అమ్మా అని ఎప్పుడూ తన జపంచేస్తూనే ఉంటుంది.

లావణ్యా వుంది తనకు. తన బతుక్కి అర్థం పిల్లలు. నవత తండ్రి కూతురైనా లావణ్యా తన కూతురు-'' వసంతకు కొత్తశక్తి వచ్చినట్లనిపించింది. వెంటనే నిజామాబాద్ ప్రయాణం అయింది. సురేష్‌కి చిన్న ఉత్తరం రాసి టేబుల్‌మీద పెట్టింది.

★ ★ ★

చెప్పాపెట్టకుండా వచ్చిన తల్లిని చూసి లావణ్యా సంతోషంతో తల్లకిందులయింది. ''అమ్మా! రాత్రే అనుకున్నా - అమ్మ ఒక్కసారి వచ్చి వెళితే బాగుండు కదా అని - తెల్లారేసరికి వచ్చేశావు'' అంటూ కౌగిలించుకుంది. పీక్కుపోయిన ముఖం, ఎర్రబడ్డ కళ్ళూ చూసి ప్రయాణంలో అలసట అనుకుంది గానీ తల్లికేమైనా కష్టం వచ్చిందేమోనన్న ఆలోచన కూడా రాలేదు లావణ్యకు.

''అమ్మా! నువ్వొస్తే బాగుండునని ఎందుకనుకున్నానో తెలుసా?''

ముఖం కడుక్కొని వచ్చిన తల్లికి కాఫీ అందిస్తూ అంది లావణ్యా-

''ఎందుకమ్మా?'' వసంత ప్రేమగా అడిగింది.

''రెండురోజుల్లో మా అత్తా, ఆడబిడ్డా, ఆడబిడ్డ పిల్లలూ వస్తున్నారు. ఆవిడకన్నీ చాదస్తాలు ఇల్లు ఇట్లా వుంటే నచ్చదు. అక్కడ దుమ్ముంది. ఇక్కడ ధూళుంది అంటుంది. ఈ వస్తువు ఇక్కడుండగూడదు, ఆ వస్తువు అక్కడుండగూడదు అని గోల. నువ్వు ఇల్లంతా ఒకసారి సర్దేశావంటే ఇక నాకు నిశ్చింతగా ఉంటుంది. ఏవన్నా నాలుగురకాల పిండివంటలు చేసి డబ్బాల్లో సర్దేశావంటే ఇక మధ్యాహ్నాపు టిఫిన్ల గురించి హడావుడి ఉండదు. వాళ్ళున్న వారంరోజులూ నువ్వుండాల్సిందే- వెళ్ళటానికి వీల్లేదు''

తల్లి మెడమీద పడి ఊగుతూ గారాలు పోతోంది లావణ్య.

"అలాగేలే తల్లీ - లే" అంటున్న వసంత కళ్ళనుండి జలజలా నీళ్ళు రాలాయి.

"ఏంటమ్మా" అంటూ తల్లి మెడమీదనుంచి చేతులు తీసి ముందుకొచ్చింది లావణ్య.

కూతుర్ని కావలించుకుని వెక్కివెక్కి ఏడ్చింది వసంత. లావణ్య హడలిపోయింది.

"ఏమయిందమ్మా— ఎందుకేడుస్తున్నావ"ంటూ కంగారుపడింది.

కూతురికి ఆ విషయం ఎలా చెప్పాలో తెలియటంలేదు వసంతకు.

"మీనాన్న ఇంకెవరో ఒకావిడని ఉంచుకున్నారమ్మా" అని అతికష్టంమీద చెప్పి బావురుమంది. లావణ్య తెల్లబోయింది. ఒక్కక్షణం అయోమయంగా అనిపించింది. ఏంచెయ్యాలో తెలియక ఏడుస్తున్న తల్లిని చూస్తూ అలాగే కూచుంది. వసంత ఒక్కొక్క విషయమూ చెబుతున్నకొద్దీ లావణ్యకు తండ్రిమీద కోపం పెరిగిపోయింది. 'ఛీ... ఈ వయసులో ఇదేంబుద్ధి. పిల్లలు ఏమనుకుంటారో అనైనా తోచలేదా— పాపం అమ్మ ఎలా తట్టుకుంటుంది. ఇక జీవితాంతం ఇలా ఏడుస్తూ కూచోవాల్సిందేనా. అమ్మో! రెండురోజుల్లో అత్తావాళ్ళు వచ్చేసరికి అమ్మ ఇలాగే ఏడుస్తూ కూచుంటే వాళ్ళు ఏమిటని అడిగితే ఏంచెప్పాలి. ఇదంతా వాళ్ళకు తెలిస్తే ఇక తన పరువేంగాను. అత్తయ్య ఇంక తనను లెక్కచేస్తుందా. మీ నాన్న అలా, మీ అమ్మ ఇలా అంటూ సాధించి చంపదూ'

లావణ్యకు గుండెదడ పెరిగింది. తల పట్టుక్కూచున్న లావణ్యను చూసి వసంత-

"లావణ్యా... ఈ ఆపదనుంచి నువ్వే తప్పించాలమ్మా. మీనాన్నతో మాట్లాడతావో, పోట్లాడతావో ఆయన్నొకదారికి తేవాలి. లేదా నేనేం చెయ్యాలో, ఎలా బతకాలో చెప్పాలి. నీ తల్లిని ఇవాళ నీ కడుపులో పెట్టుకోవాలమ్మా" అంటూ ఏడ్చింది వసంత.

పగలంతా ఎండ వేడి కూడా తెలియకుండా ఆలోచనలతో లావణ్య బుర్ర వేడెక్కిపోయింది. "ఇప్పుడిది మనోహర్‌కి చెప్పాలా వద్దా? అమెరికా వెళ్ళబోతున్న అక్కకీ, తల్లికీ వీడ్కోలు చెప్పే సంతోషంలో ఉన్నాడతను. చెబితే చికాకుపడతాడేమో. చెప్పకపోతే ఎందుకు చెప్పలేదంటాడో- ఏంచెయ్యాలి? అసలీ సమస్య ఏమిటి? పెళ్ళయి ఆరు నెలలయిందో లేదో ఇంత పెద్ద సమస్య నా నెత్తిమీద పడాలా. నాకే రావాలా ఈ సమస్య.

అమ్మకు కూడా మరీ అవివేకం. నాన్నతో ప్రేమగా మాట్లాడి ఆయన మనసు మళ్ళించుకోవాలిగాని ఆయనా ముక్కచెప్పగానే పోట్లాడి కూతురు దగ్గరకొచ్చేస్తే—

నేనేం చెయ్యగలను? నాన్నతో ఈ విషయం నేనేం మాట్లాడగలను?

తల్లిమీద విసుగు, కోపం వచ్చాయి లావణ్యకు. 'ఇక్కడికొచ్చి ఇలా ఏడుస్తూ కూచుంటే నాకెంత ఇబ్బందో ఆలోచించకుండా హఠాత్తుగా వచ్చేసింది. ఏంచెయ్యాలిప్పుడు?'

మనోహర్‌కి ఇప్పుడు చెప్పకూడదనే నిర్ణయానికి వచ్చింది లావణ్య. ఎలాగోలా తల్లికి నచ్చజెప్పి రేపొద్దున్నే హైదరాబాదు పంపించెయ్యాలి. అత్తా, ఆడబిడ్డలు వచ్చివెళ్ళాక మనోహర్‌కి సంగతంతా చెప్పి తండ్రితో మాట్లాడించవచ్చు. మనోహర్ మాట్లాడితే తండ్రికి కాస్త సిగ్గయినా వస్తుంది. అంతకుమించి మరో మార్గంలేదు, కాస్త తెరిపిన పడ్డట్టయింది లావణ్యకు.

మధ్యాహ్నం వసంతచేత బలవంతాన అన్నం తినిపించేసరికి లావణ్యకు తలప్రాణం తోకకు వచ్చినట్లయింది.

"బాగానే ఉంది మేళం" అని లోలోపల విసుక్కుంది. వసంత ఆవేదనంతా లావణ్యకు చిరాకుగానే కన్పించింది. మనోహర్‌కు ఆ విషయం తెలియకుండా ఉంచటం ముఖ్యమయ్యేసరికి— వసంత ఏడుపూ, ఎర్రబడ్డ కళ్ళూ, పీక్కుపోయిన ముఖం ఇవన్నీ సంజాయిషీ చెప్పుకోవాల్సినవిగా కనపడి వాటన్నిటికీ కారణమైన వసంత మీద చిరాకు వచ్చింది లావణ్యకు. రాత్రి మనోహర్ బెడ్‌రూంలోకి వెళ్ళాక తల్లి దగ్గరకు వచ్చింది లావణ్య.

'అమ్మా' అంటూ పక్కనే కూచుని తల్లి చేతులు పట్టుకుంది.

"పడుకోమ్మా- పొద్దుపోయింది" అంది



వసంత లావణ్యా చేతులు నవరిస్తూ.

"అమ్మా మా అత్తగారి సంగతి నీకు తెలియదమ్మా అన్నీ శల్య పరీక్షలు చేసి, యక్ష ప్రశ్నలు వేసి చంపుతుంది. తల్లికి తగ్గ కూతురే మా ఆడబిడ్డ" తప్పు చేసినట్లు ముఖం కిందికి దించుకుని కూచుంది.

"ఏమంటారమ్మా. వాళ్ళకు ఏలోటూ లేకుండా అన్నిలాంఛనాలూ జరిపించాంగా— ఇకేంకావాలిట. ఏం కావాలన్నా ఇచ్చేద్దాం" అంది వసంత.

"ఆ విషయం కాదమ్మా"

"ఏంటమ్మా మరి... వివరంగా చెప్పు"

కాసేపు లావణ్యేంమాట్లాడలేదు. లావణ్యకేం సమస్య వచ్చిందోనని వసంతకు భయం వేసింది.

"వాళ్ళు వచ్చేసరికి నువ్విలా ఇక్కడ వుంటే బాగుండదేమో అమ్మా"

వసంత నెత్తిన పిడుగుపడ్డట్టే అయింది. విహ్వాలంగా తనవంక చూస్తున్న తల్లిని చూసి లావణ్యా గుండె నీరయింది. కళ్ళల్లోకి నీళ్ళొచ్చేశాయి.

"అదికాదమ్మా... వాళ్ళసలు సరిగా అర్థంచేసుకోరు. ఏదో ఒకమాట అని నిన్ను నొప్పిస్తారు. వాళ్ళు వెళ్ళాక నేనూ, మనోహర్ కలిసి వచ్చి నాన్నతో మాట్లాడతాం. నువ్వు రేప్పొద్దున్నే హైదరాబాదు వెళ్ళమ్మా" వసంతకు దుఃఖం కూడా రాలేదు. చేష్టలుడిగినదానిలా అట్లాగే కూచుంది. లావణ్యా నెమ్మదిగా లేచి గదిలోకి వెళ్ళిపోయింది.

"రేప్పొద్దున్నే హైదరాబాదు వెళ్ళమ్మా"— కాస్త దీనంగా, బేలగా ఉన్న లావణ్యా గొంతు వసంత చెవుల్లో మోగుతోంది. 'లావణ్యా తనకేం సహాయం చెయ్యలేదు. ఇన్నాళ్ళూ అది అమ్మ చాటు బిడ్డ. ఇప్పుడు భర్తచాటు భార్య. లావణ్యా దగ్గర నాలుగురోజులుండటం కూడా కుదరదు' మళ్ళీ హైదరాబాదు వెళ్ళాలనే ఆలోచనే వసంతను కుంగదీస్తోంది.

'సురేష్‌కి చెప్పకుండా వచ్చేసింది. రేపు వెళితే ఏమనుకుంటాడు. నవ్వుకోడూ? ఇంకెక్కడా గతి లేదు అనుకోడూ. లావణ్యా ఎట్లా తుంచేసింది తన ఆశల్ని.'

కన్నబిడ్డ వుంది. దానికి తను ఇచ్చిన ప్రేమ వుంది. ఆ ప్రేమ తిరిగి వస్తుంది అని గుడ్డిగా నమ్మింది. లావణ్యకు తనమీద ప్రేమ లేదా. అదంతా అబద్ధమేనా. తన అత్తా, ఆడబిడ్డా అని ఆలోచిస్తుందేగాని తల్లికెంత కష్టం వచ్చిందని ఆలోచించదేం. ఎట్లా ఆలోచిస్తుంది. పెళ్ళి అనుకున్న దగ్గర్నించీ— 'ఇక నువ్వు ఆ ఇంటి మనిషివమ్మా. నీ ఇల్లూ, నీ భర్తా, మీ అత్తా, ఆడబిడ్డలూ అదంతా నీ కుటుంబం. మాదేముంది. నువ్వు చక్కగా సంసారం చేసుకుంటుంటే ఎప్పుడన్నా వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళేవాళ్ళం మేము' అని తనే చెప్పి పంపలేదూ? ఇప్పుడు లావణ్యా వాళ్ళ మనిషి. అయితేమాత్రం ఇటువంటి విషయాల దగ్గరా పుట్టింటినీ కన్నతల్లినీ దూరంగా వుంచేది. చిన్నపిల్ల దానికేం తెలియదు. వాళ్ళొచ్చి ఈ సంగతి తెలుసుకుని తనను చులకనగా చూస్తారేమోనని దాని భయం. తనెక్కడ వాళ్ళ మాటలకు నొచ్చుకుంటుందోనని ముందుగానే ఆలోచించింది. పిచ్చిపిల్ల. ఎంత భయపడిందో ఈ రకంగా ఆలోచించి మనసును శాంతిగా వుంచాలని ప్రయత్నించింది వసంత.

కూతురి తప్పులేదని అనుకోటానికి ఆమె మనసు ఏమీ సందేహించలేదుగానీ— మళ్ళీ వెంటనే హైదరాబాదు అనుకునేసరికి మనసు ఎదురు తిరుగుతోంది. లావణ్యా దగ్గర తనకు ఆశ్రయం దొరకదా అని సంశయిస్తోంది. చివరికి మనసంతా నిరామయంగా మారిపోయింది. 'రేపు మళ్ళీ హైదరాబాదు. మళ్ళీ హైదరాబాదు' ఇదొక్కటే ఆమెకు తెలుస్తోంది.

★ ★ ★

హైదరాబాదు వచ్చిన రెండోరోజునుంచీ లావణ్యకోసం ఎదురుచూస్తోంది వసంత. లావణ్యా వస్తే ఏదో ఓ పరిష్కారం కుదురుతుందనే ఆశ వసంతకు కాస్త ఊపిరాడనిస్తోంది. నవత దగ్గరకు వెళ్ళి లాభంలేదని వసంత నమ్మకం. ఈ విషయం తెలియగానే నవత 'నాన్నకు విడాకులిచ్చెయ్, ఉద్యోగం చేసుకుంటూ బతుకు' అంటుందని వసంత గట్టిగా నమ్ముతోంది.

"నవతకేం తెలుసు ఈ ఇంటితో తనకున్న అనుబంధం. అదొక పెడకట్టి మనిషి. ఒకరోజు





తన పుస్తకాలూ, బట్టలూ సర్దిపెట్టానని విసుక్కుంది. 'నీకెందుకు నా విషయం. నా వస్తువులు నేను సర్దుకోలేనా- అక్కను అన్నం తినటం చేతగాని దానిగా చేస్తున్నావు. నీకేంపనిలేక మా ప్రాణాలు తీస్తున్నావు. B.A. చదివావుగా ఏదో ఒక ఉద్యోగం చూసుకోరాదు. నీకూ కాలక్షేపం ఔతుంది. మేమూ కాస్త సుఖపడతాం'' అని గయ్యిమంటూలేచింది.

''మీ అందరికీ అన్నీ అమర్చిపెట్టటమే నా ఉద్యోగం'' అంది తను.

''అలా పతివ్రతల కబుర్లు చెప్పకు. నాకు చిరాకు. నీదంతా ఒట్టి స్వార్థం'' అంది నవత.

''స్వార్థమా... మీకు, మీ నాన్నకూ అన్నీ అమర్చిపెట్టటం నా స్వార్థమా'' అని తను కూడా కోపంగా వాదనకు దిగింది.

''ఆఁ— పరమస్వార్థం. మేమందరం నీ మీద ఆధారపడితే నీకు సంతోషం. ప్రతిదానికీ అమ్మా అమ్మా అంటూ నీ వెనక తిరగాలని నీఉద్దేశం. నాన్ననలాచేశావు. నాన్నకి చొక్కా గుండీ కుట్టుకోవటంరాదు. పెన్నూ కళ్ళజోడూ ఒక జేబులోంచి ఇంకొక జేబులోకి మార్చుకోవటంరాదు. నాన్ననొక చేతకానివాడిలా తయారు చేశావు. నేను మాత్రం అలా తయారుకాను'' అంటూ పోట్లాటకు దిగింది.

అది సురేష్‌తో చెప్పి నవ్వుకుంది తను. నిజంగానే వాళ్ళకు ఇబ్బంది అని ఎక్కడికీ బంధువులూ, స్నేహితులూ ఎవరిళ్ళకూ వెళ్ళేదికాదు. పెళ్ళిళ్ళకు అత్యవసరమైతే ఆరోజుకి మాత్రం వెళ్ళేది. రోహిణి పెళ్ళినాటికి నవత పుట్టి మూడేళ్ళు. నవతను తీసుకుని వెళ్ళొచ్చు. కానీ సురేష్‌కి బాగోలేదనీ, లావణ్యకి పరీక్షలనీ వెళ్ళనేలేదు. పెళ్ళయ్యాక రోహిణీవాళ్ళే వచ్చి వెళ్ళారు. అవన్నీ వాళ్ళకోసం ఆనందంగా త్యాగంచేసింది. అది త్యాగంకాదు స్వార్థం అంటుంది నవత. దాని దగ్గరకు వెళితే ఈ సమస్య మరింత చిక్కుబడుతుందే తప్ప సురేష్ దక్కడు. తను ఈ ఇంట్లో సురేష్‌తో మళ్ళీ మామూలుగా బతకాలి. దానికోసం ఏమన్నా చెయ్యగలిగితే లావణ్యే చెయ్యగలుగుతుంది. లావణ్యకోసం ఎదురు చూస్తోంది వసంత. సురేష్ మామూలుగానే మాట్లాడుతున్నాడు. ఏమీ జరగనట్లే ప్రవర్తిస్తున్నాడు. రాత్రుళ్ళు మాత్రం బాగా పొద్దుపోయి ఇంటికి వస్తున్నాడు. ఒకో రోజు అసలే రాడు.

తనకు చెప్పేశాక అతనికి సంజాయిషీలు ఇవ్వాల్సిన బాధ తప్పిపోయి హాయిగా ఉన్నట్లుంది. ఆ నిజం తనను మోసం చెయ్యటం ఇష్టంలేక చెప్పానన్నాడు గానీ తన సుఖం కోసమే చెప్పి ఉంటాడు. ఇప్పుడు ఎంత ఆలస్యంగా వచ్చినా, అసలు రాకపోయినా నేను అర్థంచేసుకోవాలి. పొరపాటున అడిగితే చెప్పేస్తాడు నీలిమ దగ్గరకు వెళ్ళానని. తనేం చెయ్యగలదు?

ఆరోజు రాత్రి రెండుగంటలకు ఇంటికొచ్చిన సురేష్‌ని చూసి వసంతకు సహనం నశించింది.

''ఆ నీలిమ ఇల్లు ఎక్కడ?''

''ఎర్రమంజిల్ క్వార్టర్స్‌లో''

''ఇంత రాత్రిదాకా మీరక్కడ ఉంటే నేనొక్కదాన్నే ఎలా ఉంటాననుకున్నారు''

''నీకలవాటేగా... నైట్ డ్యూటీ ఉన్నప్పుడు ఉండటం లేదూ-''

''ఎప్పుడన్నా ఉండటంవేరు. రోజూ నేనొక్కత్తినే ఉండాలంటే-''

''నేనిప్పుడు వచ్చేస్తే నీలిమ కూడా ఒక్కత్తే. అయినా నీకోసమే నేనిక్కడకు వస్తున్నాను'' సురేష్ మాటలకు వసంతకు ఒళ్ళు తెలియని కోపం వచ్చింది.

''నా కోసం మీరిక్కడకు వచ్చితీరాలనీ, నేను మీ భార్యననీ, నీలిమ అనే వ్యక్తి ఉందని మీకు ఏమాత్రం తెలియక ముందే, ఇరవయ్యేళ్ళక్రితమే నేను మీ భార్యననీ ఆమెకు తెలియదా? ఆవిడ ఒంటరిగా ఉండలేకపోవటానికీ నాకూ సంబంధమేమిటి- నా భర్త ఇంటికి ఆలస్యంగా వస్తే నిలదీసి అడిగే హక్కు నాకు లేదా? నీలిమ ఒంటరిగా ఉంటుందని నేనెందుకు ఆలోచించాలి. నీకోసం ఇంటి దగ్గర ఎదురు చూసే నేనున్నానని ఆవిడెందుకాలోచించదు''

''నీలిమ ఎందుకాలోచించదు? తను నీ గురించి చాలా బాధపడుతుంది''

వసంతకు విరగబడి నవ్వాలనిపించింది.

''నీలిమ నా గురించి బాధపడుతుందా. ఎందుకంత బాధ. నాకూ, తనకూ కూడా బాధ

లేకుండా చెయ్యటం ఆవిడకేం కష్టంకాదే''

''అది కష్టంకాకపోతే ఎప్పుడో చేసుండేది. నీలిమకు నేనంటే ప్రాణం. మేం ప్రేమించుకున్నాం''

''ప్రేమించుకోండి. నేను చచ్చిపోతాను. పెళ్ళి కూడా చేసుకుని హాయిగా ఉండండి''

పిచ్చిగా ఏడుస్తున్న వసంతను పట్టుకుని - ''వసంతా... నువ్వలా అనకు ప్లీజ్, ఊరుకో'' అంటున్న సురేష్ వంకకు విసురుగా తలెత్తింది వసంత.

దీనంగా కళ్ళల్లో నీళ్లతో అలిసిపోయినట్లున్న సురేష్‌ని చూస్తే వసంత కోసం ఆవిరైపోయింది.

''నేనేం చెయ్యనండీ... చెప్పండి. చచ్చిపోకూడదు. ఏడవకూడదు. బాధ పడకూడదు. అదేమిటని మిమ్మల్ని అడగకూడదు. ఏంచేయను ఏం చెయ్యను''

''నేను తప్పేచేశాను వసంతా. నీలిమను దూరంగా ఉంచాల్సింది. కానీ ఉంచలేకపోయాను. నీమీద నాకేం కోపం లేదు. కానీ నీలిమంటే ప్రేమ. ఏంచెయ్యాలో తెలియటం లేదు. మీ ఇద్దరికీ బాగుండేట్లు ఏంచెయ్యాలో నాకు తెలియటం లేదు. నిన్ను బాధ పెట్టగూడదని ఎంతో అనుకుంటాను''

''మీ దయ నాకవసరంలేదు.''

''దయకాదు... నీ దుఃఖం, నీ బాధ చూస్తుంటే నాకు ఎంత నరకంగా ఉందో నీకు తెలియదు. కానీ నేను నీలిమ సంగతి కూడా చూడాలి. నీ మీద బాధ్యతుంటే నీలిమ మీద ప్రేమ ఉంది. నేనేం చెయ్యాలో నాకు తెలియటంలేదు'' తల పట్టుకుని కూచున్నాడు సురేష్.

ఈ బాధంతా నిజమేనా? నటనా? నీలిమ దగ్గర కూడా ఇలాగే మాట్లాడి ఉంటాడు. నీలిమనుంచి ఎలా తప్పించాలా అని నేనాలోచిస్తుంటే నా నుంచి ఎలా తప్పించాలా అని నీలిమ ఆలోచిస్తుంటుంది. ఇది చివరకు ఎలా తెగుతుంది? నేనేం చెయ్యాలి? ఆవిడో, నేనో తేల్చుకో అని సురేష్‌తో నిక్కచ్చిగా మాట్లాడగలనా? ఇన్నాళ్ళూ సురేష్ ఇష్టాలే నా ఇష్టాలు. అతని అభివృద్ధే నా అభివృద్ధి, అతని ఆనందమే నా ఆనందం. ఎప్పుడూ అతని సహకరించటమే తప్ప ఎదురు నిలబడి పోట్లాడటం తనకు చేతకాదు. తనకా శక్తి లేదు అసలు పోట్లాడటం మంచిదో కాదో కూడా తనక్కే తెలియదు. ఎవరన్నా తనకు కాస్త చెబితే బాగుండు - ఏం చెయ్యాలో ఏం చెయ్యకూడదో!

లావణ్యా తొందరగా రామ్మా...!

వసంత ప్రాణమంతా లావణ్యా మీదే.



మర్నాడు ఎర్రమంజిల్‌కు వెళ్లకుండా ఉండలేకపోయింది వసంత. నీలిమను చూడాలనే ఆలోచన ఆమెను నిలవనివ్వలేదు. సురేష్‌ని ఆమె దేనితో ఆకర్షించింది. ఏమిటామె గొప్పదనం. ఎర్రమంజిల్‌కాలనీలో వసంతకు తెలిసినవాళ్ళున్నారు. వాళ్ళింటికి వెళ్ళి నీలిమ ఇల్లు వెతికి పట్టుకోవచ్చు అని బయల్దేరింది. కానీ ఆ కాలనీ గేటు దగ్గరే సురేష్ స్కూటర్ వెనక కూచుని వెడుతున్న నీలిమ కనిపించనే కనిపించింది. ఒక్కక్షణంలోనే నీలిమను అపాదమస్తకం చూసింది వసంత. 'నాకంటే చిన్నది. నాకంటే రంగు తక్కువ. కానీ బాగుంది' నీరసంగా అనిపించింది వసంతకు.

కాలనీలోకి అనాలోచితంగానే నడుస్తోంది. ఉదయాన్నే ఇక్కడికొచ్చి ఆమెతో కలిసి హాస్పిటల్‌కి వెళ్తున్నాడన్నమాట. హఠాత్తుగా ఆమె కాళ్ళు ఆగిపోయాయి. ఎదురుగా కనిపిస్తున్న ఇంటిమీద డాక్టర్ నీలిమ అన్న పేరుచూసి స్పృహలోకి వచ్చినట్టయింది వసంతకు. ఇల్లు తాళంవేసిలేదు. వసంత ధైర్యం చిక్కబట్టుకుని ఇంట్లోకి నడిచింది. ఇంట్లో ఎవరూ కన్పించలేదు. విశాలంగా ఉన్న హాల్లోకి నడిచింది. ఆ హాల్లో ఓ పరుపుతప్ప మరేం లేవు.

వరండాలో కుర్చీలు గదిలో భోజనం చేసే టేబుల్ చిన్నదొకటి ఉంది. పక్కన గదిలో మంచం. చీరలు వేసుకునే స్టాండు ఉన్నాయి. వంటిల్లు చాలా చిన్నది. దాన్లో కూడా సామానె క్కువలేదు. ఇల్లంతా విశాలంగా కనిపిస్తోంది. పరిశుభ్రంగా ఉంది.

"ఇదేం ఇల్లు... అంతా బోడిగా, బోసిగా ఉంది"

ఆరాటంగా మళ్ళీ వరండాలోకి వచ్చింది వసంత. గేటు తీసుకుని "ఎవరు కావాలమ్మా'? అని అడుగుతూ పనిపిల్ల కాబోలు లోపలకు వచ్చింది.

"డాక్టరమ్మగారు హాస్పిటల్‌కి వెళ్ళిపోయా రు. మంచినీళ్ళు తాగుతారా?" అని మర్యా దగా అడిగింది ఆ పిల్ల. "ఒద్దు" అని చెప్పి బయటపడింది వసంత.

మళ్ళీ తన ఇంటికి వచ్చాకగానీ ఊపిరాడ లేదు.

"అదేంఇల్లు. అదేం మనిషి. ఆ ఇంట్లో ఎట్లా ఉండబుద్దేస్తోంది సురేష్‌కి" ఇల్లంతా కలయజూసింది వసంత.

ఇంటి నిండుగా సామాను. డ్రాయింగ్ రూం నిండా ఫర్నీచరు, బెడ్ రూం నిండుగా మంచా లు. రెండు బీరువాలు. డైనింగ్ రూంకి సరి పడా పెద్ద టేబుల్, ఫ్రిజ్. వంటింటినిండా తళతళ మెరిసే సామాను. పింగాణీ కప్పులు. గాజు గ్లాసులు, ప్లేట్లు. వేటికవి పద్ధతిగా, పొందికగా సర్ది ఉన్నాయి.

వాటన్నిటిమధ్యానుంచున్న వసంతకు తా నిప్పుడు భద్రంగా ఉన్నానన్న భావన బలంగా కలిగింది. ఆ ఫర్నీచరు, ఆ సామానూ తనకు రక్షణ కవచాల్లా అనిపించాయి. చాలా సురక్షి తమైన ప్రదేశంలో నిశ్చింతగా ఉన్నట్లని పించింది. ఈ ఇంటికి అలవాటైన సురేష్ ఆ బోసి ఇంట్లో ఎలా ఉంటున్నాడో ఆమెకర్థంకాలే దు. ఆ ఇంట్లో గోడలకు ఒక్క పటమన్నా లేదు. హాలంతా ఖాళీగా. మూలనెక్కడో పరుపు. అది తల్చుకుంటేనే భయంవేసింది వసంతకు.

సురేష్ అక్కడ ఉండలేదు. ఎటుచూస్తే అటు పలకరిస్తున్నట్లు పరిచయమైన ఈ సామానంతా ఒదిలి సురేష్ ఎట్లా ఉంటాడు? తప్పక తన దగ్గరకే వస్తాడు. ఇదంతా నాలుగు రోజుల వ్యవహారమే.

వసంతకు లోపల్నించే ధైర్యం, బలం వచ్చాయి. ఇల్లంతా శుభ్రంగా సర్దటం మొద లుపెట్టింది వసంత. సురేష్ బట్టలూ, పుస్తకా లూ అన్నీ చక్కగా సర్దింది. అన్నీ అమర్చి వుంటే ఈ ఇంటిని సురేష్ ఎప్పటికీ వదల్లేడు అనుకుని తృప్తిగా నిట్టూర్చింది.

సురేష్‌కోసం పకోడీలు చేసింది. ఇవాళ పెందరాళే రమ్మని చెప్పాలి. నీలిమ దగ్గరకు వెళ్లకుండా ముందే ఇక్కడకు రప్పించాలి. అలసిపోయి వచ్చిన అతనికి విశ్రాంతి ఇక్కడే దొరుకుతుందని నిరూపించాలి- అనుకుంటూ హాస్పిటల్‌కి ఫోన్ చేసింది వసంత.

అవతలనుంచి వచ్చిన సమాధానం విని కట్టెలా బిగుసుకుపోయింది:

వారంనుంచీ సురేష్ హాస్పిటల్‌కి రావ డంలేదు. శలవు పెట్టాడు. మరో మూడు రోజులు సెలవులోనే ఉంటాడు. వసంతకేదో అనుమానం తోచి నీలిమ కావాలని అడిగింది. నీలిమ కూడా అంతే సెలవులో వుంది. వసంతకు ఒక్కసారిగా ఒంట్లోంచి సర్వశక్తులూ ఉడిగిపోయినట్లనిపించింది.

"ఈవారం రోజులూ పగలంతా వాళ్ళిద్దరూ కలిసే ఉంటున్నారు. పగలేగమిటి- రాత్రిళ్ళు కూడా. ఏ రెండింటికో ఇంటికొస్తున్నాడు. అక్కడ ఆ నీలిమ ఇంట్లో పగలూ రాత్రీ సుఖంగా ఉంటున్నాడు"

అంతకుముందు తనకు రక్షణ అని పించిన సామానంతా ఇప్పుడు తనను చూసి నవ్వుతున్నట్లనిపించి ఇంట్లోంచి బైటకు నడి చింది వసంత.

"సురేష్‌కలాగే ఇష్టమా- ఎందుకు ఈ సామానంతా అనవసరంగా అనేవాడుగానీ, అది అద్దె ఇంట్లో ఉన్నప్పుడు. స్వంత ఇంటికొ చ్చాక రోజుకోరకంగా ఇంటిని సర్దుతుంటే పనీ పాటా లేకపోతేసరి అని విసుక్కునేవాడు. కానీ అది తనెప్పుడు సీరియస్‌గా తీసుకోలేదు. ఈ ఫర్నీచరూ, ఈ ఇంటి పద్ధతీ ఇదంతా సురేష్‌కి ష్టంలేదా? నవతకైతే ఇష్టంలేదు.

"ఇంట్లో కదలటానికీ, మెదలటానికీ లేకుండా సామానుతో నింపేస్తావు" అని విరా





కుపడే వసంతకు పిచ్చెక్కినట్లయింది.

"లావణ్యా తల్లీ- మీ అమ్మను ఎప్పుడీ పిచ్చిలోంచి బైటపడేస్తావమ్మా"

★ ★ ★

ఎలాగైతేనేం వసంత ఎదురు చూసిన రోజు వచ్చేసింది. లావణ్యా, మనోహర్‌లు వచ్చారు. ఆరోజు రాత్రి సురేష్ ఇంట్లోనే ఉన్నాడు. ఉదయాన్నే వచ్చిన కూతుర్నీ అల్లుడినీ చూసి సంతోషించాడు. వసంత సంగతి చెప్పక్కర్లేదు. ఈ ఇరవైరోజుల్లో ఆమె ముఖం కాస్త తేటగా, ఆనందంగా ఉందీరోజే. ఎనిమిదిన్నరకు నలుగురూ టేబుల్ ముందు కూచుని టిఫిన్లు చేస్తుంటే అసలు ఏమీ జరగనట్టూ, అంతా మామూలుగానే ఉన్నట్టూ, అదంతా కలైనట్టూ అనిపించింది వసంతకు. ఉత్సాహంగా వడ్డిస్తున్న అమ్మను చూసి లావణ్యకు కూడా అసలు సమస్య తీరిపోయిందా అన్న అనుమానం వచ్చింది. కాఫీ తాగి మనోహర్, సురేష్‌లు బైటికెళ్ళారు.

లావణ్య వంటింట్లో తల్లిపక్కనే చేరింది. సమస్య అలాగే ఉందని తల్లితో మాట్లాడిన రెండుమాటల్లోనే అర్థమయింది లావణ్యకు.

"నాన్నతో ఆయన మాట్లాడతానన్నారమ్మా- రాత్రికి నేను మాట్లాడతాను" అంది లావణ్య.

"అంతా మీ చేతుల్లో పెట్టాను. ఎలాగోలా ఈ ఇల్లు నిలబెట్టాల్సింది నువ్వే" అంది వసంత లావణ్య చేతులు పట్టుకుని.

"నేనేం చెయ్యగలనమ్మా. ఆయనేం చెబితే అది చెయ్యాల్సిందే గదా. ఆయన మాట్లాడతారుగా" అంది లావణ్య బారంగా.

మధ్యాహ్నానికి మనోహర్ ఒక్కడే వచ్చాడు. భోజనం చేసి పడుకోవటానికి గదిలోకి వెళ్ళాడు. లావణ్య అతని వెనకాలే వెళ్ళింది. గుండెలు గుబగుబలాడుతుండగా ఆ గది తలుపులు ఎప్పుడు తెరుచుకుంటాయా అని ఎదురు చూస్తూ కూచుంది వసంత. లావణ్య వెంటనే బైటికి రాకపోవటం ఆమె భయాన్ని పెంచింది.

"మనోహర్ మాటలకు ఆయన ఒప్పుకుని ఉంటే లావణ్య వెంటనే వచ్చి చెప్పేది. ఏంజరిగింది? ఇంతసేపూ ఏం మాట్లాడుకుంటున్నారు? ఎప్పుడు బైటికొస్తుంది. భగవంతుడా-నాకే ఎందుకు రావాలీ కష్టం"

సాయంత్రం ఐదు గంటలకు లావణ్య గదిలోంచి బైటపడింది.

"ఏంటమ్మా-ఏమన్నాడు మనోహర్" ఆత్రతగా అడిగింది వసంత.

"నాన్న మంచివాడేనమ్మా" లావణ్య మాటలకు అదిరిపడింది వసంత. "అంటే-ఏంజరిగిందమ్మా... మనోహర్ మాటలకు ఒప్పుకున్నారా?"

"ఒప్పుకున్నాడమ్మా. నాక్కా, సవతకూ సమానంగా ఆస్తి పంచాడు. మా వాటాకు రెండు ఎకరాలూ, 50 వేలూ వచ్చింది. చెల్లికీ అంతే. ఈ ఇల్లు నీకు ఇస్తానన్నాడు. ఇల్లు నీ పేర రాయించేసుకుంటే-"

వెర్రిగా చూస్తున్న వసంతను చూసి మాటలు ఆపింది లావణ్య.

"అమ్మా-అమ్మా" అంటూ కుదిపింది.

"ఏంటే- నువ్వు మాట్లాడేదేంటి మనోహర్ మీనాన్నతో ఏంమాట్లాడాడు. అసలు మనోహర్ ఏమంటాడు" వసంత వెర్రిగా ప్రశ్నించింది.

"ఆయనేమంటాడమ్మా. ఆయనేమన్నా అంటే నాన్న వింటాడా"

"నాన్నతో ఈ విషయం మాట్లాడాడా లేదా?"

"ఈ విషయం అంటే ఈ విషయం కాదు గానీ ఈ విషయానికి సంబంధించే మాట్లాడాడు" నానుస్తూ చెప్పింది లావణ్య.

" ఆ డొంకతిరుగుడేమిటే. సూటిగా చెప్పు. అసలు మనోహర్ ఏమంటాడు"

"ఈ విషయం నేను చెప్పగానే మనోహర్‌కి చాలా కోపం వచ్చింది. నాన్నను బాగా తిట్టాడు. కాని ఆయన ఈ విషయం నాన్నతో మాట్లాడనన్నాడు. ఆయనకు సిగ్గు లేకపోతే నాకుంది. నేనెట్లా మాట్లాడతాను - అంటాడు"

"మరి పొద్దున మీ నాన్నతో ఏమీ మాట్లాడలేదటనా ఆస్తులేమిటి?" నీరసంగా అడిగింది వసంత.

"నాన్న ఆవిడమీద మోజుతో ఆస్తంతా తగలేస్తే మనం ఏం చెయ్యగలం. ముందుగానే జాగ్రత్తపడటం మంచిదన్నాడు మనోహర్. పెళ్ళప్పుడు కట్నం ఏమీ ఇవ్వలేదు. ఇప్పుడు

నాన్న ఇలా చేశాడనగానే ఆయనకు ఆ అనుమానం వచ్చింది. వచ్చే సంవత్సరం మేం కూడా అమెరికా వెళ్ళాలి. నాన్న డబ్బివ్వక పోతే చాలా కష్టమవుతుంది. అందుకని ముందుగానే మనకు రావలసిందేదో అడిగి పుచ్చుకుందామంటాడు మనోహర్. నేనేం చెయ్యను చెప్పు. నాన్న పొద్దున ఆస్తిపాస్తుల వివరాలన్నీ మనోహర్‌కి చెప్పాడట. ప్రస్తుతం మాకు ఇచ్చేది ఇచ్చాడు. నేనివాళ రాత్రికి నీసంగతి మాట్లాడతాను. ఈ ఇల్లు నీపేరు మీద రాస్తే నీకే చిక్కూ ఉండదు''

''ఏంటమ్మా మాట్లాడవూ?'' లావణ్య తల్లిని విసుక్కుంది.

''ఆస్తి రాయించటానికా మిమ్మల్ని రమ్మన్నాను'' వసంత ఎక్కడో పాతాళంలోకి పడిపోతున్నట్టు పలికింది.

''మరి నాన్న వినిపించుకోనపుడు మేం ఏంచేస్తాం?''

''వినిపించుకోటానికి అసలు చెప్పిందెక్కడ''

''నాన్నేమన్నా చిన్నపిల్లాడా? ఏమని చెపాలి. నువ్వే నాలుగురోజులు ఓపిక పట్టాలి- రాత్రికి నేను మాట్లాడతానన్నానుగా''

''నువ్వేం మాట్లాడొద్దులే'' వసంత స్థిరంగా అంది.

''అదేంటి మళ్ళీ'' లావణ్య ముఖం చిట్లించింది.

''ఆస్తుల పంపకాల కోసం మీరొచ్చారని నేననుకోలేదు. అమ్మకింత కష్టం వచ్చింది ఆదుకుందామని వచ్చారనుకున్నాను. మీ నాన్న ఆస్తి మీకివ్వకుండా ఎవరికో ఇస్తాడని నాకు అనుమానం కూడా రాలేదు. ఈ ఇంట్లోంచి నన్ను తరిమేసే ధైర్యం మీనాన్నకుందని నేననుకోను. వాటికోసం కాదమ్మా నిన్ను పిలిచింది. అమ్మనిట్లా చెయ్యటం న్యాయమా నాన్నా అని నాలుగు మాటలు నా తరపున అడిగి నాన్నను ఒప్పిస్తావనీ, అప్పటికీ మీనాన్న దారికి రాకపోతే మీ నాన్నకు బుద్ధొచ్చే దాకా నీ కడుపులో దాచుకుంటావనీ నిన్ను రమ్మ[illegible]ను. సరే-మీ భయాలు మీవి. మీ ఆస్తులు తీసుకుని మీరు వెళ్ళండి- నాతిప్పలు నేను పడతాను''

''నిన్ను నాతో తీసుకెళ్ళనన్నానా - రాత్రికి నాన్నతో మాట్లాడి-''

''ఏంమాట్లాడతావు... అమ్మకీ ఇల్లు ఇవ్వు నాన్నా నేను తీసుకెళతానంటావా? మహరాజులా ఇస్తాడు. పీడ వదిలిందే చాలనుకుంటాడు. నా వాటా నేను తీసుకుని మీ ఇంటికి వచ్చివుండే ఖర్మ నాకెందుకు. నాకు నా భర్తా, నా ఇల్లూ కావాలి. నేనిక్కడే వుంటా. నువ్వన్నట్లు ఓపిగ్గా ఉంటాను. ఎప్పటికో ఒకప్పటికి ఆయన మనసే మారుతుందేమో - మారినా మారకపోయినా నేనీ ఇల్లు వదిలిరాను. నువ్వు నా విషయం మీ నాన్నతో ఏమీ మాట్లాడొద్దు''

వసంత అక్కడినుంచి వెళ్ళిపోయింది.

''బాగానేవుంది... నీకోపమంతా నామీద చూపిస్తే నేనేం చెయ్యను'' అని గొణుక్కుంటూ మనోహర్ దగ్గరకు వెళ్లింది లావణ్య. వసంత ఆ రాత్రి ముభావంగా అన్నాలు వడ్డించింది. సురేష్ ఆరోజు సాయంత్రం పెందలాడే వచ్చి ఇంటిదగ్గరే ఉన్నాడు. అన్నాలు తినగానే లావణ్యా, మనోహర్‌లు గదిలో దూరారు.

సురేష్ కాసేపు వరండాలో పచార్లుచేసి పడుకోవటానికి వచ్చాడు. వసంత కోపంతో కుతకుతలాడుతోంది. ''ఆస్తులన్నీ పంచేశారటగా. అన్నీ తెంచుకుని వెళ్ళిపోతారా ఇక?'' సురేష్ రాగానే మండిపడుతూ అడిగింది.

''తెంచుకుపోవటం ఏమిటి? మనోహర్ ఖచ్చితంగా అడిగాడు. లావణ్యకూడా కావాలంటోందన్నాడు. నా పిల్లకే నామీద నమ్మకం లేనప్పుడు అతనికేం ఉంటుంది? ఆస్తి పిల్లలకు దక్కకుండా నాశనం చెయ్యాలని నాకెప్పుడూలేదు. వాళ్ళకివ్వదలిచిందేదో ఇచ్చేశాను''

''నాకివ్వదలిచింది కూడా ఇచ్చి పంపుతారా?''

''పిచ్చిగా మాట్లాడకు'' అరిచాడు సురేష్.

''అంటే ఆపాటికూడా లేకుండా చేస్తారా- మీకేం అన్యాయం చేశానని దిక్కులేనిదానిలా''

''వసంతా... నీక్కావాలంటే ఆస్తి మొత్తం రేపే నీ పేరుమీద రాస్తాను. నన్ను పీడించకు''

''ఆ ఆస్తి చూసుకుని నేను మురిసి ముక్కలవుతుంటే దాసితో మీరు కులుకుతూ





కూచుందామనా?''

"వసంతా" అంటూ చెయ్యెత్తాడు సురేష్. వసంత బెదిరిపోయి ఏడవటం మొదలుపెట్టింది.

"ఛీ... ఈ బతుకు బతకటం కంటే చావటంనయం" అంటూ బైటికెళ్ళిపోయాడు.

స్కూటర్ స్టార్ట్ అయిన చప్పుడికి వసంత ఈ లోకంలోకి వచ్చింది. వసంత బైటికొచ్చేలోగా సురేష్ వెళ్ళిపోయాడు. "నీలిమ దగ్గరకు వెళ్ళి ఉంటాడు. ఇంత చిరాకులో వెళ్ళాడు. ఆవిడ దగ్గర హాయిగా ఉంటాడా. ఆవిడ నాలా పోట్లాడకుండా నవ్వుతూ ఉంటుందా? నువ్వు నా దగ్గరకు రాకపోయినా ఫరవాలేదు. శాంతిగా ఉంటే చాలు నాకు అని డైలాగులు చెబుతుంటుందా. నీ దగ్గరే నాకు శాంతి అని దాంతో ప్రేమగా" - వసంత డీలాపడిపోయింది.

"ఎందుకిట్లా చేశాను. ఓర్పుగా ఉండాలనుకుని అతన్నెందుకు రెచ్చగొట్టాను. ఇంట్లో వున్న మనిషిని బైటికెందుకు పోనిచ్చాను. ఇలాగైతే అతను పూర్తిగా అక్కడే ఉంటాడు. ఇంటికిరాడు. తను అనుకున్నదేమిటి? చేసిందేమిటి? ఎందుకిలా తప్పులు చేస్తోంది? ఎలా ప్రవర్తించాలో తనకు తెలియటంలేదు. తనకు చెప్పేవాళ్ళు కూడా ఎవరూలేరు. లావణ్యా - లావణ్య ఎందుకిలా చేసింది. తండ్రీకూతుళ్ళు మధ్యా, తల్లీకూతుళ్ళ మధ్యా డబ్బేనా ఉంది - ఇంకేమీలేదా. డబ్బు తీసుకుని తనదారినతాను వెళ్తుంది. నేనేమైనా పట్టించుకోదు. ఈ లావణ్యకోసం ఎన్ని కష్టాలు పడ్డాను. దాన్ని కని పాలిచ్చి పెంచాను. పాలిచ్చి పెంచడమంటే ఏంటో దానికింకా తెలియదు. తెలిస్తే ఇట్లా మాట్లాడదు. అది పాలు తాగుతుంటే తనకు విపరీతమైన ఆకలి, దాహం. ఎంత తిండి తినేదాన్ని ఎన్ని నీళ్ళు తాగేదాన్ని. అయినా ఆ దాహం తీరేదికాదు. నాలుక పీక్కుపోయేది. ఐనా సరే అదొక్కపూట సరిగా పాలు తాగకపోతే తన ప్రాణం పోయినంత వనయ్యేది. అప్పుడూ ఇప్పుడూ తల్లిప్రేమకు దాహమేనా మిగిలేది? అప్పుడు నీళ్ళు ఇప్పుడు కన్నీళ్ళు తాగి బతకాలా. ఐనా ఈ మమకారం పోతుందా - ఈ దాహం ఆగుతుందా''

వసంతకు సురేష్ చేసిన ద్రోహంకంటే లావణ్య చేసిన ద్రోహం ఎక్కువగా కనిపించసాగింది.

ఇరవై సంవత్సరాలు ఒంట్లోని ప్రతికణంలో ప్రతి రక్తపు బొట్టులో ఇంకించుకున్న నమ్మకాలు వమ్మయిపోతుంటే నమ్మలేకపోయింది వసంత.

'ఈ సంబంధాలు ఇంత బలహీనమైనవా? వీటిని ఆధారం చేసుకుంటే కాళ్ళకింద భూమి ఇలా కదిలిపోతుందా. ఇట్లా శూన్యంలో నిలబడాల్సి వస్తుందా. ఇన్నాళ్ళ తన తృప్తీ, ఆనందం, శాంతీ ఇంత అర్ధరహితమైనవా' ఇది ఆలోచించినకొద్దీ వసంతకు పిచ్చెక్కుతోంది.

"మీరు ఆఫీసుకు వెళ్ళి ఎన్నిరోజులయింది?''

"పదిరోజులు''

వసంత ప్రశ్న అడిగిన ధోరణిని బట్టి ఆమెకు అసలు విషయం తెలిసిపోయిందని అర్థమయింది.

"ఎందుకిట్లా చేస్తున్నారు?''

"నీలిమ శలవు తీసుకుని మూడు సంవత్సరాలు అయిందట- ఒక పదిరోజులు శలవుపెట్టి సరదాగా గడుపుదాం అంది''

"నాతో ఎప్పుడన్నా పదిరోజులు శలవుపెట్టి గడిపారా?''

"నేను ఎప్పుడూ నీతోనే ఉంటున్నాగా. రేపటినుంచీ నీలిమకు హాస్పిటల్‌తో సరిపోతుంది- తీరికేది?''

ఈ మనిషికంత సిగ్గులేకుండా పోయిందేమిటి. అదీ, నేనూ ఒకటన్నట్లు మాట్లాడుతాడేం. వసంతకు ఒళ్ళుమండిపోయింది.

"పిల్లలు ఎవరిదారినవాళ్ళు వెళ్ళిపోయాక నేనూ ఒక్కదాన్నే ఉంటున్నాను. పదిరోజులు శలవుపెట్టి నాతో గడుపుదామని అనుకోలేదే''

"నీతో ఏంమాట్లాడాలో నాకు తెలియదు. ఇంటి విషయాలు తప్ప నీతో మాట్లాడటానికి ఏమీ ఉండవు''

"నీలిమతో ఏముంటాయో''

"ఏవో ఒకటి. హాస్పిటల్ కబుర్లు. సంగీతం,

పుస్తకాలు ఏవో మాటలు. ప్రపంచం గురించి తెలుసామెకు''

''నాకూ తెలుసు... మిమ్మల్ని పెళ్ళిచేసుకోక ముందు ఆ బోడి నవలలు నేనూ చదివేదాన్ని. ఇప్పుడు నా ప్రపంచం మీరు- పిల్లలే. మీ ముగ్గురి గురించీ నాకు తెలిసినట్లు ఎవరికన్నా తెలుస్తుందా- ఇరవైసంవత్సరాలనుంచీ మీకు కావలసిందేమిటో తెలుసుకోవటమే నా జీవితం అనుకున్నాను''

''ఐనా నీకేం తెలియదు వసంతా. నాకు నీలిమ కావాలని నీకు తెలుసా? నీకా విషయం అర్థమవుతుందా. ఈ పరిస్థితుల్లో లావణ్య ఆస్తి గురించి అడుగుతుందని నువ్వు అనుకు



న్నావా? నవత నీకెప్పుడూ అర్థంకాదు. ఇన్నాళ్ళూ మమ్మల్ని అర్థంచేసుకోవటంలో పొరపాటుపడ్డావు''

వసంత నిస్సత్తువుగా కూలబడిపోయింది.

''ఔను... మిమ్మల్ని అర్థంచేసుకోవటం నాకు తెలియదు. చేతకాదు. నేను మిమ్మల్ని ఎవర్నీ అర్థంచేసుకోలేదు''

''వసంతా... ఊరుకో. మా అందర్నీ సుఖపెట్టటానికి నువ్వు కష్టపడ్డావు. కానీ మాకా సుఖం చాలలేదు. లేక ఆ సుఖం విలువ తెలియలే



దేమో''

"వాళ్లను సుఖపెట్టడానికి కష్టపడిన ఓ సేవకురాలిని. అంతకంటే తనకు విలువ లేదా. వాళ్ళూ తనూ వేరా? కుటుంబంకోసం సురేష్ కష్టపడి డబ్బు సంపాదిస్తున్నాడు. తాను వాళ్లకు కావల్సిన సదుపాయాలన్నీ చేసి ఇల్లుదిద్దుతోంది. ఇదొక కుటుంబం. ఈ కుటుంబంలో ప్రతివాళ్ల శ్రేయస్సుకోసం అందరూ కష్టపడవద్దా. అలా కాకపోతే కుటుంబానికి అర్థమేముంది. 'నువ్వు మాకోసం కష్టపడ్డావు' అంటూ వేరుచేస్తాడెందుకు? నన్ను కించపరుస్తాడెందుకు? డబ్బు సంపాదించటమనే పని కుటుంబంకోసం చెయ్యలేదా? మగవాడు కాబట్టి ఏదో ఒకటి చేసి తన శక్తినిరూపించుకోటానికి చేశాడా. అందుకే మీకోసం కష్టపడ్డానని అనటంలేదా.

నవత తనను ఉద్యోగం చేయమన్నప్పుడు నాకంత తీరికేదీ అంటే ఏమనేది. ఎవరిపనులు వాళ్ళను చేసుకోనిచ్చి, ఇంటిపనులు అందరూ చేస్తే నీకు బోలెడు తీరికుంటుంది అనేది. 'ఇక మీనాన్న చేత వంట చేయించమంటావా ఖర్మ' అనేది తను నవ్వుతూ

"చేయించు... వంట చెయ్యటం నామోషీ వనా" అనేది నవత.

"కాదా... అసహ్యంగా మగవాళ్ళు వంట చెయ్యటం ఏమిటి?" అంటే మండిపడేది.

"వంట చెయ్యకపోతే తిండి ఎవరో ఒకరు సిద్ధంచేసి వుంచకపోతే ఈ ప్రపంచంలో ఒక్క పనైనా సవ్యంగా జరుగుతుందా. అన్ని తిప్పలూ తిండికోసమే గదా. ఆ తిండి వండటం అంత నామోషీ ఎందుకయింది. ఆడవాళ్ళు చేస్తున్నారనా" అంటూ పోట్లాటకు దిగేది.

ఇప్పుడు నిజంగానే తను చేసిన పని పనిమనుషుల పనితో సమానమయింది. తను ఉద్యోగం చేసి డబ్బు సంపాదిస్తే అప్పుడేమయ్యేది. ఉద్యోగం చెయ్యటానికీ చెయ్యకపోవటానికీ మధ్య అంత తేడా వుందా కాదు- అది నిజం కాదు.

ఇప్పుడు ఉద్యోగం చేస్తే. ఏంచెయ్యగలదు తాను? ఏం ఉద్యోగం ఇస్తారు? తనకేమీ చేతకాదు. అసలు ఉద్యోగం ఎందుకు చెయ్యాలి. తను ఇల్లాలు. ఇల్లూ, పిల్లలే తన ఉద్యోగం. ఈ ఇల్లు మాత్రం ఒదలకూడదు. "ఇక్కడే నా ఉద్యోగం నా బతుకు- నా చావు"

మళ్ళీ మళ్ళీ అదే విషయాన్ని స్థిరంగా బుర్రలోకి ఎక్కించుకుంటోంది వసంత.

★ ★ ★

ఆరోజు వసంత ఏమైనా సరే సురేష్‌తో ఎప్పటిలా మామూలుగా ఉండాలని ప్రయత్నించింది. సురేష్ ఇంటికి రాగానే నవ్వుతూ అతనికి కావాల్సినవన్నీ చేసింది. ముఖంలో అప్రసన్నత అనేది లేకుండా అతి మామూలుగా పనులన్నీ చేసుకుపోతున్న వసంతను ఆశ్చర్యంగా చూశాడు సురేష్.

భోజనం చేస్తూ పిల్లల గురించి మాట్లాడుకున్నారు. ఎక్కువ నవత గురించే. ఒక్కతే హాస్టల్లో ఎన్ని అవస్థలు పడుతుందోనని.

భోజనం అవగానే పుస్తకం తీసుకుని టేబుల్ దగ్గరకు వెళ్లాడు సురేష్.

వసంతకు ఎక్కడలేని ఉక్రోషం వచ్చింది. నిగ్రహించుకోలేకపోయింది.

"నీలిమ దగ్గరైతే అలా పుస్తకం పట్టుకుని కూచుంటారా?" తీవ్రంగా అడిగిన వసంతను విస్తుపోయి చూశాడు.

"అర్థంలేకుండా మాట్లాడతావెందుకు? ఇది చాలా అర్జంటుగా చూడాలి. రేపు ఉదయం ఒక కేసుంది"

సురేష్ పుస్తకంలోంచి తలతిప్పలేదు.

"ఒట్టిది... అంతా అబద్ధం. ఆ కేసు అర్జంటేం కాదు. పదిరోజులు శలవుపెట్టి నిశ్చింతగా తిరిగిన మనిషికి అర్జంటు కేసులంటే నమ్మే విషయమేనా. నాతో మాట్లాడటం ఇష్టంలేదు. నా పక్కన పడుకోవటం ఇష్టంలేదు. నన్ను దగ్గరకు తీసుకోవటం ఇష్టంలేదు. ఇవన్నీ తప్పించుకోవటానికి ఈ కేసు నాటకం"

వసంతకు పట్టలేని దుఃఖం వచ్చింది.

"ఎందుకేడుస్తున్నావ్?" కోపంగా అడిగాడు సురేష్.

"ఎందుకా... నేనంటే మీకంత అసహ్యమైనందుకు. నేను చచ్చిపోకుండా బతికున్నందుకు. చెప్పండి. ఇవాళ ఏదో ఒకటి తేల్చుకోండి. నేను కావాలో అది కావాలో ఖచ్చితంగా చెప్పండి- ఇక నేనీ నరకం భరించలేను"

"వసంతా ప్లీజ్... నీలిమతో సంబంధం తెంచుకోవటం నావల్లకాదు. నువ్వంటే నాకు అసహ్యంలేదు. కానీ నీలిమంటే ఇష్టం-ప్రేమ"

"నేనంటే అసహ్యం లేదు. కానీ ఇష్టం కూడా లేదుగా అది ఒప్పుకోండి. అదంటేనే మీకు ప్రేమ. దాని దగ్గరకే వెళ్లండి. దానింట్లోనే ఉండండి- పొండి" పిచ్చిగా అరుస్తోంది వసంత.

"వసంతా... ఊరుకో" సురేష్ లేచి వచ్చి వసంత చేయి పట్టుకున్నాడు.

వసంత విదిలించి కొట్టింది.

"ఛీ... నన్ను ముట్టుకోకండి. ఆ తిరుగుబోతుముండని ముట్టుకుని నా దగ్గరకు రాకండి. అదొక సిగ్గులేనిది. పెళ్ళయిన వాడికి ఉంపుడుగత్తెగా ఉండటానికి సిద్ధపడి ఎంగిలి కూటికి ఆశపడింది. ఆ దొంగముండతో సంబంధం తెంచుకుంటేనే నేనీ ఇంట్లో ఉండేది. లేకపోతే చచ్చిపోతాను. ఎక్కడికన్నా వెళ్ళిపోతాను"

పిచ్చెక్కినట్లు ఏడుస్తూ బయటికి పోవటానికి పెనుగులాడుతోంది. సురేష్ ఆమెను బలవంతంగా మంచంమీదకు తోశాడు. వసంత నీలిమను ఇష్టమొచ్చినట్లు తిడుతోంది. సురేష్ ఆమె చెంపల మీద కొట్టి బలవంతాన నోరు మూయించాడు. ఆమెనెట్లా సముదాయించాలో తెలియక నిస్సహాయంగా నిలబడిపోయాడు.

★ ★ ★

మర్నాడు సాయంత్రంవరకూ అలాగే పడుకుని వుంది వసంత. వచ్చి మంచినీళ్ళు కూడా ముట్టుకోలేదు. సాయంత్రం అన్నయ్యా, వదినా రావటం చూసినా ఆమెకు లేవాలనిపించలేదు. లక్ష్మి బలవంతాన లేపి ముఖం కడిగించింది. కాఫీ తాగించింది. తల దువ్వుతూ నెమ్మదిగా హితోపదేశం చేసింది.

"ఇంత పిచ్చిదానివేం వసంతా. పొద్దున్న సురేష్ వచ్చి అంతా చెప్పాడు. నువ్విలాగే గొడవ చేస్తుంటే విడాకులు తప్ప మరోమార్గం లేదన్నాడు. ఎందుకు చేజేతులా కాపురం పాడుచేసుకుంటావు. గోటితో పోయేదానికి గొడ్డలెందుకు. నాలుగు రోజులు కళ్ళు మూసుకో. చిన్నదానికింకా పెళ్ళికావాలా- అతనంత అతను చెబితే తెలిసిందిగానీ లేకపోతే ఎలా తెలిసేది? అతను తప్పు చేశాడు. నిజమే. ఆ తప్పుదిద్దుకోటానికి టైము ఇవ్వాలా వద్దా. ఆస్తిపాస్తులు దానికి తగలేస్తానంటే బాధపడొచ్చు. అది లేదుగా- నీకేంటి- అన్నిముచ్చట్లూ తీరాయి. రెండోపిల్ల పెళ్ళయితే ఇక నీకు దిగుల్లేదు. ఇక ఇప్పుడు బతుకంతా రచ్చకీడ్చుకుంటావా. మీ అన్నయ్య సంగతి కళ్లారా చూశావు గదా. పట్టుమని పది నెలలు గడవకుండానే దానిదారిన అదిపోయింది. ఈయనకి బుద్ధొచ్చింది. నా విలువ తెలిసొచ్చింది. నువ్వు పోట్లాడనూ వద్దు. అన్నం, నీళ్ళూ మానేసి కుంగిపోనూ ఒద్దు. నీకేం ఖర్మ. సురేష్ భార్యవి. ఇద్దరు పిల్లల తల్లివి. తలెత్తుకుని గర్వంగా తిరుగు. మీ ఆవిడేది? ఈ మనిషెవరూ అని నలుగురూ అడిగితే అతగాడు కుంగిపోవాలి. నీకేం ఖర్మ. పెళ్ళిపెటాకులూ లేకుండా ఊరిమీద పడ్డ అది దించుకోవాలి తల. నువ్వు దర్జాగా ఉండు" గంటకుపైగా వసంత చెవిలో ఇల్లు కట్టుకుని హితబోధ చేసింది లక్ష్మి.

తనే అందరికీ వంట చేసింది. వసంతకు పెట్టి, వాళ్ళూ తిని వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిన కాస్సేపటికి సురేష్ వచ్చాడు. వసంత ముఖం పక్కకు తిప్పుకుని- "టేబుల్ మీద అన్నీ ఉన్నాయి. పెట్టుకు తినండి" అని వెళ్ళి పడుకుంది.

రోజులు భారంగా గడుస్తున్నాయి. వసంత రోజురోజుకీ కృశించిపోతోంది. సురేష్- నీలిమల సంబంధం తన కళ్ళముందే గట్టిపడుతుంటే చూస్తూ కూచోటం ఆమెకు నరకయాతనగా ఉంది. సురేష్ మళ్ళీ తనకు దగ్గరవుతాడు అనేది ఆమెకు అడియాసలా కనిపిస్తోంది.

నెల రోజులపాటు లక్ష్మి సలహా ప్రకారం తనకేమీ పట్టనట్లు ఉండేసరికి వసంతకు పిచ్చెక్కినట్లయింది. సురేష్ తన పనేదో తను చూసుకుంటున్నాడు. వసంతతో ఎక్కువమాట్లాడడు. ఉదయాన్నే వెళ్ళి రాత్రి పదిగంటల తర్వాత ఒస్తున్నాడు. వసంతకు అతనితో మాట్లాడాలని వుంటుంది. మాట్లాడాలనిపించదు. అతనితో ప్రత్యక్షంగా మాట్లాడటం కంటే మనసులో అతన్ని రకరకాల ప్రశ్నలేసి అతను బదులు చెప్పలేక తలవొంచుకునే దృశ్యాన్ని



ఊహించుకోవటం బాగుందామెకు. కొన్ని రోజులకు అది కూడా విసుగెత్తింది. ఆరోజు సాయంత్రం ఇంటి ముందున్న మొక్కల దగ్గర నుంచుంది వసంత.

గులాబీ మొక్క విచ్చుకోబోతున్న మొగ్గలతో కళకళలాడుతోంది. ఆ మొక్కను అలాగే చూడబుద్ధయింది. ఈ పూలన్నీ పూస్తాయి. కోస్తాం. మళ్ళీ పూస్తాయి. మళ్ళీ కోస్తాం. కొన్నాళ్ళకు మొక్క చచ్చిపోతుంది. మొక్క ఎందుకు పుట్టినట్టు. కొన్నాళ్ళు పూలుపూసి చచ్చిపోటానికేనా. ఈ మొక్క మూలాన ఎందరికో ఆనందం. బతికినన్నాళ్ళూ ఆనందానిచ్చి చచ్చిపోతుంది తను?- పుట్టినపుడు తలిదండ్రులు సంతోషించారేమో. తరువాత తరువాత తను వాళ్ళకు బరువయింది. సురేష్ కనపడే వరకూ వాళ్ళ కళ్ళల్లో ఏదో దిగులు తన గురించే వాళ్ళకు ఎప్పుడూ చింత. సురేష్‌కి పిల్లలకీ తనంటే ఇష్టమేనా? ఎలాంటి ఇష్టం?తను సురేష్‌కి అనుకూలంగా నడుచుకుంది. అతనూ మంచిగా ఉన్నాడు. పిల్లల్ని ప్రేమగా పెంచాను. వాళ్ళూ ప్రేమగా ఉన్నారు. అంతా సజావుగా సాగుతున్నట్టు కనపడింది. జీవితం తనకు అర్థమైనట్లే కనిపించింది. ఇప్పుడు సురేష్ చేసిన పనితో తన జీవితమంతా నిరర్థకమైపోయింది. ఎందుకు? ఎందుకలా కావాలి? సురేష్ పిల్లలూ లేకపోతే తనకిక ప్రపంచమంతా లేనట్లేనా?

ప్రపంచమంటే తనకు ఏమిటి. తనూ తన చుట్టూ వుండేవాళ్ళు. ఇంతకు మించిన ప్రపంచం ఏముంటుంది? వాళ్ళంతా తనను చూసి జాలిపడతారు. ఏం లోపముందీ వదిలేశాడోలే అంటారు. నవ్వుకుంటారు. ఇలాగే ఏడుస్తూ కూచుంటే విసుక్కుంటారు. చిరాకుపడతారు. ఏమీ పట్టించుకోకపోతే మొగుడెట్లా తిరిగినా పట్టించుకోదు అనుకుంటారు. అంత లెక్కలేదు గాబట్టే మొగుడట్లా తయారయ్యాడు అంటారు. తను ఎట్లా వుండాలి? ఏం చెయ్యాలి? ఎలా చేస్తే ఒప్పు? ఏం చేస్తే తప్పు? తప్పు ఒప్పులకు అతీతంకానిదేదీ ఉండదా? వసంత ఆలోచనలలో పడి గేటు తీసుకుని లోపలకు వస్తున్న రోహిణిని గమనించనే లేదు.

"వసంతా" అని పిల్చిన రోహిణిని నమ్మలేనట్లు చూసింది వసంత.

"ఎప్పుడొచ్చావు?"

"పొద్దున్నఇక్కడ సర్జన్స్ కాన్ఫరెన్స్ జరుగుతోంది దానికి వచ్చాను. రెండు రోజులుంటాను. ఏంటి ఇంట్లో లైట్లన్నా వెయ్యకుండా బయట చీకట్లో కూచున్నావు" అంటూ రోహిణి నవ్వుతూ మాట్లాడుతుంటే వసంతకు బలమైన ఆధారం ఏదో దొరికినట్లనిపించింది.

"రోహిణీ-రా" అంటూ లోపలకు తీసికెళ్ళింది. గబాగబా మంచినీళ్ళు తెచ్చి ఇచ్చింది.

"సురేష్ లేరా" అని అడిగిన రోహిణి ప్రశ్నకు వసంత ముఖం చిన్నబోయింది.

"వస్తారు. ఆలస్యమవుతుంది" గొణిగింది.

"ఏంటి-బాగా చిక్కిపోయావు. పిల్లల మీద దిగులు పెట్టుకున్నావా"

రోహిణి ప్రశ్నకు కళ్ళు కిందకు దించటం తప్ప సమాధానం చెప్పలేదు.

రోహిణి కొంతసేపు తన ధోరణిలో తను పిల్లల గురించీ తన ప్రాక్టీసు గురించీ కాన్ఫరెన్సు గురించీ మాట్లాడి వసంత బొత్తిగా ఆసక్తి చూపించటం లేదని గ్రహించి మాట్లాడటం ఆపేసింది. వసంత రోహిణికి విషయం ఎలా చెప్పాలీ, చెబితే రోహిణి ఎలా తీసుకుంటుందీ ఏమంటుందీ అన్న ఆలోచనల్లో మునిగిపోయింది.

చివరకు రెండు నిముషాలు మౌనంగా ఉన్న రోహిణి ఇక భరించలేక "వసంతా.. ఏమైంది నీకు" అని రెట్టించి ప్రశ్నిస్తే తప్ప వసంత ఈ లోకంలోకి రాలేదు.

"నాకేం చెయ్యాలో తోచటం లేదే. సురేష్ నీలిమ అనే ఆవిడను ప్రేమిస్తున్నానని ఆవిడతో ఉంటున్నాడు".

అనేసరికి వసంత గొంతు పూడుకుపోయింది.

రోహిణి కంగారు పడి

"ఏంటి-అసలేం జరిగింది. ఎప్పుడు" అంటూ వసంత దగ్గర కొచ్చేసింది.

కంగారు పడుతున్న స్నేహితురాలిని చూసి వసంత మరి నిగ్రహించుకోలేక పోయింది. ఏడుస్తూ, రోహిణి ఓదార్పులకు శాంతించి మొత్తం విషయమంతా వివరించింది వసంత.




## ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
## 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

# జండూ పంచారిష్ట

### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి
### మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.

క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!




# జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*



450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది

CLARION/B/ZP/20 173 TEL

రాత్రి వాళ్ళ మాటల్లో గడిచిపోతోంది.

"ఇలా నాకే ఎందుకు జరగాలి-నాకే ఎందుకు జరగాలి. నేనేం పాపం చేశాను" అంటున్న వసంతను ఆర్ద్రంగా చూసింది రోహిణి.

"దీన్నుంచి ఎలా బైటపడాలో ఆలోచించాలి గానీ అట్లా ఏడుస్తూ కూచుంటే ఎలా"

"నాకేం అర్థం కావటం లేదే. ఇదంతా ఎందుకు మొదలయిందో, ఎలా ముగుస్తుందో నాబతుకేమవుతుందో ఏమీ అర్థం కావటం లేదు. అసలెందుకిలా జరిగింది. నేను ఏం చేశానని ఇలా జరగాలి. నా లోపం ఏంటి?"

"నువ్వేం చెయ్యలేదు వసంతా. కానీ ఒక్క విషయం అర్థం చేసుకోవాలి. ఈ రోజుల్లో వివాహాలు నిలబడటం లేదు. ఇందులో ఎవరిది తప్పు అనేది అలా వుంచి అసలు వివాహ సంబంధాన్ని గురించి మన ఆలోచన మార్చుకుంటే మంచిదేమో అనిపిస్తోంది- దానికంత విలువ ఇవ్వకపోతే మనకింత బాధ వుండదేమో" అంది రోహిణి ఆలోచనగా.

"వివాహానికీ, కుటుంబానికీ విలువ ఇవ్వకపోతే ఇంక దేనికి విలువఇవ్వాలి. ఇలా చెయ్యటం సురేష్ తప్పుకాదా?"

రోహిణి సురేష్‌దే తప్పంతా అంటూ అతన్ని తిట్టకపోవటం వసంతను బాగా బాధించింది.

"సురేష్‌ది తప్పు అని అన్నంత మాత్రాన మనకు ఒచ్చేదేమిటి? అతని పరిస్థితి అతను సమర్థించుకుంటాడు. మొన్నటివరకూ సురేష్ మంచివాడే. ఎలాంటి పరిస్థితుల్లో వచ్చిందో ఇంకో స్త్రీ అతని జీవితంలోకి వచ్చింది. వెంటనే అతను చెడ్డవాడయిపోతాడా. అతను చెడ్డవాడనుకుందాం. అతన్ని గురించి నీకెందుకింత బాధ. అతని చెడ్డతనానికి తగిన ఫలితం అతనే అనుభవిస్తాడు. నిన్ను దూరం చేసుకోవటమే ఆ ఫలితం కావచ్చు. అదంతా తర్వాత సంగతి. ముందు ఇప్పటి పరిస్థితి నుంచి ఎలా బైటపడాలి, పరిస్థితిని ఎలా మెరుగుపరుచుకోవాలి అని ఆలోచించటం మంచిది- సురేష్‌తో నేను మాట్లాడనా?"

"ఏంమాట్లాడతావు?"

"అతనేమనుకుంటున్నాడో అడుగుతాను"

"అతన్నడిగితే నాకు విడాకులు ఇస్తానంటాడు. ఆస్తంతా నాకిస్తానంటాడు. నాకు విడాకులు ఒద్దు. ఆస్తి ఒద్దు. సురేష్ కావాలి"

"సురేష్‌మీద నీకింకా ప్రేమ ఉందా? అతను ఇంకొకర్ని ప్రేమిస్తున్నా" రోహిణి మాట పూర్తికాలేదు వసంత మధ్యలోనే ఆపేసింది.

"ప్రేమ... ప్రేమ అని పిచ్చిమాటలు మాట్లాడకు. నేను సురేష్‌ని ప్రేమించి పెళ్ళాడలేదు. అతను నా ఫొటో చూసి నన్ను కాలేజీలో చూసి ఇష్టపడి పెళ్ళి చేసుకున్నాడు. నేను అతని ఫొటో ఎప్పుడు చూశానో తెలుసా? ముహూర్తాలు పెట్టుకున్నాక. అతన్ని పెళ్ళిపీటల మీదే చూశాను. అతను నాభర్త. నేనతని భార్యను. నామెళ్ళో తాళి కట్టాడు. నామీద సర్వహక్కులూ అతనివి. అతనిమీద సర్వహక్కులు నావి. నేనేమన్నా తప్పుచేస్తే అతనికి అనుకూలంగా లేకపోతే, ఏ రోగంతోనో తీసుకుంటూ ఉంటే అతను నన్ను ఒదిలేశాడంటే అర్థముంది. నాకేం తక్కువయిందని, నేనేం లోపం చేశానని ఇంకొకర్ని ఆశ్రయించాలి. ఎందుకు విడాకులివ్వాలి స్తానవాలి. అతన్ని ఇదేమటని అడిగి మంచిదారిలో పెట్టేవాళ్ళే లేరా?"

ఆవేశంతో వసంత ముఖమంతా చెమటలు పట్టాయి. రోహిణి వసంత చేతిని తన చేతిలోకి తీసుకుంది.

"ఆవేశం మాని ఆలోచించు. ఇది తగిన పనికాదు అని సురేష్‌కి చెప్పటం సమస్యకాదు. మన మాటలు అతను లక్ష్యపెడతాడా- ఒకవేళ బలవంతంగా అతన్ని ఆపినా అతనికి నీమీద ప్రేమ- "

"మళ్ళీ ప్రేమ అంటావేం. నాకు ఆ ప్రేమ ఒద్దు. నాకు భర్త కావాలి. ఇంట్లో అడుగడుక్కీ నామీద ఆధారపడే భర్త, నన్ను రక్షించే భర్త, నన్ను పోషించే భర్త, నేను సేవలు చేసే భర్త, సాయంత్రానికల్లా ఇంటికొచ్చే భర్త, నాకోసం పిల్లల కోసం మాత్రమే బతికే భర్త- ఆ భర్త కావాలి నాకు. ప్రేమంటే నాకు తెలియదు. నేను ప్రేమించి పెళ్ళిచేసుకోలేదు. ప్రేమ కోసం పెళ్ళిచేసుకోలేదు. మొగుడి కోసం అతనికి కనబోయే పిల్లలకోసం పెళ్ళిచేసుకున్నాను. నాకు మొగుడు కావాలి. పిల్లలు కావాలి. నా





కుటుంబం కావాలి. సురేష్‌కి నేనక్కరలేదు. లావణ్యకు ఆస్తి తప్ప నేనక్కరలేదు. నవత అసలు పట్టించుకోదు. ఇప్పుడు నేనేం చెయ్యాలి? నాకెందుకీ పరిస్థితి?''

వసంతనెలా కంట్రోలు చెయ్యాలో రోహిణికి అర్థంకాలేదు.

''వసంతా... ఊరుకో'' అనటం తప్ప మరేం మాట్లాడలేకపోయింది. ఆ రాత్రి సురేష్ ఇంటికి రాకపోవటంతో రోహిణికి పరిస్థితి కాస్త తీవ్రంగానే ఉందనిపించింది.

ఉదయాన్నే లేచి వసంతతో కలిసి కాఫీ, టిఫిన్లు పని చూసి, వసంతతో కలిసి టిఫిన్ తిని తను కాన్ఫరెన్సుకు బయలుదేరింది రోహిణి.

''నేను సాయంత్రం తొందరగా వచ్చేస్తాను. నేను వచ్చేసరికి నువ్వు సిద్ధంగా ఉండు. కాసేపు బైట తిరుగుదాం'' అని చెప్పి వెళ్ళింది రోహిణి.



సర్జెన్స్ కాన్ఫరెన్సులో ఉదయపు సమావేశం పూర్తయి లంచ్‌కి డైనింగ్‌హాల్లోకి అందరితోపాటు వచ్చినపుడు ఎవరో ''నీలిమా'' అని పిలవటం వినపడ ఆవైపు చూసింది రోహిణి.

''నీలిమా'' అని మరోసారి గట్టిగా పిలిచారెవరో. ''ఎవరూ- ఓ- నువ్వా'' అంటూ నీలిమా ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళింది.

''ఈవిడతో మాట్లాడితే' అనే ఆలోచన వచ్చింది రోహిణికి.

'ఏం మాట్లాడాలి. మీరు సురేష్‌ని ఒదిలెయ్యండి. వసంత చాలా బాధపడుతోంది'' అని చెప్పాలా?

ఆవిడేమంటుంది? 'మీకనవసరం' అంటే- 'సురేష్ నన్నొదలటంలేదు. మీరు అతన్ని నా నుంచి దూరం చెయ్యగలిగితే చెయ్యండి. నాకు అభ్యంతరంలేదు' అంటే ఏంచెయ్యాలి? నీలిమ నుంచి సురేష్‌ని లాక్కొచ్చి వసంత కాపురం నిలబెట్టగలుగుతుందా? అలా బలవంతాన నిలబెట్టిన కాపురానికి అర్థముంటుందా?

సురేష్ వసంతకు ఎందుకు దూరమయ్యాడు?

నీలిమకు ఎందుకు దగ్గరయ్యాడు.

ఇంత పెద్ద రిస్క్ ఎందుకు కొనితెచ్చుకున్నాడు? ఇవన్నీ తెలకుండా సినిమాలోలాగా నీలిమను త్యాగం చెయ్యమనటంలో అర్థం ఏముంటుంది?

''మాట్లాడితే సురేష్‌తో మాట్లాడాలి. అప్పుడు సమస్య అర్థమయ్యే అవకాశం ఉండొచ్చు.'' ఈ ఆలోచనలతో రోహిణి నీలిమను దూరం నుంచి గమనించటం తప్ప దగ్గరకువెళ్ళి పలకరించే ప్రయత్నం చెయ్యలేదు. అయితే సాయంత్రం నీలిమకోసం వచ్చిన సురేష్ స్కూటర్ తమముందే ఆపటంతో రోహిణికి సురేష్‌ని పలకరించక తప్పలేదు.

సురేష్ రోహిణిని పలకరిస్తుండగానే నీలిమ అక్కడికి వచ్చింది.

''ఈమె డాక్టర్ నీలిమ. ఈవిడ రోహిణి. వసంత స్నేహితురాలు. గుంటూర్లో ప్రాక్టీస్ చేస్తున్నారు'' అని ఇద్దరికీ పరిచయాలు చేశాడు.

నీలిమ స్నేహంగా నవ్వి ''రండి కాఫీ తాగుదాం'' అంటూ కాంటిన్‌కేసి నడిచింది.

సురేష్, రోహిణీ ఆమె వెనకాలే నడుస్తున్నారు.

''ఇంటికి వెళ్ళారా'' అనడిగాడు సురేష్.

''రాత్రి అక్కడే ఉన్నాను'' అంది రోహిణి.

''రాత్రి సురేష్ నా దగ్గర ఉండిపోయాడు'' అంది నీలిమ కలగజేసుకుని.

రోహిణికి చాలా ఇబ్బందిగా అనిపించింది. ముగ్గురూ కూచున్నారు. కాఫీలు వచ్చాయి-తాగారు.

నీలిమ రోహిణీ హాస్పిటల్ గురించీ ప్రాక్టీసు

గురించీ ప్రశ్నలడిగితే రోహిణి ఏదో ఒకటి చెప్పాలన్నట్లు చెబుతోంది.

హఠాత్తుగా రోహిణి అంది- "నేనూ, వసంతా చాలా మంచి స్నేహితులం. తను బి.ఎ పాసై పెళ్ళిచేసుకుని వెళ్ళేదాకా ప్రతిరోజూ ఒక్కసారన్నా చూసుకోకపోతే మాకు తోచేదికాదు. పెళ్ళయ్యాక వసంత మమ్మల్నందర్నీ మర్చిపోయి సంసారంలో పడిపోయింది" తనెందుకిలా మాట్లాడుతోంది అనే అనుమానం రావటంతో హఠాత్తుగా ఆగిపోయింది రోహిణి.

"మీరు నాతో మాట్లాడాలనుకుంటున్నారా? మా ఇంటికి వెళదామా" నీలిమ చిరునవ్వు చెదరకుండానే అడిగింది.

"ఒద్దు... మీతో ప్రత్యేకంగా మాట్లాడాల్సిందేంలేదు. మాట్లాడి చెయ్యగలిగినదేదయినా వుంటే మాట్లాడకుండానే మీరిద్దరూ చెయ్యగలరనే నమ్మకం నాకుంది. వసంతకు వీలైనంత తక్కువ బాధ కలిగించుమని తప్ప నేనేం చెప్పగలను" అంది రోహిణి.

ముగ్గురూ ఎవరి ఆలోచనలతో వాళ్ళు చాలా సేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు.

రోహిణే ముందు లేచింది "నేను వెళ్తాను" అంటూ ఆమె వెనకే నడిచారు సురేష్, నీలిమలు.

★ ★ ★

"వసంతా నువ్వు కొన్నిరోజులు గుంటూరు రాకూడదూ?" భోజనం చేస్తూ అడిగింది రోహిణి.

"ఇప్పుడా... ఈ పరిస్థితుల్లో సురేష్‌ని ఒదిలిపెట్టా"

"వసంతా సురేష్ నీలిమతో వుంటుంటే నువ్వు బాధపడకుండా ఉండగలవా?"

వసంత ఏంమాట్లాడలేదు.

"'సురేష్ నీలిమతో ఉన్నా నాకు అభ్యంతరంలేదు' అని నువ్వు గట్టిగా అనుకుంటే దానికి సిద్ధపడాలి. అలా కాకుండా సురేష్ నీలిమతో సంబంధం పెట్టుకుంటే నీకు చాలా అభ్యంతరం అయితే సురేష్‌తో ఆ విషయం తేల్చుకోవాలి. ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలి. ఇలా ఏడుస్తూ తిండీతిప్పలు మానేసి చిత్రహింసలు పడుతూ ఎక్కువ రోజులు గడపటం మంచిదికాదు. నువ్విలా శిథిలమైపోతూవుంటే నేను చూస్తూ ఊరుకోలేను. అసలు ఏ నిర్ణయం తీసుకోటానికైనా మానసికంగా కొంత ప్రశాంతత అవసరం. ఇలా ప్రతిరోజూ సురేష్ కోసం ఎదురుచూస్తూ ఏడుస్తూ అతనిమీద పోట్లాడుతూ- ఇది నీ మనశ్శరీరాలకు ఏవిధంగానూ మంచిదికాదు. కొన్నాళ్ళు గుంటూరుకు వచ్చి వుండు. కాస్త ధైర్యం తెచ్చుకో. ఏదో ఒక నిర్ణయం తీసుకో"

రోహిణి అనునయంగా చెబుతుంటే వసంత నిరామయమైన మనస్సుతో వింటోంది.

"ఏదో ఒక నిర్ణయం తీసుకోవాలా. నీలిమతో కలిసి ఉండటమో సురేష్‌మీద ఆశ ఒదులుకోవటమో ఏదో ఒకటి తేల్చుకోవాలా? ఎందుకు? ఎందుకు? ఎందుకు? ఆ నీలిమెవరు. తనకీ పరిస్థితేమిటి వీళ్ళంతా ఎందుకిలా మాట్లాడుతున్నారు?"

"నీలిమెవరు? దాని మూలంగా నా జీవితం ఎందుకు మారాలి" పెద్దగా అరిచింది వసంత.

"నీలిమ ఎవరు అన్నది తీసెయ్యి. ఒక మనిషికి ఇంకొక మనిషితో వున్న సంబంధం ఆ మనిషి ఇష్టం. ఆ సంబంధాన్ని ఎలా కావాలంటే అలా వుంచుకునే అవకాశం ఆ మనిషికుంటుంది గదా-

"నువ్వు నా స్నేహాన్ని మానెయ్యదల్చుకున్నావనుకో, అది నీ ఇష్టం. నేనెంత బతిమాలీ నీ మనసు మార్చలేను. అప్పుడు నేనేం చేస్తాను. నీ స్నేహం లేకుండా బతకటం నేర్చుకుంటాను. నా ఆత్మగౌరవం కాపాడుకుంటాను. నీ స్నేహం లేనిదే బతకలేనని చచ్చిపోను గదా-"

"రోహిణీ - నువ్వు చెప్పేదానికేమైనా అర్థం వుందా? స్నేహమూ, భార్యాభర్తల సంబంధమూ ఒకటేనా? స్నేహం పోవటమూ, వివాహబంధం పోవటమూ ఒకటేనా?"

"అది నువ్విచ్చే విలువను బట్టి వుంటుంది వసంతా. నేనైతే రెండింటికీ ఒకే రకమైన విలువ ఇస్తాను. పెద్దల ఇష్టాలతో బేరసారాలతో ముడిపడిన పెళ్ళిళ్ళ కంటే నిజంగా అభిరుచులు, అనకులూ కలిసి క్రమంగా పెరిగిన

 

# మీరు నమ్మే ఫారెక్స్ ఇప్పుడు రుచిలో సర్వోత్తమం!

నాలుగు నెలలు నిండిన తర్వాత, మీ పాపాయికి
క్రొత్త రుచికరమైన ఫారెక్స్‌ను పరిచయం చేయండి.
ఒక చిన్న చెంచాడు ఫారెక్స్‌ను 3-4 చిన్న చెంచాల
వెచ్చటి నీటితో కలిపి ఇవ్వడం ప్రారంభించండి.
ఫారెక్స్ మరింత రుచికరమైనది.
మునుపటికంటే మరింత ఎక్కువ పుష్టికరమైనది.




- ఎక్కువ రుచికరం
- ఎక్కువ పుష్టికరం

**ఫారెక్స్®-పెరుగుదల కోసం రుచికరమైన విధానం.**

Gx/65/172 Tel.

స్నేహమే ఎక్కువ విలువైందని అనిపిస్తుంది నాకు. ఆ స్నేహం పోతేనే ఎక్కువ బాధగా ఉంటుందేమో. నువ్వు మొదటినుంచీ పెళ్ళికి ఎక్కువ విలువ యిచ్చావు. అది వుంటే ఇక మిగిలినవి అక్కర్లేదనుకున్నావు. ఇప్పుడది నిలబడదని తెలిసి విలవిలలాడుతున్నావు'' రోహిణి పాలిపోతున్న వసంత ముఖం చూసి ఆగింది.

''నాకు సురేష్ మీద ఏ హక్కూ లేదా?'' తననుతనే నమ్ముకోలేకపోతున్న భావం వసంత గొంతులో కదిలింది.

''ఎందుకు లేదు, ఉంది. అతని మీద దావా వేసి అతన్ని నీతో కాపురం చేయించ మని కోర్టువారికి విన్నవించుకుని వాళ్ళు చెబితే గత్యంతరం లేక వచ్చిన సురేష్‌ని నా భర్త అని చెప్పుకునే హక్కు వుంది. అతన్నుంచి భరణం పొందే హక్కు ఉంది. కానీ నా దృష్టిలో ఇవేవీ నువ్వు చెయ్యదగ్గ పనులుకావు. అతని మనసులో నీ మీద ప్రేమ ఉందా లేదా అనేదే ముఖ్యం. అతనికి నీమీద ప్రేమ లేనప్పుడు అతని మీద ఉన్న హక్కులతో నువ్వు ఏంచెయ్యగలవు? అసలైనది పొందలేవుగా?''

వసంత మాట్లాడకుండా కూచుంది. మనసంతా మొద్దుబారిపోయింది. ప్రేమ - ప్రేమ - ప్రేమ - . ఈ ప్రేమను చంపి పారెయ్యాలన్నంత కోపం వచ్చింది వసంతకు.

★ ★ ★

''రేపాదివారం- ఎటన్నావెళదాం. ఇంట్లో ఒక్కత్తినీ వుండి విసుగెత్తిపోతోంది'' సాయంత్రం టీ తాగుతూ వసంత అన్న మాటలకు విస్మయంగా చూశాడు సురేష్. ఇద్దరిమధ్యా మాటలే కరువైన రోజుల్లో వసంత మాటలతన్ని ఇబ్బంది పెట్టాయి.

''ఎక్కడికి వెళతాం'' గొణిగాడు.

''ఎక్కడికన్నా వెళ్ళొచ్చు. శనివారం సాయంత్రం సాగర్ వెళితే సోమవారం పొద్దున్నే తిరిగి రావచ్చు''

సురేష్ ఏంమాట్లాడాలో తెలియక ఊరుకున్నాడు.

''నాకు సాగర్ వెళ్ళాలని ఉంది. తీసుకెళ్తారా? లేదా?'' కాస్త కరుగ్గా అడిగింది వసంత.

ఎలాగైనాసరే తనకాపురాన్ని చక్కదిద్దుకోవాలనే తపన వసంతది.

''నాకు వెళ్ళాలని లేదు. నువ్వు వెళ్ళాలనుకుంటే తోడుగా రమ్మంటే వస్తాను'' నిర్లిప్తంగా చెప్పాడు.

వసంతకు పట్టలేని కోపం వచ్చింది.

'అదే ఆ నీలిమ అడిగితే సంతోషంతో తలమునకలవుతూ వెళ్ళేవాడు. తనెందుకంత వెగటయింది. ఇదంతా కొత్త మోజేనా? తన నిర్లక్ష్యఫలితమేనా? పిల్లల ధ్యాసలో, ఇంటి ధ్యాసలో పడి అతన్ని పట్టించుకోలేదా? అతన్ని సంతోషపెట్టలేదా?

ఇప్పుడు తను మారితే - అతన్ని సంతోషపెడితే అతనిలో మార్పువస్తుందా? ఆ మోజు పోతుందా?' రకరకాల ఆలోచనలతో కిక్కిరిసిన తలను రెండుచేతులతో గట్టిగా అదుముతూ -

''నాకు వెళ్ళాలని ఉంది. మీరూ రావాలి- వచ్చి తీరాలి'' పంతంగా పలికింది.

''అలాగే వెళ్దాం'' అన్నాడు సురేష్.

టీ తాగి బైటికి వెళ్ళాడు.

వసంతకు సంభ్రమంగా ఉంది.

సురేష్‌తో కలసి నాగార్జునసాగర్ వెళ్తుంది. ఇరవైయేళ్ళక్రితం కాపురానికొచ్చిన కొత్తలో ఇద్దరూ సాగర్ వెళ్ళారు. నాలుగురోజులు సరదాగా గడిపివచ్చారు. నాలుగైదేళ్ళ క్రితం వరకూ సురేష్ నాగార్జున్‌సాగర్‌ను జ్ఞాపకం చేస్తూనే ఉండేవాడు. వెళ్దామా అనేవాడు. మళ్ళీ ఎప్పుడూ కుదరనే లేదు.

''ఇప్పుడు మళ్ళీ తన కాపురం నాగార్జునసాగర్‌లో కుదుటపడితే'' వసంతకు కొత్త శక్తి వచ్చినట్లయింది. చురుగ్గా ఇంట్లోపనులన్నీ చక్కదిద్దుకుంది. ఈమధ్య పట్టించుకోకుండా ఉంచిన సురేష్ వస్తువులన్నీ దులిపి జాగ్రత్తగా సర్దింది. అతని చొక్కాలు ఇస్త్రీ చేసింది. ఊడిపోయిన గుండీలు కుట్టింది. మాసిన కర్చీఫ్‌లు ఎక్కడెక్కడో పడివుంటే అన్నిటికీ సబ్బు పట్టించింది.

సాయంత్రం కొబ్బరికాయ, పళ్ళూ పట్టుకుని ఇంటి దగ్గర్లో ఉన్న రాములవారి గుడికి వెళ్ళింది.

''శ్రీరామచంద్రా - నా భర్తను నాకు





దక్కించు స్వామి. నన్ను ఆయన దూరం చేస్తున్నాడు" అని మొక్కుతుంటే ఈ దేవుడు భార్యను ఒదిలెయ్యలేదూ అని ఎవరో చెవిలో పలికినట్లయింది.

"ఛీఛీ- అన్నీ పాడు ఆలోచనలూ, పాడుమనసు. రాముడు ఏకపత్నీవ్రతుడు. ప్రజల కోసం అలాచేశాడుగానీ సీతంటే ఎంత ప్రేమ. ఇంకెవర్తికోసమో సీతనడవులకు పంపాడా? ఈ దరిద్రపు ఆలోచల వల్లే ఇలాంటివి జరుగుతున్నాయి" అనుకుంటూ చెంపలు వేసుకుంది. ఆ రెండురోజుల్లో బిర్లా మందిర్‌కూ, శివాలయానికీ, శ్రీకృష్ణమందిరానికీ తిరిగిన వసంతకు హఠాత్తుగా దేవుళ్ళందరికీ ఇద్దరూ అంతకంటే ఎక్కువమంది భార్యలున్నారని తట్టింది.

"ఛీ- ఈ దేవుళ్ళకేం పొయ్యేకాలం వచ్చింది" అనుకుంది కోపంగా. మనసు మరింత అశాంతిగా మారటం తప్ప ప్రయోజనం లేకపోయింది.

శనివారం సాయంత్రం బయల్దేరుతామనుకుంటుండగా మద్రాసు నుంచి సురేష్ స్నేహితుడొచ్చాడు. అతన్ని సాగనంపేసరికి రాత్రి పదకొండయింది.

"తెల్లవారుఝామునే వెళదాం" అన్నాడు సురేష్ ఆవులిస్తూ. వసంత నిర్లిప్తంగా తలూపింది.

"సురేష్ ఈ ప్రోగ్రాం ఆపటానికి కావాలని స్నేహితుడ్ని పిలిచాడా. రేపైనా ప్రయాణం కుదరనిస్తాడా" అని ఆలోచిస్తోంది.

నిద్రపోతున్న సురేష్‌ని చూస్తూ అలాగే కూచుంది. నిద్రపోతే మళ్ళీ మెలకువ రాదేమోనని కళ్ళువిప్పుకుని కూచుంది.

ఆ కళ్ళముందు ఎన్నో దృశ్యాలు.

ఆ మనసులో ఎన్నో జ్ఞాపకాలు.

★ ★ ★

వసంత పెళ్ళయినవారానికే బి.ఏ. రిజల్ట్సు వచ్చాయి. ఫస్టుక్లాసులో పాసయింది. స్నేహితులందరూ అభినందిస్తుంటే ఏమీ లెక్కచెయ్యలేదు. పట్టించుకోలేదు. అప్పుడు వసంత దృష్టి ఫస్టుక్లాసుమీద లేదు.

"సురేష్- సురేష్‌కి ఏవనులు ఇష్టం- ఏరుములు ఇష్టం- అత్తగారి మెప్పు ఎలా పొందాలి- ఆడపిల్లని ఎంత ప్రేమగా చూడాలి. ఏ పేచీలు రాకుండా ఎంత జాగ్రత్తగా మెలగాలి" ఈ ఆలోచనలతో వసంత బుర్రంతా గందరగోళంగా ఉండేది. "తను అత్తమామలకు ఎన్నో సేవలు చేస్తుంది. భర్తనెంతో సుఖపెడుతుంది. ఆడబిడ్డను స్వంత చెల్లిలా చూసుకుంటుంది. తన కాపురం ఎంతో బాగుంటుంది" ఈ సుందర స్వప్నం వసంతను ఊపిరి తీసుకోనివ్వలేదు. ఫస్టుక్లాసులో పాసవ్వటం, స్నేహితులు అభినందించటం ఇవి వసంత మనసు పైపొరలకు కూడా అంటలేదు.

శాంత, వరలక్ష్మి ఒక రోజు వచ్చి గొడవ చేసి వసంతను కాలేజీకి తీసుకెళ్ళారు- మార్కులు తీసుకొచ్చుకుందామని.

ఆఫీసులో మార్కులు తీసుకుని వస్తుంటే ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్ దగ్గర రాధాకృష్ణమూర్తిగారు కనిపించి వసంతను డిపార్ట్‌మెంట్‌లోకి పిలిచారు. "ఎమ్.ఎ.లో ఏం తీసుకుంటావు? ఇంగ్లీషా- తెలుగా?"

ఆయన ప్రశ్న అర్థంకాక బిత్తరపోయింది.

" ఇంగ్లీషు తీసుకో. నీకు భాషమీద మంచి పట్టుఉంది. అది వున్నవాళ్ళు చాలాతక్కువమంది ఉంటారు. ఇంగ్లీషు చదివితే నీకు మంచి ఫ్యూచరుంటుంది" అంటున్నారాయన.

"నేను ఎమ్.ఏ చదవనండి" అంది వసంత. హఠాత్తుగా ఆయన మాటలు మధ్యలో ఆపుతూ.

"ఏం"- అన్నారాయన.

"పెళ్ళయిపోయిందికదండీ" అంది వసంత సిగ్గుపడుతూ-

"ఎంత అందంగా సిగ్గుపడేది తను"-

"పెళ్ళికుదిరింది అన్న దగ్గర్నించీ నీమొహం ఐతేనేవుందే. సిగ్గుపడుతుంటే నిన్ను చూడబుద్ధవుతుంది. కానీ సిగ్గుపడితీరాలంటావా- నేనయితే నీలాగా సిగ్గుపడలేనేమో" అనేది రోహిణి.

అంత అందమైన సిగ్గును మాస్టారేం పట్టించుకోలేదు. 'కూర్చో' అని కుర్చీ చూపించారు.

వసంత కూర్చుంది. అరగంటసేపు ఏవేవో

చెప్పారు. సారాంశం- ఎమ్.ఎ చదవమని. వసంత ఒక్కముక్కకూడా వినలేదు. "ఆలస్యం అయిపోతోందే, ఇంటిదగ్గర సురేష్ ఎదురుచూస్తుంటాడు. ఏంటీయన సొద" అని విసుక్కుంటూ బలవంతాన కూచుని ఆయన చెప్పటం ఆపగానే "వస్తానండీ" అంటూ లేచి వచ్చేసింది.

"మాస్టారి మాటలు విని ఎమ్.ఎ చదివితే!" ఇవాళ మనసులో ఆలోచనలు! ఎమ్.ఎ చదివితే ఏంజరిగేది? సురేష్ కోసం బాధపడేదికాదా? ఏదన్నా ఉద్యోగం చేసుకుంటుంటే మాత్రం భర్త ఒదిలితే బాధ ఉండదా.

ఇప్పుడు సురేష్ దూరమయ్యాడనే బాధతో పాటు తన జీవితం అంతా సురేష్‌కీ, పిల్లలకీ అంకితం చేసి ఇప్పుడు తను ఒట్టిగా, ఏ తెలివితేటలూ లేనిదానిలాగా, ఏ ఆధారమూ లేనిదానిలాగా, ఈ ముగ్గురు మనుషుల ద్వారా తప్ప గుర్తింపు లేనిదానిగా మిగిలిపోవాల్సి వచ్చింది.

వీళ్ళ దయకోసం ఎదురు చూడాల్సి వచ్చింది. తనకు ఒక ఉద్యోగిగా ఏదో ఓపని చెయ్యగలదానిగా తనకు తను ఓ ప్రత్యేక వ్యక్తిగా గుర్తింపు వుంటే తనకు ఏదో ఒకటి ఆధారం ఉండేది. తన రెండు కాళ్ళలో ఒకటైనా కాస్త భూమిమీద అని ఉండేదేమో.

ఇలా హఠాత్తుగా తన కాళ్ళకింద భూమి మాయమై తను గాలిలో వేళ్ళాడుతున్నట్టు-

ఏమీ భద్రత లేకుండా ఏ అగాథాల్లోనో పడిపోతున్నట్టు అనిపించేది కాదేమో-

కానీ తనెలా అనుకుంటుంది.

సురేష్ ఇంతపని చేస్తాడని ఎలా అనుకుంటుంది.

'భార్య', 'తల్లి'- వీటికంటే స్థిరత్వం భద్రత దేనికుంటుందనుకుంటుంది.

అవి ఇంత నిస్సారమైనవనీ, డొల్లలనీ తనకేం తెలుసు? తనకేకాదు- ఎవరికైనా తెలుసా!

తెలిస్తే ఈ ప్రపంచం ఇలా ఎందుకు సాగుతుంది? ఒట్టిది అందరూ సురేష్‌లా ఉంటారు.





భార్యలను ఒదిలెయ్యరు. ఆ నీలిమలాంటి వాళ్ళు అందరికీ దాపురించరు.

నీలిమ గుర్తొచ్చేసరికి వసంత మనసు భగభగమండిపోయింది. దుఃఖం పొంగి వచ్చింది.

"నిద్రపోకుండా అలాగే కూచున్నావా?" సురేష్ లేచాడు.

"ఊఁ మెలకువ రాదని" అంటూ గడియారం వంక చూసింది వసంత.

నాలుగయింది.

"లేవండి... బయల్దేరదాం" అంది.

* * *

పగలంతా సాగర్‌లో అక్కడా యిక్కడా తిరిగారు. చూసేవాటిమీద ఇద్దరిలో ఎవరికీ ఆసక్తి లేదు. మ్యూజియంలో శిథిలాలను చూస్తుంటే వసంతకు తన జీవిత శకలాల్లా అనిపించాయి. మిగిలిన అందరూ గలగలా మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ చూస్తున్నారు. వసంత అశాంతి భరించలేక బైటికివచ్చి నదివైపునున్న మెట్లమీద కూచుంది. అలలు మెల్లిగావచ్చి మెట్లను తాకుతున్నాయి. అక్కడక్కడా మెట్లమీద మనుషులు.

ఈ నదిలో దూకేస్తే అనిపించింది వసంతకు. అప్రయత్నంగా రెండడుగులు ముందుకు పడ్డాయి. 'ఎందుకు చచ్చిపోవాలి? ఎందుకంటే... తనకు జీవితంలో ముఖ్యమైందనుకున్నది తనకు దక్కటంలేదు. ఇంక బతకటం ఎందుకు'

వసంత ఆలోచనలను భగ్నంచేస్తూ హఠాత్తుగా ఓ కాగితం గాలికి ఎగిరివచ్చి ముఖానికి అతుక్కుంది. వెనుకనుంచి ఒకావిడ "ఐయాం సారి" అంటూ నవ్వుతూ ఆ కాగితం తీసుకుంది.

అక్కడే ఆమెట్లమీదే కూచుని గబగబా ఏదో రాసుకుంటోంది.

వసంతకూడా పక్కనే కూచున్న ఆమెని చూస్తోంది. మధ్యలో ఆవిడొకసారి తలెత్తి వసంత వంక చూసింది. చిన్నగా నవ్వి మళ్ళీ తనపనిలో పడిపోయింది.

'తనకే ఏపనీలేదు- ఆమెలాగా తనమానాన తను పనిచేసుకోగలిగితే-

తనకూ ఊపిరాడనివ్వని ఉండేది.

ఇంటిపని ఒక్కక్షణం తీరకుండా చేసేది.

రకరకాల ఫలహారాలు, పచ్చళ్లు, జామ్‌లూ ఎన్నెన్నో తయారు చేసేది.

ఇల్లంతా ఎప్పుడూ దులుపుతూ కడుగుతూ తుడుస్తూ ఉండేది.

ఎన్నిపనులు- ఇప్పుడు కూడా ఆపనులన్నీ ఉంటాయి. రేపు లావణ్యకు కొడుకో, కూతురో పుడితే తనదగ్గరకే పంపుతుంది. ఎప్పుడో చెప్పింది. తనే పెంచాలని.

పెంచితే- మళ్ళీ ఆపనులన్నీ చేస్తే తనకు తీరిక ఉండదు. నిజమే-

కానీ తనకు మిగిలేది ఏముంటుంది-

కొన్నాళ్ళకు ఆబిడ్డ లావణ్యకే దూరం అవుతుంది. తనసంగతి చెప్పేదేముంది.

అప్పుడు ఈపనులు, ఈ చాకిరీ వీటికి విలువేముంటుంది.

నేనిన్నాళ్ళూ చేసిన వాటికి విలువ వుందా?

భార్యను కాబట్టి చేశాను. తల్లిని కాబట్టి చేశాను. అవి ఎలాగూ చెయ్యాల్సిందేగదా. అవిచేస్తూ నాకోసం ఏమన్నా చేసుకుంటే బాగుండేదా-

నాకోసం రోజంతటిలో ఒక్కనిమిషమన్నా ఉపయోగించుకుని వుంటే ఇవాళ ఈ గంటలింతశూన్యంగా ఉండేవా?

"వసంతా వెళ్దాంరా" అంటూ వచ్చాడు సురేష్. ఇద్దరూ మళ్ళీ నదిదాటి అవతలి ఒడ్డుచేరారు. రాత్రి భోజనం ముగించి గదిలోకి వచ్చారు. సురేష్ బట్టలు మార్చుకుంటున్నాడు. వసంత తలవంచుకుని మంచంమీద కూర్చుంది. 'ఈ ప్రయత్నం కూడా వృధాయేనా? రోజంతా మౌనంగా గడపటం తప్ప ఇద్దరి మధ్యా అవగాహన పెరిగిందెక్కడ? నిరాశ, అసంతృప్తులను బలవంతంగా పక్కకునెట్టి తల ఎత్తింది.

"ఏంటి ఆలోచిస్తున్నావు?" అంటూ వచ్చి పక్కనే కూచున్నాడు సురేష్.

"ఏంలేదు" అతని చేతిని తన చేతిలోకి తీసుకుంది. సురేష్‌లో ఏ చలనమూ లేదు. ఎటో చూస్తూ కూచున్నాడు.

నెమ్మదిగా తలను అతని భుజం మీద ఆనించి ఇంకో చెయ్యి అతని మెడచుట్టూ వేసి అతని కళ్ళల్లోకి చూడబోయింది.

అతనెటో చూస్తున్నాడు. మెల్లగా అతని మెడమీద తన పెదవులానించింది వసంత.

"చాలా అలసటగా వుంది వసంతా- రోజంతా తిరిగాము"

సురేష్ వసంతను విడిపించుకుని అవతలి మంచంమీద అటుతిరిగి పడుకున్నాడు.

అవమానంతో దహించుకుపోయింది వసంత.

"నేనింత పనికిరాకుండా పోయానా?"

వసంత మాటలు పెదవిదాటి బైటికి రాలేకపోయాయి. సురేష్ దుప్పటి ముసుగుపెట్టాడు.

వసంతకు ఆ మంచంమీద సురేష్ పక్కన పడుకుంటే తను శవమై పోయిన భావమేదో కలిగింది.

తనలో జీవశక్తి అంతా నశించి రక్తం గడ్డకట్టి నరాలన్నీ చచ్చుపడిపోయినట్లయింది. ఆలోచించటం, ఆవేశపడటం, దుఃఖించటం కూడా చాతకానిదానిలా నిరామయంగా పైకప్పుకేసి చూస్తూ పడుకుంది. తెల్లవారు ఝామున ఎప్పుడో నిద్రపట్టిందేమో తెల్లగా తెల్లారాక గాని మెలకువ రాలేదు.

అప్పటికే సురేష్ సామానంతా సర్దేసి ప్రయాణానికి సిద్ధమై ఉన్నాడు.

మొదటిసారిగా 'ఇకలాభంలేదు' అనే అభిప్రాయం కలిగింది వసంతకు.

నీలిమ మీద పైపై మోజుకాదు.

వాళ్ళిద్దరిమధ్యా జరిగింది తేలికైన విషయంకాదు. ఈ ఆలోచనతో వసంతకు ఎక్కడలేని నిస్సత్తువ వచ్చింది.

ఏంచెయ్యాలి - సురేష్‌ని ఒదిలి ఎలా బతకాలి బుర్రంతా నిప్పులకొలిమిలా తయారైంది. ఎదురుగా అద్దంలో తననుతాను చూసుకుంది. తను లావెక్కిపోయింది. నిజమే. కానీ అందంగానే ఉంది.

నడుము శరీరంలో కలిసిపోకుండా ఇంకా ప్రత్యేకంగా కనపడుతూనేఉంది.

చేతులు లావెక్కినా మొరటుగా లేవు.

తను ఇంకా మగాళ్లను ఆకర్షిస్తూనేఉంది.

తను ఏసినిమాకో వెళ్లినపుడు మగచూపులు తనకు తగులుతూనే ఉంటాయి.



ఇద్దరు పిల్లల తల్లి అయినా తనలో యవ్వన చిహ్నాలు ఇంకాఉన్నాయి.

నిజమే - వక్షం కిందికి జారివుండవచ్చు.

వీపు కిందగా నడుము దగ్గర రెండు ముడతలు వుండవచ్చు-

ఇద్దరు పిల్లలకు పాలిచ్చి పెంచాక, ఇంటెడు చాకిరీ చేసుకున్నాకా శరీరంలో ఆ మార్పులు జరగకుండా ఎలా ఉంటాయి.

ఐనా తను వికారంగా లేదు. తనను భరించలేనంత వికారంగా అసలులేదు.

పోయిన ఏడాదికూడా అతను ఈ గుండెలను ముఖానికి హత్తుకున్నాడు.

"నాకు పిచ్చెక్కిస్తున్నాయని" ఊపిరాడనివ్వకుండా అదుముకున్నాడు.

అతను దూరమవటానికి ముడతలు పడ్డనడుమూ, జారిన వక్షమూ కారణంకాదు —'

కళ్లనీళ్లు తుడుచుకోవాలని కూడా మర్చిపోయి అలాగే అద్దం ముందు నిలబడిపోయింది వసంత.

★ ★ ★

నాగార్జునసాగర్ నుంచి వచ్చాక వసంత మరింత నీరసపడిపోయింది. తిండి తినదు. ఇంటిపనులమీద శ్రద్ధలేదు. ఎప్పుడూ ఎడతెగని ఆలోచనలు. ఏడుపు-

అన్నా వదిన వచ్చి ధైర్యం చెబుతారు.

"ఇలాంటివి అప్పుడప్పుడూ జరుగుతుంటాయి. పట్టించుకోకూడదు. నాలుగు నెలలు ఓపిక పడితే అతనే దారికొస్తాడు" అంటారు.

"నాకు తెలిసి నాలుగు నెలలయింది. అంతకుముందు ఆరునెలలనుంచీ నడుస్తోంది- ఇంకో నాలుగు నెలలు గడిస్తే అది యిక శాశ్వతమైతే" అంటే "అప్పు - అలా కావంటారు".

"ఇలాంటివి లక్షలెన్నైచూశాం. లక్షణమైన భార్యని ఎవడూ వదులుకోడు. కాదపోతే అవి వదు వచ్చేసి [illegible] జాగ్రత్తపడాలి" అంటారు.

వసంతకు [illegible]

రాగానే-

"అందరికీ డబ్బుగోలే — లావణ్యకీ, అన్నయ్యకీ, వదినకీ, అందరికీ నీలిమ సురేష్ నుంచి డబ్బులు లాగుతుందనే భయంతప్ప మరొకటి ఉన్నట్టు కనిపించదు. అసలు మనిషి ప్రధానంఅని ఎవరికీ అనిపించటంలేదు. తనకు డబ్బుపోవడం కాదు — సురేష్ భార్యని ఒదిలేశాడు. నీలిమతో ఉంటున్నాడు" అని నలుగురూ చెప్పుకుపోవటం తను భరించలేదు.

అతని పనులు చెయ్యకుండా అతనులేని ఆ ఇంట్లో గడపటం చాలాకష్టం.

"ఎలా — ఏంచెయ్యాలి —"

ఇక్కడివరకూ ఎన్నిరకాల ఆలోచనలైనా వస్తాయి. ఎన్నిరకాల అర్థాలయినా తోస్తాయి. కానీ 'ఇప్పుడేం చెయ్యాలి' అన్న ప్రశ్నకు మాత్రం సమాధానం తోచదు.

సురేష్ ఇంటికి నామమాత్రంగా వస్తున్నాడు.

ఇద్దరిమధ్య మాటలేలేవు.

అతను పలకరించబోయినా వసంతకు మాట్లాడబుద్ధికావటంలేదు.

అతనంత స్పష్టంగా తిరస్కారాన్ని చూపిన తర్వాత ఇంక మాట్లాడేందుకేముంది — అని పిస్తోంది వసంతకు.

ఈ అస్పష్టతలోంచి మెదడును తినేస్తున్న ఆలోచనలతో దహించివేస్తున్న అవమానంతో బతకటం అసాధ్యమనిపించింది వసంతకు.

"ఎందుకిలా బతకటం, ఎంతకాలం యిలా బతకటం చచ్చిపోతే ఏమవుతుంది."

ఈ ప్రశ్నలు వసంత తలలో విడవకుండా తిరుగుతున్నాయి. ఒక్కోసారి ఆ ప్రశ్నలకు వేటగాడిని చూసి బిక్కచచ్చిన కుందేలు పిల్లలా అయిపోతోంది. ఒక్కోసారి ఆ ప్రశ్నల ధాటికి గుండె వేగంగా కొట్టుకుని ఆ చప్పుడు చెవులు బద్దలయేలా వినిపించేది. నిద్రలేని రాత్రులలో భయంతో ఒణికి ఒళ్లు ముద్దయ్యేలా చెమటలు పట్టేవి. ఆ గదిలో [illegible] బీ, అల్మారాలూ, అందులో [illegible] [illegible]గా వికటాట్టహాసం చేస్తూ తనమీదకు [illegible] [illegible]నిపించి [illegible]

బతికి ఉండటానికి [illegible] ఇంతో చచ్చిపోవ[illegible] అభ్యంతరమూ

కనిపించలేదు వసంతకు. కానీ తన చేతులతో తన ప్రాణాన్ని ఎలా తీసుకోవాలో అర్థంకావటంలేదు.

ఎట్లా చచ్చిపోవాలి?

రోజుల తరబడి ఈ ఆలోచనలో మునిగిపోయేది. గదంతా గ్యాస్ నింపి అగ్గిపుల్ల గీసెయ్యవచ్చు.

నిద్రమాత్రలు మింగవచ్చు.

హుసేన్‌సాగర్‌లో పడవచ్చు.

ఏ ఎత్తయిన భవనమో ఎక్కి దూకొచ్చు.

అయిపోతుంది- వసంత ఉండదు. వసంత దుఃఖం ఉండదు.

కానీ-

"వసంత చచ్చిపోయింది- పాపం. మొగుడొదిలేస్తే భరించలేక చచ్చిపోయింది" అంటారు.

"చచ్చేం సాధించింది. బతికుండి ఎలాగో భర్తను మార్చుకోవాలిగానీ" అంటారు.

ఆ తర్వాత మర్చిపోతారు. సురేష్, లావణ్య, నవత అందరూ కొన్నాళ్లు ఏడ్చి మర్చిపోతారు.

అందుకా నేను చచ్చిపోవాలి?

నేను- నేను- నేను- ఎవరిని నేను.

ఎందుకీ ప్రపంచంలోకి వచ్చాను? వచ్చినందుకు ఏంచేశాను?

నాక్కూడా సహాయపడలేని ఇద్దరు పిల్లల్ని కన్నాను. సర్వస్వం అనుకున్న భర్తను పోగొట్టుకున్నాను. ఎవరికీ అక్కరలేక, ఈ బరువు మామీద పడుతుందేమోనని అందరూ భయపడుతుంటే, నావల్ల ఎవరికీ కించిత్తు ప్రయోజనం లేకపోతే, ఆ విషయం అందరూ స్పష్టంగా తనతో చెబుతుంటే అది భరించలేక చచ్చిపోతోంది. అదెంత భయంకరం-

ఈ ప్రపంచంలో ఒక్కరికి, ఒక్కరికి కూడా నేనక్కర్లేదా,

వసంతా, అమ్మా, వసూ- నువ్వు లేకపోతే మేం ఏమైపోతాం? నీ ప్రేమ, నీ సహాయం, నీ సేవ మాకు కావాలి- అనేవాళ్ళు ఒక్కళ్లు కూడా లేరా? ఎవరికీ చెందని నేను ఎందుకు బతకటం? వసంతకు ఆలోచిస్తున్నకొద్దీ పిచ్చెక్కిపోతోంది. భయాన్నికూడా జయించే ఆ పిచ్చి ఆక్టోపస్‌లా వసంతను చుట్టేస్తోంది.

"ఒక్కసారి నవతను కూడా చూసి-"

తల్లి హృదయం ఏ మూలనుంచో గొణిగింది. ఎందుకు నవతను చూడటం? లావణ్యను చూడలేదూ? ఇంకా లావణ్య నయం. ఇల్లు రాయించుకుని తన దగ్గరకు రమ్మంది. నవత అలా కాదు. వెంటనే ఉద్యోగం వెతుక్కోమంటుంది. నీ కాళ్లమీద నువ్వు నిలబడాలంటుంది. ఏవేవో చెప్పి తనను మరింత ఒంటరితనంలోకి నెడుతుంది. తనజీవితం తను చూసుకోవటంతోనే ఆ పిల్లకు సరిపోతుంది. అమ్మనెక్కడమోస్తుంది?

అయినా ఎవర్నీ చూడనక్కరలేదు. వాళ్లకు చేయగలిగినవన్నీ చేశాను. నవత పుటకకు చచ్చిబతికాను. ఆ విషయం ఎంత చెబితే దానికి అర్థమవుతుందీ?. నా కూతురు అని మురిసే సురేష్‌కి అర్థమవుతుందా?

ఎవర్నీ చూడనక్కరలేదు- ఎవర్నీ తలవనక్కరలేదు-ఎవరూ తోడు రారు. చేయి అందించరు. 'దూకు సముద్రంలో' అంటారు. 'ఒక్కదానివే కెరటాలతో యుద్ధం చేసి బయట కురా' అంటారు 'మమ్మల్ని పిలవకు. పిలిస్తే నీ బాధ చూడలేక మేం బాధపడాలి. మాకెందుకా బాధ కల్పిస్తున్నా'వని విసుక్కుంటారు. ఒద్దు ఎవర్నీ పిలవద్దు. ఒక్కతే- ఈ ఇంటి నిశ్శబ్దంలో నిశ్శబ్దంగా కలిసిపోవాలి.

ఏడవొద్దు. ఎందుకు ఏడుపు. ఎవరికోసం? నీకోసం నువ్వు ఏడ్చుకోవటం ఏమిటి.

వసంత స్లీపింగ్‌పిల్స్ సీసా చేతిలోకి తీసుకుంది. గ్లాసులో నీళ్లు తీసుకుంది. ఒక్కొక్కటే మింగుతోంది. ఒకటి- రెండు- మూడు- నాలుగు- అయిదు- ఆరు- ఏడు- ఎనిమిది- తొమ్మిది- పది- పదకొండు వసంతకు ఒక్కసారి పెద్ద దుఃఖం వచ్చింది.

"నేను చచ్చిపోను- బతుకుతాను- బతుకుతాను" అని ఏడుస్తూ ఆ సీసా విసిరేసి మంచంమీద పడి ఏడవసాగింది.

అట్లా ఏడ్చిఏడ్చి తనకు తెలియని మత్తులోకి వెళ్లిపోయింది.

మళ్ళీ మెలకువ వచ్చేసరికి చుట్టూ మనుమలు సురేష్, అన్నయ్య, వదిన, లావణ్య, మనోహర్ చేతికి సెలైన్ వసంతకు పెద్దగా

నవ్వాలనిపించింది. చిన్నగా చిరునవ్వు నవ్వి కళ్లు మూసుకుంది. సురేష్ లావణ్యనడుగుతు న్నాడు.

"అమ్మను నువ్వు తీసుకెళ్ళమ్మా. కొన్నిరోజు లు నీదగ్గరుంచుకో"

"అమ్మో... నాకు భయం నాన్నా అమ్మ ఇలాంటి పనేదన్నా చేస్తే నేనేం చెయ్యాలి. మా ఇంట్లో ఇలాంటివి జరగటం మనోహర్‌కి ఇష్ట ముండదు" అంతకుముందు రోజే మనోహర్ చేసిన హెచ్చరిక గుర్తుకు రావటంతో నిస్సహా యంగా మాట్లాడింది లావణ్య.

వసంత వదిన లక్ష్మి కూడా అదే అన్నది.

"మా పిల్ల మాకు బరువు కాదుగానీ ఇలాంటిదేదన్నా జరిగితే అందరూ నన్నంటా రు-ఆ బరువు నేను మొయ్యలేను"

సురేష్ ఆఖరి ఆశగా రోహిణికి ఫోన్‌చేశాడు.

"వసంత పరిస్థితేమీ బాగాలేదు. నిన్న నిద్రమాత్రలు మింగింది- తక్కువే- ప్రమాద మేమీలేదు- కొన్నాళ్ళు తను మీ దగ్గరుంటే కాస్త కోలుకుంటుంది"

రోహిణి "నేను ఇవాళ రాత్రికే బయల్దేరి వస్తున్నాను" అని చెప్పిన తర్వాత-



సురేష్ చిన్నపిల్లాడిలా వెక్కివెక్కి ఏడ్చాడు. వసంత తన మూలాన చచ్చిపోబోయిందన్న విషయం సురేష్ గుండెలమీద పర్వతంలా కూచుంది. దాన్నెలా దించుకోవాలో, వసంత నెలా కాపాడాలో నీలిమనేం చేయాలో, ఈ పరిస్థితంతా ఇలా ఎందుకొచ్చిందో అంతా అయోమయంగా గందరగోళంగా కనిపించి దిక్కుతోచకుండాపోయింది.

ఆ క్షణంలో సురేష్‌కి రోహిణి పెద్ద ఆసరాలా అనిపించింది.

"రేపు ఉదయాన్నే రోహిణి వస్తోంది"

అన్న సురేష్ మాటలు చెవినపడ్డా వసంతలో చలనంలేదు.

ఆమె బుర్ర ఆలోచించటానికి నిరాకరిస్తోంది. ఎదురుగా కనపడేదాన్ని చూస్తూ, చూడలేనప్పుడు కళ్ళు మూసుకుంటూ కాలంగడపటం తప్ప వసంత మరేమీ ఆలోచించగలిగే స్థితిలోలేదు.

"గుంటూరు వచ్చి కాస్త శాంతిగా పదిరోజులు గడిపి వద్దువుగానీ" అన్న రోహిణి మాటలను నిర్లిప్తంగానే విన్నది. రోహిణి కావలసిన బట్టలూ, వస్తువులూ సర్దింది. వసంతకు కాస్త ఓపిక చిక్కగానే రోహిణి ప్రయాణానికి సిద్ధం చేసింది.

నాలుగు నెలల క్రితం గుంటూరు వెళ్ళిన వసంతకూ, ఈ వసంతకూ పోలికేలేదు.

రైల్లో కూచున్న వసంతకు తన ఇరవై సంవత్సరాల జీవితమూ తన వెనకే కూలిపోయినట్లనిపించింది.

పెద్ద భూకంపం వచ్చి ఇళ్ళన్నిటినీ పొట్టనబెట్టుకున్న తర్వాత భూమి ఎలా ఉంటుందో అలా ఉంది వసంత. ఇక అక్కడ మళ్ళీ ఇల్లు కట్టే అవకాశమే లేదా అనిపిస్తోంది వసంతను చూస్తుంటే-

హైదరాబాద్ దాటివెళ్తుంటే వసంతకు ఆపుకోలేనంత పెద్ద దుఃఖం వచ్చింది.

"హైదరాబాద్ అన్నదే తనకు ఇక లేదా? హైదరాబాద్ అన్న పదానికి ఇక తన జీవితంలో ఉండే అర్థం వేరు.

ఇదంతా సురేష్ మూలంగానే-

సురేష్ లేకపోతే తనకు హైదరాబాద్ లేదు.

ఇది సురేష్ తప్పా? తన తప్పా?"

హైదరాబాద్‌వైపు పరుగెడుతున్న మనసును బలవంతాన ఆపే ప్రయత్నంలో అలిసిపోతోంది వసంత.



గుంటూరువచ్చి పదిరోజులయింది. ఈ పదిరోజుల్లో రోహిణి చెప్పే మాటలు వినటం తన ఆలోచనల్లో తనుండటం తప్ప వసంత మరేం చెయ్యలేదు. రాత్రిళ్ళు రోహిణి ఇచ్చే నిద్రమాత్రలతో నిద్రపోతోంది. రోహిణి బలవంతంగా తినిపించే తిండితినక తప్పటంలేదు. సాయంత్రాలు రోహిణి పిల్లలకు పాఠాలు చెప్పక తప్పటంలేదు.

రోహిణి సాయంత్రంపూట పిల్లల్ని కావాలనే వసంత దగ్గరకు పంపుతోంది.

ఆ పిల్లలతో కాలక్షేపం చేస్తున్నంతసేపూ బాగానే ఉండేది.

తీరా వాళ్ళు వెళ్ళి పడుకునేసరికి వసంతకు ప్రపంచంలోని ఒంటరితనమంతా తననే ఆవహించినట్లు ఉండేది.

రోహిణి వచ్చాక రామారావుని ఆఫీసు రూంలోంచి బైటికి లాక్కొచ్చేది.

ముగ్గురూ భోజనాలు చేసేవారు. భోజనాల సమయంలో రామారావు కోర్టు కబుర్లూ, రోహిణి ఆసుపత్రి కబుర్లూ హాస్యంగా చెప్పి నవ్వించేవారు. తర్వాత రోహిణి వసంతతో కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి నిద్రమాత్ర ఇచ్చి పడుకోబెట్టేది. మళ్ళీ తెల్లారగానే ఒంటరితనం వసంతకోసం ఎదురు చూస్తుండేది.

తను వచ్చినప్పటినుండీ రోహిణి శాంత విషయం ప్రస్తావించకపోవటం వసంత గమనిస్తూనే ఉంది. తనంతటతను శాంత గురించి





మాట్లాడాలంటే ఇష్టంగానూ లేదు.

చివరికోరోజు శాంత దగ్గరకు బయల్దేరింది వసంత. ఇలా వెళ్తానని రోహిణీతో చెప్పలేదు.

రోహిణి ఆసుపత్రికి వెళ్ళగానే తానూ తయారై ఉమెన్సు కాలేజీకి వెళ్ళింది.

కాలేజీకి శలవలు కాబోలు ఆవరణంతా నిశ్శబ్దంగా ఉంది.

కాలేజీ దాటి క్వార్టరువైపు నడుస్తుండగా "తనెందుకు ఇక్కడికి వస్తున్నట్లు" అన్న ఆలోచన వచ్చి ఆగింది.

మళ్ళీ ఏదో ఒకటి చెయ్యాలి తప్పదు అనే పట్టుదల వచ్చినదానిలా నడిచి శాంత ఇంటి తలుపు తట్టింది.

తలుపు తెరిచిన పనిమనిషి మళ్ళీ యధాప్రకారం పేరు కనుక్కొని 'కూచోండమ్మా' అని చెప్పి శాంతకు చెప్పటానికి లోపలకు వెళ్ళింది.

వసంత కూచోకుండా తనూ ఆ అమ్మాయి వెంట లోపలకు వెళ్ళింది.

శాంత పరీక్ష పేపర్లు ముందు పడేసుకుని చూస్తున్నదల్లా వసంతను చూసి ఆశ్చర్యంగా లేచింది.

"వసంతా-రా- కూచో" అంటున్న శాంత మాటలు పూర్తవకుండానే వసంత ఓ కుర్చీ విసురుగా లాక్కొని కూచుంది.

శాంత నవ్వింది.

"ఎప్పుడొచ్చావు?"

"పదిరోజులయింది"

"అంతా బాగున్నారా?" మంచినీళ్ళు అందించింది శాంత.

"ఎవ్వరం బాగోలేము" గ్లాసు లాక్కొని అవతలపెట్టింది.

"అదేంటి" అంది శాంత మామూలుగానే.

"నీకేమీ తెలియదా? రోహిణీ చెప్పలేదా?" పోట్లాడుతున్నట్లే అడిగింది వసంత.

"చెప్పింది- ఐయాంసారీ వసంతా" అంది శాంత.

"ఎందుకు సారీ - నీకు సంతోషంగానే ఉందేమో" పళ్ళబిగువున అంది.

"నాకు సంతోషమేమిటి వసంతా" అనునయంగా అంటూ పక్కనే కూచుంది శాంత.

"నన్ను చూసైనా, నా బాధ చూసైనా నువ్వు తెలుసుకుంటావని వచ్చాను శాంతా - ఇంకొక ఆడదాని ఉసురు పోసుకోకు"

"అలాగేలే- నువ్వు మామూలుగా ఉండు. ఇప్పుడా గొడవలన్నీ ఎందుకు?"

"అట్లాకాదు... ముందు నాకు చెప్పు నువ్వు చేసింది తప్పా కాదా. నువ్వూ అతనూ కలిసి ఆవిడెవరినో అన్యాయం చెయ్యటం ఘోరమా కాదా? ముందు తప్పు ఒప్పుకో" వసంత చాలా ఆవేశంతో అంది.

వసంత మానసిక స్థితి శాంతకు అర్థమై జాలితో మనసంతా ఆర్ద్రమైంది.

తనకు చాలా అన్యాయం జరిగింది- నీలిమా, సురేష్‌లు తన జీవితాన్ని నాశనం చేశారు. వాళ్ళనేం చెయ్యాలో తెలియని కసి, వాళ్ళు తప్పు ఒప్పుకుని తన జీవితం తనకు ఇవ్వాలనే గాఢమైన కోరికా—

వీటితో వసంత భయంకరమైన మానసిక స్థితిలో ఉందనీ, నరకయాతన పడుతోందనీ అందుకే తనను తిట్టి, తప్పు ఒప్పించి తృప్తిపడదామనే ఉద్దేశంతో వచ్చిందనీ శాంతకు అర్థమైంది. ఇప్పుడేం చెయ్యాలా అని ఒక్షణం ఆలోచించింది శాంత.

వసంత అన్నదల్లా ఔనని, తనది తప్పేనని ఒప్పుకుని పంపవచ్చు. తాత్కాలికంగా ఆమెను శాంతింపజేయవచ్చు. కానీ అందువల్ల తర్వాత ఆమె కసి మరింత పెరుగుతుందే గాని తరగదు. ఆమెను మామూలు మనిషిని చెయ్యటానికి ఆమెను ఆలోచింపచెయ్యటమొక్కటే మార్గం.

శాంత దానికే సిద్ధమయింది.

"ఏమిటి వసంతా నేను చేసిన తప్పు?" సూటిగా అడిగింది.

"నువ్వు పెళ్ళయినవాడితో సంబంధం ఎందుకు పెట్టుకున్నావు?" అంతకన్నా సూటిగా అడిగింది వసంత.

"అతనికీ, నాకూ ఇష్టమయింది-అందుకు"

"అతని భార్య సంగతేమిటి- ఏమవుతుంది?"

"ఏమైనాకావచ్చు. మా సంబంధం ఆమెకు

ఇష్టం లేకపోతే విడాకులిస్తుంది. సహించగలి గితే సహిస్తుంది. నేను అతనితో ఇలా ఇద్దరితో నువ్వుండటం నాకు ఇష్టంలేదంటే అతనే ఆమెకు విడాకులిస్తాడు. ఏమైనా కావొచ్చు. వసంతా నాకొకటి చెప్పు భార్యాభర్తలు విడిపో కూడదా?''

''విడిపోవచ్చు...ఆవిడవల్ల తప్పేమయినా జరిగితే- ఆమె వివాహజీవితానికి పనికిరాక పోతే విడిపోవచ్చు'' ''అసలు పెళ్ళే ఒక పెద్ద తప్పు వసంతా. అందరూ కలిసి తప్పు చేస్తారు. ఆ తప్పుని గుర్తించి సరిదిద్దుకునే ప్రయత్నం చేస్తే మాత్రం అది తప్పని గోల పెడతారు. రాధాకృష్ణకి ఆమెతో ఏ అనుబంధమూలేదు. పెద్దలు పెళ్ళిచేశారు. అతనికి కాదనాలని కూడా తెలియని వయసు. ఆమెకీ అంతే- పొరపాటు జరిగిపోయింది. ఇక అతనికి ప్రేమ అంటే తెలియకూడదా? జీవితాంతం మోడులా బతకాలా?''

''నువ్వు కనిపించకపోతే. నువ్వు అంగీకరించకపోతే అలాగే బతికేవాడు కాదా''

నిరసనగా అంది వసంత.

''నేను కాదు...ప్రేమ దొరకకపోతే అలాగే బతికేవాడేమో! ప్రేమకోసం వెదుకులాటలోనే అతని జీవితం ముగిసిపోయేదేమో. కానీ అతనికి ప్రేమ దొరికింది. ఎందుకు కాదనాలి. కాదని సాధించేదేమిటి? నిర్లిప్తంగా డ్యూటీలా చేసే సంసారం కోసంప్రేమనుఒదిలెయ్యాలా?''

''రేపు నీకంటే ఎక్కువ ప్రేమించే వాళ్ళొస్తే'' హేళనగా అడిగింది వసంత.

''అపుడు విషయం నా ఆత్మగౌరవానికి భంగం రాకుండా ఎలా సెటిల్ చేసుకోవాలో నేను చూసుకుంటాను. లేనిదానికోసం ఏడ్చేంత హీనస్థితికీ, నాలేమికి ఎవరో కారణమని నిందించే స్థితికీ దిగజారను. అలాగే నా ప్రేమకు రాధాకృష్ణ అనర్హుడు అని నాకనిపించిన తర్వాత అతనికి కూడా నా ప్రేమ దొరకదు. నా ప్రేమకు చాలా విలువుంది. నాప్రేమ గుప్పెడు మెతుకులకోసం - పిల్లల కోసం కాదు. నా బతుకుదెరువు కోసం కాదు. నా భద్రత కోసం కాదు. నారక్షణకోసం కాదు. మనిషిని మనిషిగా ప్రేమిస్తాను. మా సంబంధం ఆస్తులకూ వంశాలకూ పరువు ప్రతిష్టలకూ పరిమితమైంది కాదు. అలాంటి ప్రేమ గురించి నీకు తెలియదు'' ఆయాసంగా ఆగింది శాంత.

''అంటే నేను తిండికోసం సురేష్‌ని కోరుకుంటున్నానా?'' తీవ్రంగా అడిగింది వసంత.

''తిండికోసం కాకపోతే హోదాకోసం. సురేష్ భార్యనని చెప్పుకోవటం కోసం. సురేష్ ఒదిలేశాడంటే నలుగురూ చులకన చేస్తారనే భయంకోసం. ఈ భయాలేవీ లేకపోతే, పరువు ప్రతిష్టల సమస్యలు లేకపోతే నువ్వేకాదు ప్రపంచంలో భార్యలెవరూ భర్తలకోసం ఇలా దేబిరించరు. కానీ నేను రాధాకృష్ణ ప్రేమ కోసం నా పరువు మర్యాదలు లెక్కచేయ్యలేదు. నన్ను చిన్నచూపుచూసినా లెక్కచెయ్యలేదు. మంచి స్నేహితురాలనుకున్న నువ్వు ఆ విషయం తెలిసి అసహ్యించుకుని వెంటనే వెళ్ళిపోవాలనుకున్నావు. నీలాంటి వాళ్ళ అసహ్యాన్ని లెక్కచెయ్యలేదు. ఎవరేమనుకున్నా రాధాకృష్ణ ప్రేమ నాకు కావాలి. ఆ ప్రేమ లేనిదే నా జీవితానికి పరిపూర్ణత లేదు అనుకున్నాను-''

శాంత ఆవేశానికి వసంత కూడా నివ్వెరపోయింది. శాంత కళ్ళల్లో నీళ్ళు చూసి చలించింది.

''వసంతా - నీ దృష్టిలో లోకం దృష్టిలో నేను చెడ్డదాన్ని కావొచ్చు. కానీ నేనేం చేశాను. రాధాకృష్ణను నా జీవితంలోకి రమ్మని బలవంతం చేశానా? నా గడపదాటటానికి వీల్లేదని కట్టిపడేశానా? నాకు నెలనెలా జీతభత్యాలూ, భరణాలూ ఇమ్మని ఒత్తిడి చేశానా? ఆ పిల్లలు కాదు నాకు పిల్లల్ని కను అని బలవంతం చేశానా - నేనేం చెయ్యలేదు. నేను చేసిందల్లా అతని ప్రేమను నిరాకరించలేకపోవటం. నావంక చూస్తుంటే వెలిగే అతని కళ్ళను కాదనలేను. నా మాటల్ని, నా బొమ్మల్ని తన్మయత్వంతో వినే, చూసే అతని మనసుని తిరస్కరించలేను. నాకు ఇక్కడ శాంతిగా ఉంది అంటూ వచ్చిన అతన్ని బైటికి పొమ్మనలేను. ఎందుకంటే - నాకూ ప్రేమా, శాంతీ కావాలి. ఈ సమస్యకు సరియైన పరిష్కారమేమిటో నాకు తెలియదు. నేను చేస్తున్నది తప్పో ఒప్పో నాకు తెలియదు. కానీ నాకిట్లా శాంతిగా




ఉంది. నేనెవరికీ అపకారం చెయ్యాలనుకోను. ఎవర్నీ బాధ పెట్టాలనుకోను. కానీ ఇందులో నేను చెయ్యగలిగిందేమీ లేదు. ఈ పెళ్ళిళ్ళు, విలువలూ, సమాజం అన్నీ కలిసి ఈ సమస్య ను సృష్టించాయి. నన్నంటే నేనేం చెయ్యను''

శాంత తనకు తెలియకుండానే ఏడ్చేసింది.

''శాంతా-ఊరుకో శాంతా-ప్లీజ్-నాబాధలో నేనేదో అన్నాను. ఊరుకోమ్మా'' అంటూ శాంత ను కావలించుకుంది వసంత.

తను శాంతను ఓదార్చాలని కలలో కూడా అనుకోని వసంత వెక్కివెక్కి ఏడుస్తున్న శాంత వీపు నిమురుతూ బుజ్జగిస్తూ శాంతను లేపింది. కన్నీళ్ళు తుడిచింది. ''శాంతా-ఆడ వాళ్ళ జీవితమే యింతా'' అని కన్నీరు పెట్టు కుంది.

భిన్న పరిస్థితుల్లో ఉన్న ఆ ఇద్దరు స్త్రీలూ తాము స్త్రీలమనే విషయం మొదటిసారిగా గుర్తించినట్లు చేతులు కలుపుకున్నారు. ఒకరి నొకరు ఓదార్చుకున్నారు. ఒకరికొకరు ఆసరా అయ్యారు. పెళ్ళిళ్ళ గురించీ జీవితాల గు రించీ ఆలోచనలు కలబోసుకున్నారు. ధైర్యం చెప్పుకున్నారు. సాయంత్రం అవుతుండగా రో హిణి వచ్చింది. ''నువ్వు ఇక్కడ ఉన్నావా? ఇంటి దగ్గర చెప్పి రాకూడదూ? నేను హడలి పోయానంటే నమ్ము. ఏం చెయ్యాలో తెలియక పిచ్చెక్కింది. హైదరాబాద్ వెళ్ళి ఉంటావా అనుకున్నాను. శాంతకు చెప్పి సలహా అడుగు దామని వచ్చాను. ఇక్కడికి వచ్చి వుంటావనే ఆలోచన కూడా ఉందిలే- మొత్తానికి చంపే శావు గదా-''

వసంత కనిపించిందనే సంతోషంతో ఊపిరాడకుండా మాట్లాడేసింది రోహిణి.

''ఎందుకే అంత కంగారు. నేను చచ్చిపో ను. నాకు చచ్చిపోవాలనిపించటంలా. ఎలా గోలా బతకాలనే అనిపిస్తోంది'' అంది వసంత నీరసంగా నవ్వుతూ.

''చూడవే దీని పిచ్చి మాటలు. ఇప్పుడేమ యిందని ఆ మాటలు మాట్లాడటానికి. నీకెంత స్వేచ్ఛ దొరికిందో నీకు తెలియదు'' అంది రోహిణి వాతావరణాన్ని తేలికచేస్తూ.

''ఆఁ స్వేచ్ఛ కాక మరేముంది'' అంది వసంత.

''మనం చిన్నప్పుడు రచయిత్రుల నవల లు చదివి ఏమనుకునేవాళ్ళం. ముఖ్యంగా ఓ రచయిత్రి భర్త ప్రేమకోసం దేవులాడే ఆడవా ళ్ళ గురించి దయనీయంగా రాసేది. ఆ భర్త ఎవరితోనన్నా లేచిపోయి ఈ భార్యను ఒదిలేసి సుఖపెట్టరాదా అనుకునేవాళ్ళం అప్పుడు ను వ్వనే దానివి- అలా చేసినా కూడా వీళ్ళకు బుద్ధిరాదు. చచ్చిపోనన్నా పోతారు లేదా ఆ భర్తల పాదాల దగ్గరపడి పాకుతారు అనుకునే వాళ్ళం'' శాంత నవ్వుతూ అంది.

''అప్పుడు నాకిలాంటి పరిస్థితి ఒస్తుందను కున్నానా?''

''ఇప్పుడు నీ పరిస్థితికేమయింది? నువ్వు వ్యక్తిగా బాగుపడే రోజులొచ్చాయి. హాయిగా నీకిష్టమైన పనులు నువ్వు చేసుకో భర్త లేక పోతే జీవితమే లేదనుకోకు'' రోహిణి చెప్పింది.

''కానీ నేనిప్పుడేం చెయ్యగలను?'' నీరసప డింది వసంత.

''ఇప్పుడు మొదలుపెట్టడం కొంచెం కష్టంకావచ్చుకానీ మొదలు పెడతావుగా - అందుకే ఆడవాళ్లు పెళ్లితోనే జీవితం అనుకో కూడదు. మన జీవితం, మన పని, మనస్థానం మనకు ప్రత్యేకంగా ఉండాలి''

''మా నవతలా మాట్లాడుతున్నావు'' అంది వసంత.

''అన్నట్లు నవత ఉత్తరం రాసింది చూడు'' అంటూ రోహిణి పర్సులోంచి ఓ కార్డు తీసి యిచ్చింది.

రెండే లైన్లున్నాయి ఆ కార్డులో. '20న బయలుదేరి వస్తున్నాను. నువ్వు బాగున్నావను కుంటున్నాను' అని.

''పన్నెండో తారీకే హైద్రాబాద్ వచ్చింది. నేను లేనని తెలియగానే యిటు రావొద్దూ? వాళ్ల నాన్నతో ఒకవారంరోజులుండిగాని రావ టంలేదు. దానికెలాగైనా వాళ్ల నాన్నంటే ఇష్టం'' వసంత బాధపడింది.

'' ఈ విషయాలన్నీ వాళ్ల నాన్నతో మాట్లాడు తుందేమోలే. పిల్లలకి ఇద్దరూ ముఖ్యమే-'' అంది శాంత.

''లావణ్యకి మేమిద్దరం ముఖ్యంకాదు. డబ్బే ముఖ్యం''

"లావణ్య ఇపుడు మన పిల్లకాదు. ఇంకొకరి భార్య. అతనికేది ముఖ్యమైతే తనకీ అదే ముఖ్యమనుకుంటుంది" అంది రోహిణి.

"లావణ్య అలా అనుకోవడం సహజం. వసంత తన శక్తంతా పెట్టి నీకు భర్తే ముఖ్యం అనే విషయం నూరిపోసి వుంటుంది- ఔనా?" వసంత ఔనన్నట్లు తలాడించింది.

"మనం కూతుళ్ళం, చెల్లెళ్లం, భార్యలం, తల్లులం అని తప్ప మనుషులం అని గుర్తుంచుకోం.

చిన్నప్పుడంతా అమ్మానాన్నలకూ, అన్నదమ్ములకూ చెడ్డపేరు తేకూడదనే ప్రయత్నిస్తాం.

తర్వాత భర్తను సుఖపెట్టాలి. పిల్లల్ని పెంచాలి. దీంతో జీవితం పూర్తవుతుంది.

వసంతా నీకు గుర్తుందా. మీ ఇంటి పక్కన కళ్యాణిని వాళ్లనాన్న ఒకరోజు ఎలా కొట్టాడు"

వసంతకు గుర్తొచ్చింది.

కళ్యాణి ఒకరోజు కాలేజీనుంచి వస్తుంటే ఎవరో ఒకతన్ని పక్కకు పడేసి ఓ టాక్సీ దూసుకుపోయింది. అతని కాలికి పెద్ద దెబ్బ తగిలి లేవలేకపోతున్నాడు. రోడ్డు మీద ఎవరూలేకపోవటంతో కళ్యాణి అతన్ని లేపి అతను కాలు విదిలించుకుని రక్తాన్ని ఆపటానికి కర్చీఫ్ అడ్డుపెట్టుకునేవరకూ ఊతంగా నిలబడింది. రిక్షా పిల్చి అతన్ని ఎక్కించి ఆసుపత్రికి పంపి తను ఇంటికి వచ్చేసింది.

అదంతా కళ్యాణీ వాళ్లింటి పక్కాయన చూశాడు. అతను కళ్యాణి తండ్రికేం చెప్పాడో గాని ఆ రాత్రి ఆయన కళ్యాణిని గొడ్డును బాదినట్లు బాదాడు.

"పరాయి మగాడిని రోడ్డుమీద కావలించుకుంటావా? మద పిచ్చెక్కిందా" అని తిట్టాడు. కళ్యాణి చెప్పేది వినిపించుకోలేదు.

తన కూతురు తన పరువు నిలబెట్టాలి గానీ పరాయి మనిషి ప్రాణం నిలబెట్టగూడదని ఆయన గాఢనమ్మకం.

ఆడపిల్లల్లో ఆడలక్షణాలే గానీ మానవతా లక్షణాలు ఉండగూడదని ఆయన ఉద్దేశం.

ఆయనకే గాదు ఈ దేశంలో లక్షలమంది తండ్రులకూ, అన్నలకూ, భర్తలకూ, కొడుకులకూ అదే అభిప్రాయముంది. ఆడవాళ్లకు ఆడలక్షణాలుండాలి.

ఆ లక్షణాలన్నిటితో ఆడవాళ్ళు తమ మగవాళ్ల పరువు ప్రతిష్టలు కాపాడాలి. వాళ్లకు సేవలుచెయ్యాలి. కళ్యాణితోపాటు రమ, రాణీ, వీణ, శారద, వరలక్ష్మి అందరూ గుర్తొచ్చారు.

వాళ్ల వాళ్ల చదువులు ఆగిపోయిన విధం గుర్తొచ్చింది. బి.ఎ. మొదటి సంవత్సరం చదువుతున్న వరలక్ష్మికి ఒకబ్బాయి ప్రేమలేఖ రాశాడు. వరలక్ష్మి చాలా సంతోషపడింది. నలుగురైదుగురు స్నేహితులకు చూపించింది. శాంతా, రోహిణీ ఆ ఉత్తరానికి జవాబు రాయమని ప్రోత్సహించారు. ఆ అబ్బాయి అందరికీ తెలుసు. ఎ.సి కాలేజీలో బి.యస్‌సి మూడో సంవత్సరం చదువుతున్నాడు. ఆ కాలేజీ డ్రమెటిక్ అసోసియేషన్ సెక్రటరీ. అందంగా ఉంటాడు. అందరికీ అతనంటే ఇష్టం. అలాంటివాడు తనను ప్రేమిస్తున్నాడంటే వరలక్ష్మి గర్వపడింది. స్నేహితులు సంతోషించారు.

ఆరోజు రాత్రి వరలక్ష్మి సుందర్రావుకి ప్రేమలేఖ రాసింది. ఆ అమ్మాయి తన మనసుని స్వేచ్ఛగా పోనిచ్చి చేసిన మొదటిపని అదేనేమో. ఆ ఉత్తరం మర్నాడు ఎలా వెళ్ళిందో గాని వాళ్ల నాన్న చేతిలోకి వెళ్ళింది.

ఆడపిల్లల నోటు పుస్తకాలూ, బ్యాగులూ తనిఖీచెయ్యటం చాలామంది తండ్రులకూ, అన్నలకూ హాబీ.

ఆయన సుందర్రావు రాసిన ఉత్తరం కూడా తెప్పించి చూశాడు.

ఆ తర్వాత వరలక్ష్మి కాలేజీకి రాలేదు. నాలుగైదు నెలల్లో పెళ్లయిపోయింది.

పెళ్ళికివచ్చిన శాంత చేతికి ఓ ఉత్తరం యిచ్చింది వరలక్ష్మి.

"ఈ ఉత్తరం మానాన్న కళ్లబడటంవల్లే ఇదంతా జరిగింది. ఈ ఉత్తరంలో నేను రాసిందంతా నిజమని సుందర్రావుతో చెప్పు. నా పరిస్థితి చెప్పు. అంతనంటే నాకు చాలా ఇష్టమని చెప్పు" అని ఏడ్చింది వరలక్ష్మి.

స్నేహితులందరికీ చాలా కోపంవచ్చింది గానీ ఏంచెయ్యగలరు?

పెళ్ళిజరిగిపోయింది.

వరలక్ష్మి ఏంచేసింది. ప్రేమలేఖ




రాయటం తప్పా? పోనీ తప్పే అనుకుందాం. ఒక్క తప్పుకి ఆమె జీవితం తల్లకిందులవాల్సిందేనా?-

రోహిణీ, శాంతా ఆ విషయం గుర్తుకు తెస్తే వసంత కొత్తగా విన్నది.

"నేను మర్చిపోయాను. కానీ నాకు భయంగానే ఉండేదే - లావణ్య ఎవర్నయినా ప్రేమించానంటుందేమోనని. నవత విషయంలో నాకు రూఢీ - అది ఎవర్నోఒకర్ని ప్రేమించి తీరుతుంది"

"నువ్వు తల్లి పాత్రలో కూడా బాగా ఇమిడిపోయావు. ఆ వేషాలన్నీ ఒదిలెయ్. ఒక మనిషిగా బైటికిరా" అంది శాంత. వాళ్ళిద్దరివంకా చూసి నిస్సహాయంగా నవ్వింది వసంత.

★ ★ ★

నవత వస్తుందంటే వసంతకు సంతోషంతోపాటు భయంగా కూడా ఉంది. నవత వాళ్లనాన్నతో మాట్లాడివస్తుంది. ఈవిషయంలో ఏదో ఒకనిర్ణయం చేసుకొస్తుంది అనే నమ్మకం ఉంది. దానితోబాటు తనను విమర్శిస్తుంది, అలా వుండాలి, ఇలా వుండాలి అని ఏవేవో చెబుతుంది అనేభయం కూడా ఉంది.

'నవత తండ్రికి బుద్ధిచెబితే-
తనను హైద్రాబాదుతీసుకెళితే-
సురేష్ తన తప్పు తెలుసుకుంటే-

ఎంతబాగుంటుంది- నవత ఆపని చెయ్యగలుగుతుంది. నవతమాట సురేష్ కాదనడు. నవతంటే అతనికి ప్రాణం- ఆ ప్రాణం కోరితే అతను ఏదీ కాదనడు. నవత ఈపని చెయ్యగలిగితే జీవితాంతం దానికి ఋణపడివుంటాను'- అనుకుంటూ ఆశల్ని అరికట్టలేకా, ఇలా జరగకపోతే ఎలా అనేభయాన్ని జయించలేకా సతమతమవుతోంది వసంత. శాంతా రోహిణీ చెప్పేమాటలు నిజమేనని అంగీకరిస్తున్నా అవన్నీ తనకు కాదనిపిస్తోంది వసంతకు. ఆడవాళ్లు ఆత్మగౌరవంతో ఉండాలి. నిజమే. కానీ తనకు తన ఇల్లుకావాలి. ఆ ఇంట్లో సురేష్ భార్యగా కాకుండా ఇంకొకలా ఎవరూ లేనిదానిలా మొగుడొదిలేసినదానిలా మొగుడిని వదిలేసినదానిలా బతకటం అనవసరం అనిపిస్తోంది.

అక్కడికీ వుండబట్టలేక ఈమాట రోహిణితో అనేసింది. రోహిణికి బాగా కోపమొచ్చినట్లుంది.

"నువ్వు నీ భర్తతో కలిసి సుఖంగా ఉండాలనుకోవటంలో తప్పులేదుగానీ- దానికోసం మొగుడు వదిలేసినవాళ్లనీ మొగుణ్ణి వదిలేసినవాళ్లనీ చులకనగా చూడకు. అది మంచిదికాదు" అంది సీరియస్‌గా.

"నేనెందుకు చులకనగా చూస్తాను" అంది వసంత తన తప్పు తెలుసుకుంటూ.

"నీమాటల్లో అదేవుంది. నీభయం లోకం నిన్నెలా చూస్తుందోనని. నీకు సురేష్‌మీద ప్రేమవుంటే అతనికోసం బాధపడు. లోకం గురించి బాధపడకు. భర్తలు ఒదిలేసిన భార్యలందరూ పనికిమాలినవాళ్ళనీ, బజారుమనుషులనీ అనుకోకు. ఎవరిపరిస్థితులు వాళ్లకుంటాయి. ఆడవాళ్లని భర్తల హోదాతో గుర్తించటం మానేసేదాకా ఆడవాళ్లకు విముక్తిలేదు" అంది కోపంగా.

★ ★ ★

నవత వచ్చింది. నవత ఏం చెబుతుందోనని దడదడలాడే గుండెలతో కూచుంది వసంత. తల్లినీ రోహిణీవాళ్లనూ పలకరించి ముఖం కడుక్కుని వచ్చింది నవత.

వసంత కూతురికి కాఫీ ఇచ్చి తనూ ఓ కప్పు తీసుకుని పక్కనే కూచుంది.

"అమ్మా- వైజాగ్‌లో నాహాస్టల్ రూం ఖాళీ చేశాను" అంది నవత.

"ఎందుకనీ" అంది వసంత పెద్ద ఆసక్తి లేకుండా.

"చిన్నఇల్లు తీసుకుందాం. రెండుమూడు గదుల ఇల్లు చూడమని మా ఫ్రెండ్స్‌కి చెప్పి వచ్చాను. మనిద్దరికీ రెండుగదులైనా సరిపోతాయి కదమ్మా" అంది నవత.

వసంత "మనిద్దరికా" అంటుండగానే-

"ఔనమ్మా... నాకు హాస్టల్లో ఏమీ బాగాలేదు. భోజనం నిద్రా ఏమీ కుదరటంలేదు. చదువూ సాగటంలేదు. అమ్మా...ఒక్క రెండేళ్లు నువ్వు నాకు కాస్త సహాయపడ్డావంటే ఆ తర్వాత ఎమ్.ఇ.కి హైదరాబాదు వచ్చేస్తాను"

"నవతా- మీనాన్న నన్ను వైజాగ్ తీసుకెళ్లమన్నాడా?" వసంత శక్తంతా కూడదీసుకుని

అడిగింది. ఆమెకి నవతమీద తను పెట్టుకున్న ఆశలు ఒట్టిదేనని తెలిసిపోయింది.

"నాన్న తీసుకెళ్ళమనలేదు. నేనే తీసుకెళ్తానని చెప్పాను. మనం వెళ్దాం అమ్మా"

"నవతా— మీ నాన్న ఏమంటాడే— నువ్వేమీ అడగలేదా? ఈవిషయం మాట్లాడలేదా? ఏమన్నాడు? ఆవిడను ఒదులుతాడా లేదా? అసలు నువ్వు మీ నాన్నతో మాట్లాడావా? మీ అక్కలాగా తప్పించుకున్నావా?" వసంత ఆవేశంగా అడిగింది.

"మాట్లాడాను" అంది నవత తలదించుకుని.

"ఏమన్నాడు?"

నవత మాట్లాడలేదు.

"చెప్పవేం. ఏమన్నాడు?"

"నువ్వక్కడ శాంతిగా ఉండలేవమ్మా నాన్న ఆమె స్నేహం మానెయ్యలేడు"

"స్నేహం మానెయ్యలేడూ?" వెర్రిగా చూసింది వసంత.

"ఊరుకోమ్మా- నువ్వు బాధపడకు. ఏం చెయ్యాలో నాకూ తెలియటంలేదు. నీమీద ప్రేమ లేదంటాడు నాన్న"

"ఇన్నేళ్ళు కాపురంచేసి ఇప్పుడు ప్రేమ లేదా- నాలో లోపం ఏంటి"

"నీలోపం అని కాదమ్మా- నాన్న ఆవిడను ప్రేమిస్తున్నాడు"

"ఛీ- సిగ్గులేకుండా నీతోకూడా ఆ మాట చెప్పాడా? ఎదిగిన కూతురితో తన ప్రేమలీలలన్నీ చెప్పుకున్నాడు"

"అమ్మా- నాన్న నాతో అన్ని విషయాలూ మాట్లాడాడు. ఇప్పుడు జరగాల్సిందేమిటో చూసుకోవాలిగానీ నాన్నను తిడితే లాభం ఏంటి"

"మీనాన్నను తిట్టగూడదా. ఇంత దుర్మార్గం చేసినా తిట్టకూడదా? చెప్పు... మీనాన్న దుర్మార్గుడు కాదూ?"

"నాన్న నీకు చాలా బాధ కలిగేవని చేశాడమ్మా. కానీ దుర్మార్గుడుకాదు. నాన్నమంచిమనిషి. ఈ పరిస్థితికి నాన్నెంత బాధపడుతున్నాడో నీకు తెలియదు"

నవత మాటలకు వసంతకు పిచ్చికోపం వచ్చింది- "బాధపడుతున్నాడా? ఎందుకు... నేను బతికేవున్నందుకా? మీ నాన్న దుర్మార్గుడు కాదు- నేనే... దుర్మార్గురాలిని. నన్ను వదిలెయ్యండి అందరూ ఒదిలెయ్యండి"

బిగ్గరగా అరుస్తున్న తల్లిని గుండెలకదుముకుంది నవత.

"అమ్మా - ఊరుకో. నీకేం ఫరవాలేదు. నేనున్నాను" అంటున్న నవతనుంచి దూరంగా జరిగి " మీనాన్న మంచివాడుగా- ఆయనదగ్గరికే పో- నాబాధ నీకెందుకు? నామీద ప్రేమలేదుట- నేను మీనాన్న భార్యనే- కాదా? చెప్పు- భార్యనికాదా?"

"భార్యవే- భార్యని ప్రేమించాలని లేదుగా అమ్మా"

"భార్యని ప్రేమించక మరెవర్ని ప్రేమిస్తారే- అందరు భార్యాభర్తలూ ప్రేమగా ఉండటంలేదూ?"

"నువ్వింకా భార్యాభర్తలందరూ ప్రేమించుకుంటారని నమ్ముతున్నావా అమ్మా- నాకైతే భార్యాభర్తలందరూ రాజీపడి ఎలాగోలా బతుకుతున్నారనిపిస్తుంది"

"రేపు నీకు పెళ్ళయితే - " వసంత మాటల్ని ఆపేస్తూ నవత:

"నేను పెళ్ళి చేసుకోను. నాకు పెళ్ళంటే అసహ్యం. మొగాడి ప్రేమకోసం ఏడుస్తూ జీవితం గడపను" నవత కోపంగానే అయినా స్థిరంగా పలికింది.

"అనుకున్నంతా అయింది" అనుకుంది వసంత. నవతతో మాట్లాడి లాభంలేదు. ఈ ఆశకూడా పోయింది. ఇక ఏ ఆశాలేదు. నవతతో వైజాగ్ వెళ్ళమని సురేష్ ఉద్దేశం.

వసంత కుప్పకూలిపోయింది.

తర్వాత రెండురోజులు ఎవరెన్ని చెప్పినా వసంత వినలేదు. మంచంమీదనుంచి లేవలేదు. తల్లిపక్కన కూచుని ఆమె విన్నా వినకపోయినా ధైర్యం చెప్పటం మానలేదు నవత.

మూడోరోజుకి వసంత వదిన లక్ష్మి వచ్చింది. ఆమెకు పరిస్థితంతా తెలిసింది.

నవతతో వసంత వైజాగ్ వెళ్ళబోతోందని సురేష్ చెబితే గుంటూరు వచ్చింది.

రాగానే మంచంమీద కూచున్న వసంతను కావలించుకుని భోరుమని ఏడవబోయింది.




నవత "ఊరుకో అత్తా... ఇప్పుడేమ యిందనీ- అమ్మకనలే బాగోలేదు" అంటూ లక్ష్మిని బలవంతంగా విడదీసి కూచోబెట్టింది.

"ఏమయిందేమిటి... మీనాన్న ఎంతపనిచేశాడు. మీ మామయ్యకి రెండ్రోజుల్నించీ అన్నం సహించటంలేదంటే నమ్ము. ఇప్పుడు నాకీ పెళ్ళాం అక్కర్లేదంటే పోవటానికి ఇదేం బొమ్మలాట అనుకున్నాడా?" అంటూ ఆపకుండా సురేష్‌ని తిట్టటం ప్రారంభించింది. చివరకు "ఇట్లా వదిలేస్తే ఎట్లా. ఇన్నాళ్ళూ కాపురంచేసి ఇప్పుడొద్దంటే పోవటమేనా - అతన్ని అట్లా వదిలెయ్యటమేనా?" అంటూ కూచుంది.

"ఏంచేద్దాం?" అన్నారు రోహిణి, నవత.

"మనోవర్తి కోసం కోర్టుకెళ్ళాలి. ఆస్తంతా ముందు స్వాధీనం చెయ్యమనాలి. అప్పుడు తెలుస్తుంది ప్రేమ సంబడం" అంది అక్కసుగా.

"నాన్న ఆస్తంతా మా ముగ్గురికే రాశారు. పొలం నాకూ అక్కకూ సమానంగా ఇచ్చారు. ఇల్లు అమ్మపేరుమీదే ఉందిగదా - నెలనెలా తనకొచ్చే జీతం ముగ్గురికీ సమానంగా పంపుతానన్నారు. అక్కకు ఇపుడు నాన్న పంపక్కర్లేదుగా" అంది నవత.

లక్ష్మి తెల్లబోయింది.

"అవన్నీ ఒట్టిమాటలు- ఇప్పుడు గండం గడవటానికి చెప్పి ఉంటాడు. ముందు రాయించుకోవాలి"

"అవన్నీ రాయించేశాడు అత్తా. లావణ్యా మనోహర్‌లు తమవాటా అడిగారట. 'అప్పుడే నాన్న అందరిగురించి ఆలోచించి అన్ని ఏర్పాట్లూ చేశాడు"

లక్ష్మికి ఏం చెయ్యాలో తెలియలేదు.

"ఆస్తి ఇస్తేనేరా- మొగుడొదిలేశాడు అనే అపవాదు నెత్తినవేసి. అసలు దాంతో ఎట్లా ఉంటాడు- అతని అంతుచూడాలి. రేపు మేనత్తను మొగుడొదిలేశాడంటే నాపిల్లల పెళ్ళిళ్ళు అవుతాయా" అంది లక్ష్మి గొంతులో జీర తెచ్చిపెట్టుకుంటూ.

"అత్తా... మానాన్ననలా అంటే నాకు బాగోదు. నాదగ్గర అలా మాట్లాడొద్దు" అంది నవత.

"అబ్బో- తండ్రిమీద ప్రేమ ఒలికిపోతోంది. అసలు దీనికేం చెయ్యాలో నేను చెబుతాను. మనం హైద్రాబాదు వెళ్దాం పద" అంది వసంతతో.

వసంత "నేనురాను" అంది.

"రాక- ఎక్కడుంటావు? అపనిందయినా అవమానమైనా కడుపులో పెట్టుకునేది మేమేగా"

"అమ్మ నాదగ్గర వుంటుందిలే అత్తా... నువ్వు ఊరుకో" అంది నవత.

"కొన్నాళ్ళు తనని ప్రశాంతంగా ఇక్కడే ఉండనివ్వండి" అంది రోహిణి.

"ఇంకెక్కడి ప్రశాంతత. జీవితం సర్వనాశనమైతే" లక్ష్మి రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది.

విశాఖపట్నం వెళ్ళేసరికి ఉదయం తొమ్మిది గంటలయింది. నవత సామాన్లుదించి ఆటో మాట్లాడింది. ఇద్దరూ మహారాణిపేటలో వాళ్ల కోసం కుదిర్చిన ఇంటిగురించి ఆలోచిస్తూ ఆటోలో కూచున్నారు.

వాళ్ళు వెళ్ళేసరికి ఇల్లు సామానుతో శుభ్రంగా సర్ది ఉంది. మూడుగదుల ఇల్లు అది. గదులు వరుసగా ఉన్నాయి. చివరిగది వంటగది. వంటగదిలో నుంచుంటే సముద్రం కనిపిస్తుంది.

ముందుకి వస్తూ వెనక్కిపడుతూ ఉన్న కెరటాలను చూస్తూ నిలబడింది వసంత.

"ఈ ఇల్లు చాలుగదమ్మా మనిద్దరికీ-నీకు నచ్చిందా?" అనడిగింది నవత.

"చాలుగానీ- ఈ సామానంతా ఎక్కడిది? ఎవరు సర్దారు... ఫాన్లు కూడా బిగించారు"

'నాన్న అన్నీ ఏర్పాటు చేశాడ'ని చెబితే అమ్మ అభిమానపడుతుందని నవత-

"నా స్నేహితులు ఉన్నారుగా- వాళ్లకి ఉత్తరం రాశాను. అన్నీ సిద్ధం చేసేశారు" అంది.

"అమ్మా... ఇవాళ వంటవద్దు. ఈపక్కే మాస్నేహితుల ఇల్లు. అక్కడికి రమ్మని మరీ మరీ చెప్పారు. ఇంకాసేపట్లో వాళ్ళొచ్చేస్తారు" అంది స్నానానికి సిద్ధమవుతూ

"నేనెవరింటికీ రాను" అన్న వసంతను




బతిమాలీ బతిమాలీ బయల్దేరదీసింది.

"వాళ్లందరూ మీ నాన్న గురించి అడిగితే ఎలాగే?" బేలగా అడుగుతున్న తల్లిని చూస్తే జాలేసింది నవతకు.

"అమ్మా... వాళ్లంతా నా స్నేహితులు. వాళ్లకు నా సంగతులన్నీ తెలుసు. ఎవరూ ఏమీ అడగరు. నువ్వురా"

"అన్నీ చెప్పేశావా? నేను రాను- నన్ను బలవంతం చెయ్యకు" అని వసంత ఆగిపోయింది.

"అమ్మా... వాళ్లంతా మంచివాళ్ళు. నువ్వంటే చాలా ఇష్టపడతారు చూడు"

"నేనంటే ఇష్టం ఎందుకే- మొగుడొదిలేసిన వాళ్లను ఇష్టపడటం ఫాషనా?" కఠినంగా అంది వసంత. తనను చూసి అందరూ జాలి పడుతున్నారనుకుని ఆ జాలిని కఠినంగా ఎదుర్కోవాలని చూస్తున్న తల్లిని నిస్సహాయంగా చూసింది వసంత.

ఇంతలో తలుపు మోగింది. నలుగురు యువకులు గబగబా లోపలకు వచ్చేశారు.

వసంత కంగారుగా లేచి నిలబడింది.

నవత "మీరు వచ్చేశారా? మాకు కాస్త ఆలస్యమయ్యేలా ఉంది. అరే- కారియర్ తెచ్చారా?" అంటూ వాళ్లచేతుల్లో టిఫిన్లు అందుకుంది.

"మా అమ్మ" అంటూ వసంతను చూపించింది.

"అమ్మా... అతను శ్రీనివాస్. అతను గోపి. అతను రమణమూర్తి, అతను శర్మ. శ్రీనివాస్ గోపి ఇంజనీరింగ్- నాకన్నా ఓ సంవత్సరం సీనియర్. రమణమూర్తి ఎమ్మెస్సీ రెండో సంవత్సరం చదువుతున్నాడు. శర్మ హౌస్‌సర్జను" అని అందర్నీ పరిచయం చేసింది.

వసంత చేసేదేంలేక అందర్నీ కూచోమంది.

"అమ్మా... వీళ్ళు మనముందు వీధిలో ఓ ఇల్లు తీసుకుని ఉంటున్నారు. వీళ్లకు వండిపెట్టటానికి ఒక వంటాయన ఉన్నాడు. వీళ్ళు రూంలో వుంటున్నారంటే ఊరుకోరు. మాది ఇల్లు అంటారు. మీ రూంకి వస్తానన్నాననుకో- రావొద్దు- మా ఇంటికైతేనే రా అంటారు"

నవత మాటలు పూర్తవకుండానే వసంత లోపలి గదిలోకి వెళ్ళిపోయింది.

ఇక్కడ ఏమేం చూడాలో, ఈ నవతనెట్లా దారిలోపెట్టాలో అనే భయం పట్టుకుంది వసంతకు. ఫ్రెండ్స్ అంటే ఆడపిల్లలనుకుంది తను. నలుగురూ అబ్బాయిలు. తన క్లాసువాళ్ళుకాదు. ఎట్లా స్నేహందీనికి- ఇది ఇక్కడ ఏం చేస్తోంది? ఇదంతా ఎట్లా తెలుసుకోవాలి. సురేష్‌కి తెలిస్తే ఏమంటాడు. తనలా తయారయ్యాడుగా- ఇక దీన్ని ఏమని అదుపు చేస్తాడు- నాన్న దగ్గర అలుసు చూసుకుని ఇదిలా చేస్తోందా- ఎలాగైనా పిల్లను అదుపులో పెట్టాలి- అనుకుంది వసంత.

కొత్త బాధ్యత కొత్త కర్తవ్యం వసంతకు కాస్త శక్తినిచ్చాయి. నవత వాళ్లను పంపి తలుపు లేసి వచ్చేసరికి వసంత భోజనానికి సిద్ధంచేసింది. ఆ సాయంత్రం ఇద్దరమ్మాయిలు వచ్చారు. "శోభ", "వీణ" అని పరిచయం చేసింది నవత. ఆడపిల్లల్లోకూడా స్నేహితులు న్నారన్నమాట- అనుకుని కాస్త బరువు దించుకుంది వసంత. వాళ్లు ముగ్గురూ కబుర్లు చెప్పుకుంటుంటే దగ్గరే కూచుని విన్నది.

తరచు అబ్బాయిల పేర్లు రావటం, ఏవేవో పుస్తకాల గురించి అర్థంకాకుండా మాట్లాడుకోవటం చూస్తే వసంతకు తెలియని దిగులువట్టుకుంది.

"ఏమిటే- మీ మాటలు నాకర్థం కావటం లేదు" అని రాత్రి పడుకోబోయేముందు మాట్లాడబోతే- "ఇప్పుడేగామ్మా వచ్చావు. నెమ్మదిగా అన్నీ అర్థమవుతాయి. అందరూ పరిచయమవుతారు. నిద్రొస్తోంది" అంటూ ముసుగుపెట్టేసింది నవత.

★ ★ ★

వసంత నిస్సహాయంగా మంచం మీదపడుకుని ఉంది. ముందుగదిలో ఇరవైమంది కిక్కిరిసి కూర్చుని ఉన్నారు. అమ్మాయిలూ అబ్బాయిలు అంతా కలగలిసి కూర్చుని మాటాడుతున్నారు. ఉదయం పదకొండు గంటల నుంచీ ఆ మాటలు సాగుతూనే ఉన్నాయి.

మధ్యలో ముగ్గురు అమ్మాయిలు వంటగదిలోకెళ్ళి టీ కాచి తీసుకెళ్లారు.

నవత లోపలికి రానేలేదు.

"ఏంచేస్తున్నారు వీళ్ళంతా. ఈ మీటింగులేమిటి? ఈ కేకలేమిటి. ఎవర్నో చంపబోయేవాళ్ళ్లే ఈ ఆవేశాలేమిటి" వసంతకేమీ అర్థం కావటం లేదు. సాయంత్రం ఐదింటికి అందరూ ఎవరిదారిన వాళ్ళు వెళ్ళాక నవత అలసటగా వచ్చి మంచం మీద పడుకుంది.

"ఈ జాతర ఏమిటే?" అంది వసంత కోపంగా.

"రేపట్నించి పాలిటెక్నిక్ కాలేజీలన్నీ సమ్మె చేస్తున్నాయమ్మా. ఆ విషయాలు మాట్లాడుకోటానికి మా యూనియన్ వాళ్ళందరం ఇక్కడ సమావేశం అయ్యాం. నేను స్టూడెంట్ యూనియన్‌లో మెంబర్‌గా చేరానమ్మా. రెండేళ్ళనుంచీ దాన్లో పని చేస్తున్నా. అందుకని మన ఇంట్లో ఇలాంటి మీటింగులు తప్పవు" అంది నవత.

"సమ్మె చెయ్యటం ఎందుకు?" అయిష్టంగా అడిగింది వసంత.

"పాలిటెక్నిక్ అయ్యాక ఇంజనీరింగ్‌లో వీళ్ళకు కొన్ని సీట్లు కావాలని అడుగుతున్నారు. ప్రభుత్వం ఇవ్వనంటోంది. అందుకని సమ్మె చేసి ఆ సీట్లు సంపాదించాలి"

"పాలిటెక్నిక్ వాళ్ళ సమ్మెతో నీకేం పని?"

"అందరం విద్యార్థులమేకదమ్మా. వాళ్ళ సమ్మెకు మేం సహాయపడితే మాకు సమస్యలొచ్చినపుడు వాళ్ళు సహాయపడతారు"

"అందరూ కలిసి సంవత్సరమంతా కాలేజీలు మానెయ్యవచ్చు"

"కాలేజీలు మానేస్తే మాకే కదమ్మా నష్టం"

"అది మీకు తెలిస్తే లేనిదేం ఉంది- నేను చదువుకునే రోజుల్లో కాలేజీలో ఏ సమ్మె జరగనీ నేను మాత్రం క్లాసులు మానేదాన్నికాదు" అంది గర్వంగా వసంత.

నవత కిలకిలా నవ్వి వసంతను కావలించుకొని- "బుద్ధిమంతురాలివన్నమాట-" అంది.

"చాల్లే... ఊరుకో చిన్నపిల్లలా-" వసంత నవ్వు ఆపుకోటానికీ, కోపం తెచ్చుకోటానికీ ప్రయత్నించింది.

తల్లిని మాటల్లో పడెయ్యాలని నవత-

"నువ్వు చదువుకునేరోజుల్లో ఎందుకు సమ్మె జరిగిందమ్మా?" అని అడిగింది.

"ఎందుకో అందుకు- సమ్మెలు జరగకుండా ఉంటాయా-

నేను బి.ఏ మొదటి సంవత్సరంలో ఉండగా పెద్ద సమ్మె జరిగింది. హోటల్ రేట్లు పెంచారని కాబోలు. మా కాలేజీ అమ్మాయే అరుణ అని ఉండేది- నిరాహారదీక్ష చేసింది. చాలారోజులు చేసింది. చివరకు హోటలు రేట్లు తగ్గించారు.

ఆరోజు అరుణ అనే అమ్మాయిని లారీ మీదో, కారు మీదో ఎక్కించి విద్యార్థులంతా పెద్ద ఊరేగింపు తీశారు. ఆ పిల్ల చాలా గొప్పదని రోహిణీ, కాదని నేనూ రెండురోజులు దెబ్బలాడుకున్నాం-

అసలు నేచదువుకునే రోజుల్లోనేగా ఉక్కు ఉద్యమం. విశాఖ ఉక్కు, ఆంధ్రుల హక్కు అని ఒకటే గోల స్టూడెంట్లందరూ- మా కాలేజీ పిల్లల్లో అరుణ, ఝాన్సీ, మెడికల్ కాలేజీ ఉష, ఎ.సి.కాలేజీలో సరోజినీ, హేమలత అందరూ క్లాసు క్లాసూ తిరిగి ఉపన్యాసాలిచ్చేవారు- మేం వాళ్ళు క్లాసులు చెడగొడుతున్నారని తిట్టుకునే వాళ్ళం. ఆ తర్వాత ఏవో ఒకటి చేస్తూనే ఉండేవారు. ఎమ్.ఎన్.ఆర్ పద్ధతి మార్చాలనీ అదనీ- ఇదనీ-" గతంలోకి వెళ్ళిన వసంత చిత్రంగా అందులో లీనమయింది.

"మరి వాళ్ళు అలా చెయ్యకపోతే ఉక్కు ఫ్యాక్టరీ వచ్చేది కాదుగా అమ్మా"

నవత తల్లి లీనమవటాన్ని భగ్నం చేస్తున్నానని తెలియక అంది.

"ఏమో తల్లీ- నాకీ రాజకీయాలంటే భయం. ఈ రాజకీయాల్లో పడే గుంటూర్లో మా పక్కింటి డాక్టరు భాస్కర్రావు అన్యాయంగా చచ్చిపోయాడు. ఎంత మంచి మనిషాయన- ఆయన్ని చూస్తేనే తెలిసిపోయేది. ఆయన మంచితనం.

అట్లాంటాయన్ని చంపేశారు-

నువ్వింకా రెండురోజుల్లో పుడతావనగా ఆ వార్త పేపర్లో వచ్చింది.

అంతకుముందువాళ్ళు మీ అమ్మమ్మ వాళ్ళింటి దగ్గరే ఉండేవారు.

పేపర్లో ఆ వార్త చదివి మీ తాతయ్యా ఆరోజంతా అన్నం తినలేదు.

అయ్యో- ఆయన్ని చంపటం ఏమిటమ్మా





అని పదిసార్లు అనుకున్నాడు. ఆ రాజకీయాలు అలాంటివి''

"అమ్మా నువ్వు చెప్పేది చాగంటి భాస్కరావు గురించా?''

"ఏమో- అదేననుకుంటా వాళ్ళింటి పేరు- నీకెలా తెలుసు?''

నవత ఉత్సాహం పట్టలేక తల్లిని కావలించుకుంది.

"ఆయన నీకు తెలుసా? అబ్బ- నాకెంత కుళ్ళుగా ఉందో నీమీద-"

"నీకెలా తెలుసాయన?" వసంత ఆశ్చర్యంగా అడిగింది.

"ఆయన ప్రజలకోసం చచ్చిపోయాడు గదా అందుకని ప్రజలందరికీ తెలుస్తుంది. నేనాయన గురించి ఓ పుస్తకంలో చదివానులే-'' అంది.

నవత రాజకీయాల్లో తిరుగుతుందని తెలిసిన దగ్గర్నించీ వసంతకు కాలూచెయ్యీ ఆడనట్టుగా ఉంది. ఇంతకాలం నవత ఇంజనీర్ అవుతుంది, మహా అయితే ప్రేమించి పెళ్ళిచేసుకుంటుంది అనుకున్న వసంతకు ఈ విషయం మరింత ప్రమాదకరంగా కనిపించ సాగింది.

తను చెబితే నవత వినే స్థితి లేదు.

వాళ్ళ నాన్న చెబితే వింటుందేమో!

వాళ్ళ నాన్నకెవరు చెబుతారు? చెబితే అతనేం చేస్తాడు?

అతని మాటలు ఈ పిల్ల వింటుందా?

ఈ ప్రశ్నలతో వసంత బుర్ర నిండిపోయింది.

ఆమెకు తన జీవితంలో జరిగిన ప్రమాదం కంటే ఇది మరింత పెద్ద ప్రమాదంలా కనిపించసాగింది. చదువు పాడవుతుంది అనే దానికంటే ఈ రాజకీయాల్లో దిగి అన్యాయంగా చచ్చిపోతుంది అనే భయంతో ఆమె ఒణికిపోయింది.

★ ★ ★

వారంరోజులపాటు నవత పొద్దున్నే టిఫిన్‌తిని వెళితే మళ్లీ రాత్రి ఎనిమిదింటిదాకా వచ్చేది కాదు. ఎనిమిదింటికి వచ్చి తల్లితో ఆ రోజు జరిగిన విశేషాలన్నీ వివరంగా చెప్పేది. ఏఏ కాలేజీల దగ్గరకు వెళ్లిందీ – అక్కడ ఎం మాట్లాడిందీ?

ఏ నినాదాలిచ్చిందీ – తన స్నేహితులు ఏమన్నదీ – పోలీసులు ఎంతమంది వచ్చి ఎలా ప్రవర్తించిందీ అన్నీ చెప్పేది.

వసంతకు మనసులో భయంగా ఉన్నా నవత తనతో చెబుతున్న విషయాలన్నీ ఆసక్తిగానే వినేది. నవత ఆమెకొక కొత్త ప్రపంచాన్ని పరిచయం చేస్తోంది. ఆ ప్రపంచం ఆమెకు తెలియకపోవటంవల్ల భయంగా ఉన్నప్పటికీ ఆకర్షణీయంగా ఉంది. నవత అటువైపు వెళ్లకపోతే బాగుండునన్న ఆలోచనకూ, నవత చెప్పే విషయాలు తనలో కలిగిస్తున్న ఆసక్తికీ మధ్య నలిగిపోతోందామె. చివరకు నవత ఆ సంగతులు చెప్పకపోతే తనే అడిగి అన్నీ వివరంగా చెప్పించుకునే స్థితికి వచ్చింది. పేపర్లో పిల్ల సమ్మె వార్తలు చదవటం, వాటితోపాటు ఒకటి రెండు యితర వార్తలు చదవటం అలవాటయింది. నవత స్నేహితురాలు వీణ వచ్చి 'అమ్మా' అంటూ కబుర్లు చెబుతుంటే కాస్త ఉత్సాహం వచ్చేది. నవత స్నేహితులు ఎవరో ఒకరు వస్తూనే ఉండేవారు. ఏదో ఒకటి మాట్లాడుతూనే వుండేవారు. మొదట్లో వాళ్ల ఎదుట ఏడవకూడదనీ, విచారంగా వుండకూడదనీ బలవంతాన ఆలోచనలు నిగ్రహించుకుని వాళ్లతో మాట్లాడేది. క్రమంగా రోజులు గడుస్తున్నకొద్దీ ఆమె విచారంగా గడిపేకాలం తక్కువై పోయింది. నెలరోజులకు గాని సమ్మె పూర్తవలేదు. విద్యార్థుల కోరికలు కొన్ని ఒప్పుకున్నారు. కొన్ని ఒప్పుకోలేదు. ఒప్పుకున్నవి ముఖ్యమైనవి గాబట్టి సమ్మె విరమించారు. సమ్మె విరమించినరోజు మళ్లీ పాతికమంది దాకా వచ్చి ముందుగదిలో కూచున్నారు.

ఈసారి వసంతే టీ పెట్టి వాళ్లందరికీ ఇచ్చింది. ఆ పిల్లలందరూ పెద్దావిడ మన కోసం శ్రమపడి టీ చేసి తెచ్చి యిచ్చిందనే కృతజ్ఞతతో 'థాంక్స్' అంటూ కప్పులు అందుకున్నారు.

ఆ కొంచెం అభిమానానికే వసంతకు చాలా సంతోషంగా అనిపించింది.

'మా అమ్మ మంచిది' అంటూ నవత

వసంతను ముద్దుపెట్టుకుంటుంటే వసంతకు గర్వంగా, సిగ్గుగా అనిపించింది. అన్ని కప్పులు లేకపోవటంవల్ల కొందరు తాగి కప్పులు కడిగి ఇచ్చాక మరికొందరికి ఇవ్వాల్సి వచ్చింది. అందువల్ల వసంతకు నలుగురైదుగురితో కన్న చనువు పెరిగింది. నవతకోసం ఎక్కువగా వచ్చే వీణ, మాధవి, చంద్రకళ, శ్రీనివాస్, గోపీలు కప్పులు కడిగి తెస్తూ, వసంత టీ నింపి యిస్తే అందరికీ పంచుతూ వసంతను "అమ్మా" అంటూ పిలిచి దగ్గరయ్యారు. వాళ్లు టీ తాగిన తర్వాత ఆ గది గడపనానుకుని కూర్చుని చూస్తోంది వసంత.

అందరూ చర్చల్లో పడిపోయారు. అందరూ కలిసి ఈ సమ్మెకాలంలో కన్వీనర్‌గా పనిచేసిన కృష్ణమూర్తి మీద విమర్శ మొదలుపెట్టారు. ఒక్కొక్కరూ ఒక్కోరకం విమర్శ—

కరపత్రాలు ఆలస్యం అయ్యాయి –

కాలేజీల దగ్గరకు వెళ్లేటప్పుడు ప్లాన్‌లేదు – ఎవరు ఏ కాలేజీకి వెళ్లాలి అనేది ముందే నిర్ణయించుకోకపోవటంవల్ల అంతా గందరగోళమయింది. ఎవరికి ఏ బాధ్యతలు అనే విషయంలో స్పష్టతలేదు. ఎవరిష్టం వచ్చినట్లు వాళ్లు చేశారు. చెయ్యక తప్పలేదు. ఎవరికీ ఫలానా పని నువ్వు చెయ్యాలి అని స్పష్టంగా చెప్పలేదు. ఇలా రకరకాల విమర్శలతో కృష్ణమూర్తిమీద దాడిచేశారు. కృష్ణమూర్తి తప్పులు ఒప్పుకున్నాడు.

ఈ అనుభవంతో ఎలా చెయ్యాలో తనకు తెలిసిందన్నాడు. "అమ్మయ్యా – అయిపోయింది" అనుకుంది వసంత. ఆమెకు ఇదెంత పెద్ద పోట్లాట అవుతుందోనని భయంగా ఉంది –

ఇంతలో గోపాల్ అనే అబ్బాయి లేచాడు. "తప్పయిందంటే సరిపోతుందా? నష్టం జరిగింది గదా" అంటాడు.

"ఔను... జరిగింది. ఇకనుంచీ అలాంటివి జరగకుండా చూసుకోవాలి" అంటాడు కృష్ణమూర్తి.

"ఇప్పుడైతే జరిగింది గదా"

"ఔను"

"మరెలా?"

"ఎలాగేముంది – చేసేదేముంది"

"ఆమాట అనగానే సరిపోతుందా? మళ్లీ ఈసారి తప్పులు చేసి మళ్ళీ ఆ మాటే అనుకోవచ్చుగా"

"తప్పులు జరిగితే మరి అనుకోక తప్పేదేముంది"

"తప్పులు ఎందుకు జరుగుతున్నాయి?"

"అనుభవం లేక"

"కాదు... అవగాహనలేక శాస్త్రీయ అవగాహన లేక. మార్క్స్ ఏమన్నాడంటే" అంటూ మొదలెట్టిన గోపాల్ ఇక ఆపకుండా మాట్లాడటం సాగించాడు. వసంతకు ఏమీ అర్థంగాక విసుగొచ్చి లేచి వంటింటిలోకి వెళ్ళింది.

ఓ గంటకి ఆమె రాత్రి వంట పూర్తిచేసి బయటకు వస్తుండగా అందరూ లేచి వెళ్లారు.

వీణ మాత్రం ఉండిపోయింది.

ఇద్దరూ నవ్వుకుంటూ మాట్లాడుకుంటుంటే వసంత- "ఆ అబ్బాయేమిటే అలా మాట్లాడతాడు. నాకేం అర్థంకాలేదు" అంటూ వచ్చింది.

"సరేలే – మాకేఅర్థం కాలేదు. నీకెక్కడ అవుతుంది. ఈ సమ్మెకి నాయకుడుగా తనుంటే చాలా బాగాచేసేవాడినని అతని ఉద్దేశం" అంది నవత. "పోనీ – తనే ఇలా చేద్దాం అని చెబితే అట్లాగే చేసేవాళ్లంగా – ఎందుకు చెప్పలేదు? చెప్పినా మనం వినకపోతే అప్పుడనాలిగాని – ఇప్పుడు తప్పంతా మనదైనట్లూ, తనన్నీ తెలిసిన జ్ఞానిలా మాట్లాడితే....."

"నాయకత్వం లేకుండా పనిచెయ్యటం కొందరికి ఇష్టం ఉండదు" అంది నవత.

"అసలీ నాయకత్వం ప్రసక్తి లేకుండా- ఎవరోఒకరు చెప్పటం, మిగిలినవాళ్ళు చేయటం అనికాకుండా అందరూ కలిసి ఎవరేం చెయ్యాలో నిర్ణయించుకోవచ్చుగా. నేనిలా చేస్తాను అని చెప్పి చెయ్యవచ్చుగదా-"

"అప్పుడు ఎవరూ ఏమీ చేయకపోతే- ప్రతివాళ్ళూ వేరేవాళ్ళు చేస్తార్లే అని ఊరుకుంటే-"

"ఎవరూ ఏమీచేయకుండా ఎందుకుంటారు. ఈ సంస్థల్లోకి వచ్చేది ఏదో ఒక పని చేయాలనే తపన ఉన్నవాళ్ళేగదా- పనిదొంగలన్నట్లు మాట్లాడతావేం" అంది వీణ.




నవత నవ్వేసింది.

వసంత వాళ్ళిద్దర్నీ చూస్తూ కూచుంది.

వాళ్ళు రకరకాల కబుర్లు చెప్పుకుంటూ వసంతను కూడా నెమ్మదిగా వాళ్ళలో కలుపుకున్నారు. వసంతకు కథలూ, కబుర్లూ చెబుతూనే అన్నాలు పెట్టుకొచ్చారు. వీణ ఆరోజు అక్కడే ఉండిపోయింది.

"అమ్మా... మేమిద్దరం ఆ గదిలో పడుకుంటాం" అంటూ పక్కలు తీసుకెళ్ళి ముందుగదిలో వేసుకుంది నవత.

వసంత ఒక్కత్తే మిగిలిపోయింది.

'వాళ్ళిద్దరూ ప్రత్యేకంగా మాట్లాడుకోవాలి. తనుంటే ఇబ్బంది. తనతో మామూలు విషయాలన్నీ మాట్లాడుతుంది. ప్రత్యేక విషయాలు, తన మనసులోపలి విషయాలు మాత్రం తన స్నేహితురాలితో మాట్లాడుకుంటుంది. తనకలా ప్రత్యేకంగామాట్లాడుకోవటానికి ఎవరున్నారు? సురేష్ ఉంటే నవత ఇలా వీణ ఇలా అని చెప్పేదా? వాళ్ళగురించి తన ఆలోచనలన్నీ సురేష్‌తో చెప్పేదా- ఏమో- ఇన్నాళ్ళ సంసారంలో తను సురేష్‌తో పిల్లల గురించి ఏం చెప్పుకుంది?

తనెప్పుడన్నా పిల్లల గురించి మాట్లాడబోయినా వినిపించుకునేవాడు కాదు.

తనూ నవత గురించే చెప్పబోయేది.

"నవత గురించి దిగులుపడకు. అది చాలా తెలివిగలది" అని ముగించేవాడు.

పిల్లలకు బట్టలు కుట్టించాలనో, ఫలానా వస్తువు కొనాలనో చెబుతుంటే.

"అలాగే చెయ్యి. రేపు డబ్బు ఇస్తా"నంటూ నిద్రపోయేవాడు. లేదా దగ్గరకు లాక్కునేవాడు.

ఈనెలరోజుల్నించీ నవత చెప్పినట్లు సురేష్ తనకు ఏ విషయం గురించీ చెప్పలేదు. తన ప్రపంచం ఏమిటో తన ఆలోచనలేమిటో చెప్పలేదు.

నవత పరిచయం చేసినట్లుగా సురేష్ అతని ప్రపంచాన్ని తనకు పరిచయం చేయలేదు. మరెందుకు తనకీ ఒంటరితనం. ఆ పిల్ల తన వయసుకు తగ్గ ఆలోచనల్ని స్నేహితురాలితో చెప్పుకుంటుంటే తనకెందుకు బాధ. తన స్నేహితులతో తనూ చెప్పుకోవచ్చుగా' వసంత లేచి లైటేసి కలం కాగితాలు తీసుకుని రోహిణికీ, శాంతకు ఉత్తరాలు రాయటం మొదలుపెట్టింది.

"అమ్మా నిద్రపోవటంలా" కేకేసింది నవత.

"రోహిణత్తకు ఉత్తరం రాస్తున్నా- మీరుపడుకోండి" అంది రానుకుంటూనే.

వాళ్ళ గదిలో లైటారిపోయిన తర్వాత గంట సేపటివరకూ వసంత తన ప్రస్తుత జీవితాన్ని గురించీ, నవత గురించీ, నవత స్నేహితుల్ని గురించీ తన ఆలోచనలన్నీ రాసి తృప్తిగా నిట్టూర్చింది. ఆ తర్వాత నిద్రపోయింది.



ఆరోజు సాయంత్రం కాలేజి నుంచి వచ్చిన నవత తనకొచ్చిన ఉత్తరాలు చదువుకుంటుంటే కాఫీతెచ్చి ఇచ్చింది వసంత. మళ్ళీ వంటగదిలో పనేదో చక్కబెట్టుకుని ముందుగదిలోకి వచ్చేసరికి నవత ఉత్తరం పట్టుకుని మంచంమీద అడ్డంగా పడుకుని ఉంది. కాఫీ తాగనేలేదు.

"ఏంటి నవతా- ఎందుకలా పడుకున్నావు?" అంటూ దగ్గరకెళితే-

"ఏంలేదమ్మా... మా ఫ్రెండు ఉత్తరం రాసింది. నాకు ఏంబాగోలేదు" అంటూ లేచి కూచుంది.

"ఎవరు? ఏంరాసింది"

"రాజ్యలక్ష్మి అని- ఇక్కడే మాతోపాటు పనిచేసేది. బి.యస్సీ చదివింది. కంప్యూటర్ ట్రైనింగ్ కోసం మద్రాసువెళ్ళింది. ఆరునెలలయింది వెళ్ళి. నువ్వు చదువు. నేను స్నానం

చేసి వీణదగ్గరకు వెళ్ళొస్తా'' అంటూ లేచింది.

ఎన్నడూ లేనిది నవత ముఖం గంభీరంగా, ఆందోళనగా కనిపించటంతో వసంత ఆ ఉత్తరం వెంటనే చదవటం మొదలుపెట్టింది.

నవతా-

ఈ ఉత్తరం భయంకరమైన మానసిక స్థితిలో ఉండి రాస్తున్నాను. నేనిక్కడకు వచ్చి ఆరు నెలలయింది. ఈ అనుభవం కోసమే ఇక్కడకు వచ్చానా అనిపిస్తోంది. ఎలా రాయాలో కూడా నాకు తెలియటంలేదు. పదిరోజుల క్రితం నవీన్ ఇక్కడకు వచ్చాడు. తను అమెరికా వెళ్ళే ఏర్పాట్లు చూసుకోటానికి నాదగ్గరకే వచ్చాడు.

మీ అందరినుంచీ దూరమై ఆరునెలలయింది. మనుషులకోసం మొహం వాచి ఉన్నానేమో నవీన్‌ని చూడగానే ప్రాణంలేచివచ్చినట్లయింది. చాలా ఆనందంగా ఆహ్వానించాను. ఆరోజు శలవుపెట్టాను. ఇద్దరం కలిసి అతని పనుల గురించే తిరిగాం. పనులన్నీ పూర్తయి సాయంత్రం ఇంటికి తిరిగొచ్చాం. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపాం.

నాకు నవీనంటే ఇష్టమే. మంచిస్నేహితుడనీ, మంచి భావాలు గలవాడనీ, చాలా తెలివైనవాడనీ చాలా మంచి అభిప్రాయమే ఉంది.



నేను నవీన్‌ని ప్రేమిస్తున్నానా అని ఒకటి రెండుసార్లు నన్ను నేను ప్రశ్నించుకున్న సందర్భాలున్నాయి. ఐనా అప్పటి మనగ్రూపులో అందరితోనూ స్నేహం అలాగే ఉండేది. ఆ విషయం గురించి ఎప్పుడూ శ్రద్ధగా ఆలోచించనూ లేదు.

ఆ స్నేహంవల్లే అతనిగురించి ఏమాత్రం భయపడలేదు. నువ్వూ, నేనూ ఒకఇంట్లో వుంటే ఎలా వుంటుందో అలాగే ఫీలయ్యాను.

కానీ నవీన్ అలాలేదు. మేమిద్దరం కబుర్లు చాలించిపడుకున్న కాసేపటికి నవీన్- "నాకు భయంగా ఉంది" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయి "ఎందుకు" అన్నాను.

"ఇలా నీ పక్కనే పడుకుని నేను మామూలుగా ఉండగలనా? తెల్లవారి నిన్నెలా ఫేస్‌చెయ్యను? నాకు చాలా అశాంతిగా ఉంది" అన్నాడు. నా మనసూ శరీరం రెండూ చిత్రమైన భావనకు లోనయ్యాయి. హఠాత్తుగా అతను పురుషుడు, నేను స్త్రీని అన్న విషయం గుర్తొచ్చి శరీరం చిత్రంగా స్పందించింది. ఆ స్పందన అంతకుముందు నాకు అనుభవంలో లేదు.

అంతకుముందు ఒకరిద్దరు నన్ను ప్రేమిస్తున్నామంటూ విసిగించటమూ, పెళ్ళాడమంటూ అభ్యర్థించడం, నేను నవ్వుతూ తిరస్కరించటం ఇవన్నీ నీకు తెలుసు. ఎప్పుడూ నేనలా స్పందించలేదు. నవీన్ మీద నాకున్న గౌరవమో, స్నేహమో, ఉదయం నుంచీ అతనితో చనువుగా తిరిగినదాని ప్రభావమో - ఏదోకాని నా మనసు అతని మాటలకు చాలా అనుకూలంగా స్పందించింది.

నేనలాగే మాట్లాడకుండా పడుకున్నాను.

"మాట్లాడవేం" అన్నాడతను.

"ఏంమాట్లాడను" అన్నాను తెచ్చిపెట్టుకున్న విసుగుతో.

"ఏమన్నా జరిగితే"-

"ఏమీజరగదులే- పడుకో" అన్నాను నవ్వుతూ.

రెండు నిమిషాలు కాకుండానే అతను నా దగ్గరకు వచ్చేశాడు.

నా చేతిలో చెయ్యివేశాడు.

నేను అలాగే ఉన్నాను.

పెదవులమీద ముద్దుపెట్టుకున్నాడు.

నాతల గిర్రున తిరిగినట్లయింది.

నాకు తెలియకుండానే నేనతన్ని ముద్దుపెట్టుకున్నాను. ఇద్దరం కాసేపు మమ్మల్ని మేం మర్చిపోయాం. తర్వాత అతను 'సారీ' అని చెప్పబోతుంటే ఇంత మంచి అనుభవం తర్వాత 'సారీ' ఏమిటి అని నెత్తినమొట్టి మళ్ళీ ప్రేమగా ముద్దుపెట్టాను. తెల్లవారిన తర్వాత అతను ఏదోగానే ఉన్నాడు. చాలా అనీజీగా - వెళ్ళిపోటానికి సిద్ధమయ్యాడు. అతనింకా ఏదో మాట్లాడబోతాడని ఎదురుచూస్తున్న నేను చాలా ఆశ్చర్యపోయాను. అతను ఎక్కువ మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు.

అతనువెళ్ళి ఉత్తరం రాస్తాడని ఎదురుచూశాను. ఉత్తరం వచ్చింది.

ఆరోజు తను చాలాతొందరపడ్డాననీ - నన్ను పెళ్ళిచేసుకునే ఆలోచన తనకులేదనీ, తను 20న అమెరికా వెళ్తున్నాననీ రాశాడు. ఇవాళే 20వ తారీకు - అతను అమెరికా వెళ్తున్నాడు. నాకు చాలా అశాంతిగా ఉంది.

అతనికి నామీద ప్రేమ లేదు - అలాంటప్పుడు ఆరోజు అలా ఎందుకు ప్రవర్తించాడు?

నేను ఒక స్త్రీగా తప్ప స్నేహితురాలిలాగా ఎందుకు కనిపించలేదు?

నన్ను అలా అవమానించాలని అతనికెందుకు అనిపించింది? నన్నేమనుకున్నాడు?

నేను అతను నన్ను ప్రేమిస్తున్నాడని అంత గుడ్డిగా ఎలా నమ్మాను?

ప్రేమించకపోతే ఇలా ఎందుకు ప్రవర్తిస్తాడులే అన్న భరోసానా - అతను నా స్నేహితుడు, మంచివాడు అన్న నమ్మకమా?

లేక అతనూ నా కంటికి ఒక పురుషుడులాగానే కనిపించాడా?

నేను కూడా ప్రేమను గురించి పెద్దగా పట్టించుకోకుండానే ఆ నిముషాల ఆవేశానికి లొంగిపోయానా?

నేనతను ముద్దుపెట్టుకుంటుంటే వారించలేదు. పైగా ఆ ముద్దుని ఎంతో పరవశంతో అనుభూతిచెందాను. ఇప్పటికీ నాకా అనుభవం ఎంతో బాగుందనే అనిపిస్తుంది.





అతన్ని ఏమని నిందించాలో తెలియటంలేదు. అసలు నిందించాలో లేదో కూడా అర్థంకావటంలేదు. చాలా విచారంగా దుఃఖంతో నిండివుంది మనసు. ఈ అనుభవాన్ని ఎలా స్వీకరించాలో, ఎలా విశ్లేషించాలో, ఏం నేర్చుకోవాలో స్పష్టంగా తెలియకపోవటంవల్లనే ఈ అశాంతి -

ఒక మామూలు ఆడపిల్లలా అతను నన్ను మోసంచేశాడు అని అతన్ని తిట్టి ఏడ్చి తృప్తిపడలేకపోతున్నా.

నాది తప్పు అని నన్ను నేనూ తిట్టుకోలేకపోతున్నా.

కానీ అతను నన్ను చాలా అవమానించాడనే బాధ కోపం కలుగుతున్నాయి.

దానికి నేనే నా తెలివితక్కువతనంతో అవకాశం ఇచ్చానా అనిపిస్తోంది.

ఏమైనా నేను ఇన్నాళ్ళూ 'పెళ్ళిచేసుకోను' అని మాట్లాడుతున్న మాటలు బలహీనమైనవనీ - నా లోపల పురుషుడికోసం కోరిక ఉందనే విషయం తెలిసింది. ఈ అనుభవాన్నించి వచ్చిన అశాంతి తగ్గాక ఆ విషయం గురించి ఆలోచించాలి -

నీ అభిప్రాయం రాయి -

నీ

రాజ్యలక్ష్మి

వసంతకు ఉత్తరం పూర్తిచేశాక ఊపిరాడనట్లయింది.

ఎవరీ పిచ్చిపిల్ల- ఎంత అన్యాయమయిపోయింది. వాడు ఎంత తేలిగ్గా మోసం చేసి వెళ్ళిపోయాడు.

ఇప్పుడెలా- ఏం చేస్తుందో ఏమో- అయినా ఆ అమ్మాయి చాలా ధైర్యంగానే ఉంది. ఎంత తెలివిగలవాళ్ళయినా ఒక్కోసారి అలా జరుగుతుందేమో—

నవతకిలాంటిదేదైనా జరిగితే తను భరించగలదా—!

వసంత ఆలోచనల్లోంచి తేరుకోకముందే వీణ, ఆమె వెనుక రమణమూర్తి వచ్చారు.

ఇద్దరినీ ఆ ఉత్తరం చదవమంది నవత.

వీణ ఉత్తరం చదివి ఆలోచనలోపడింది.

"ఎంతపని జరిగింది—పాపం రాజ్యలక్ష్మి" అన్నాడు రమణమూర్తి ఉత్తరం మడుస్తూ.

"ఎందుకు జాలి పడుతున్నావ్—ఏం జరిగింది?" అంది నవత.

"ఏం జరిగిందేమిటి—అన్యాయమయిపోయిందిగదా—"

"అన్యాయమయిపోవటమేంటి—అతను ఒక అవమానం చేశాడు. అంతేగదా—"

"అవమానమేనా? అంతకంటే ఇంకేమీ కాలేదా?" రమణమూర్తి అసహనంగా అన్నాడు.

"నా దృష్టిలో అంతే"

"నా దృష్టిలో అంతేకాదు. ఆ అమ్మాయి జీవితం పాడయింది. ఒక మచ్చ పడింది. ఆ మచ్చ చెరిగేది కాదు. రేపు ఆమె పెళ్ళొక సమస్య అవుతుంది"

"మైగాడ్—నువ్వు ఇంకొక్కమాట మాట్లాడావంటే నా చేతిలో తన్నులు తింటావ్ రమణమూర్తీ. ఎంత నాన్సెన్స్‌గా మాట్లాడుతున్నావో నీకర్థంకావటంలేదు" నవత కళ్ళెర్ర చేసుకుంది.

"నీకే వాస్తవం అర్థం కావటంలేదు. ఒకసారి ఎవరో అనుభవించిన అమ్మాయిని పెళ్ళి చేసుకోవటం అంత తేలిక కాదు. నా మటుకు నేను పెళ్ళాడబోయే అమ్మాయి కన్యగా ఉండాలనుకుంటాను. నాతోనే ఆ అమ్మాయికి మొదటి అనుభవం కావాలనుకుంటాను"

"నువ్వు నోర్మూసుకుని బైటికి నడువు. నువ్వు ఇంకొక్క మాట మాట్లాడావంటే భరించలేను" అంటూ లేచింది నవత.

వీణ—"ఊరుకో నవతా- ఏంటది?" అంటూ నవతను పట్టుకుంది.

"మీ ఆవేశం చల్లారాక నిదానంగా ఆలోచించండి. నా మాటలు ఎంత నిజమో" అంటూ వెళ్ళబోయాడు రమణమూర్తి.

"రమణా—దయచేసి ఈ విషయాలు నువ్వు ఇంకెక్కడా మాట్లాడకు" అంది వీణ.

"ఏం...ఎందుకంత భయం- అయినా అంత సంస్కారంలేనివాడిని కాదులే" అంటూనే వెళ్ళిపోయాడు.

నవతకెందుకో ఆగకుండా దుఃఖం వచ్చింది.

వసంతా, వీణా,

"పిచ్చిదానివా మంచిదానివా? ఎందుకేడుస్తున్నావు?" అన్నకొద్దీ మరింత ఏడ్చింది.

"లేదమ్మా... నాకు చాలా బాధగా ఉంది. ఒక విషయం జరిగింది. రాజ్యలక్ష్మి దానిని అవమానంగా తీసుకుంది. నేనూ అంతే తీసుకున్నాను. కానీ రమణమూర్తి—చాలా సంస్కారవంతుడూ, అభ్యుదయభావాలుగలవాడు—సంఘాల్లో పనిచేస్తున్నవాడు ఈ విషయాన్ని ఎలా తీసుకున్నాడు?

రాజ్యలక్ష్మిని ఎన్ని మాటలన్నాడు?

పాడయింది, మచ్చపడింది, చెడిపోయింది, ఎవరో అనుభవించిన అమ్మాయి, నాకు కన్యకావాలి—ఎన్ని మాటలు... ఎంత సిగ్గులేకుండా మాట్లాడాడు.

ఆ అమ్మాయి జీవితమంతా ఆ ఒక్కరాత్రి మీదా ఆధారపడినట్లు.

ఇక వీళ్ళు చెప్పే కబుర్లూ—ఆదర్శాలు—ఇవన్నీ ఎంత చెత్త-

మగవాళ్ళు ఇలాగే ఆలోచిస్తారు అని తెలిసిన ఏ అమ్మాయైనా ఇలాంటి పని జరిగితే చచ్చిపోక ఏం చేస్తుంది?

నవీన్, రమణమూర్తీ—ఇద్దరూ అచ్చమైన మగాళ్ళు. వీళ్ళతో ఎంత అమాయకంగా స్నేహం చేశాం. తన గురించి లోకులందరూ ఏమనుకున్నా లెక్కచెయ్యని రాజ్యలక్ష్మి కూడా రమణమూర్తి మాటలు విని తట్టుకోగలదనుకోను.

చలం నవలలు, కుటుంబరావు కథలు చదివి చర్చించే ఇద్దరు మగాళ్ళు ఇలా ప్రవర్తించారు''

నవత తల పట్టుకు కూచుంది.

"వీళ్ళ గురించి బుర్ర పాడుచేసుకోకు. రాజ్యలక్ష్మి ధైర్యంగానే వుంది. దానికింకా ధైర్యం చెబుతూ ఉత్తరం రాద్దాం. వీలైతే మద్రాను వెళ్ళి దాన్ని ఇక్కడకు తీసుకొద్దాం. మనుషులు మారటమంటే తేలిక కాదు. ఓపిగ్గా మార్చాలి—''

వీణ నవత భుజంమీద చెయ్యివేసింది.

"నవీన్నీ, రమణమూర్తినీ ఓపికగా మార్చాలా?'' విస్తుపోయినట్లు చూసింది నవత.

"వాళ్ళేదో గొప్పవాళ్ళనుకోవటంలోనే ఉంది మన పొరపాటు. మిగిలిన విషయాల్లో ఏమో గానీ ఆడవాళ్ళ గురించి ఆలోచించటంలో వాళ్ళు చాలా వెనకబడి ఉన్నారు. మగవాళ్ళలా ఉన్నారు. వాళ్ళను మార్చాల్సిందే'' అంది వీణ.

"మార్పు- ఓపికుంటే'' అంటూ లేచివెళ్ళి పడుకుంది నవత.

రాజ్యలక్ష్మికి అప్పుడు జరిగిన అవమానంకంటే ఇప్పుడు రమణమూర్తి చేసిన అవమానం నవతనెక్కువ బాధిస్తోంది.

'జరిగిన విషయాన్ని భావజాలం ఎలా మార్చెయ్యగలదు. ఆ విషయం గురించి రాజ్యలక్ష్మి అవమానం అనుకుని బాధపడుతోంది.

రమణమూర్తి అదొక చెరగని మచ్చ అనుకుంటున్నాడు. అసలు రాజ్యలక్ష్మిలా, తనలా ఆలోచించటం అరుదు. సమాజమంతా రమణమూర్తిలాగానే ఆలోచిస్తుంది. ఆ ఆలోచన మారందే ఆ విషయానికున్న ప్రాధాన్యత మారదు.

మచ్చ - కన్య - శీలం - వీటి చుట్టూ అల్లుకున్న భావజాలం ఎంత దుర్భేద్యమయింది.

దాన్ని ఛేదించటమంటే ఎంతకష్టమో ఇవాళ తెలిసింది. రమణమూర్తి కూడా అలా మాట్లాడతుంటే— రాజ్యలక్ష్మి దగ్గరకు వెళ్ళాలి. తన అశాంతి తగ్గించటానికి ఏమైనా చెయ్యాలి.

ఈ ఆలోచనలతో ఆకలి కూడా మర్చిపోయింది నవత. అలాగే నిద్రపోయింది.

★ ★ ★

ఆటో దిగి ఇంటి నంబరు చెక్ చేసుకుంది నవత. ఆటో అతనికి డబ్బులు ఇచ్చేసి తలుపు తట్టబోతే దగ్గరికి వేసివున్న తలుపులు తెరుచుకున్నాయి. "రాజీ'' అంటూ పిలుస్తూ బ్యాగ్ కింద పెట్టిన నవతను పరిగెత్తుకుంటూ వచ్చి కావలించుకుంది రాజ్యలక్ష్మి. "నవతా... నువ్వొచ్చావా? ఎంత మంచిదానివి నవతా- నా కోసం వచ్చావా'' అంటూ కళ్ళనీళ్ళపర్యంతమయింది.

"బాగుంది— నువ్వయితేమాత్రం రావా? ఎలా వున్నావమ్మా?'' ప్రేమగా అడిగింది నవత.






# "యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ నాకు అవసరమైన సమయంలో సహాయం చేసింది... ఎంతో శీఘ్రంగాకూడా!



**అదృష్టవశాత్తూ, నేను ఎంతో ఎక్కువ ఖర్చుకాని వారి వ్యవసాయ పంపుసెట్ భీమా పాలిసి తీసుకున్నాను.**

అలా చేయడం నాకు ఎంతో మేలు చేసింది. నా పంపుసెట్ పాడయినప్పుడు దానిని బాగుచేయించుకోడానికి ఖర్చులు శీఘ్రంగా తిరిగి చెల్లించబడ్డాయి.

ఇప్పుడు, నా స్నేహితులెందరో నేను చేసినట్లే చేస్తున్నారు.

మీరు అలా ఎందుకు చేయకూడదు? అది ఖర్చుతో కూడిన పనికాదు."

## యునైటెడ్ ఇండియా వారి వ్యవసాయ పంపుసెట్ భీమా పాలిసీ

మీ పంపు సెట్టుకి యాంత్రిక/విద్యుత్ కారణాలుగా పనిచేయకపోవడం నుంచీ అగ్ని/మెరుపులు ప్రమాదం నుంచీ/ దొంగతనాల నుంచీ రక్షణ కలిగిస్తుంది. ఇంకా వివరాలకు, యునైటెడ్ ఇండియా కార్యాలయాన్ని గాని లేక మీ ప్రాంతంలోని వారి ఏజెంటును గాని సంప్రదించండి




**యునైటెడ్ ఇండియా ఇన్సూరెన్స్ కంపెని లిమిటెడ్**

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారి అనుబంధ సంస్థ)

24 వైట్స్ రోడ్, మద్రాసు 600 014.

HTA 7356

"బాగానే ఉన్నా- మనసులో పెద్ద యుద్ధం జరుగుతోంది. ఆ యుద్ధంలో విజయమో వీర స్వర్గమో తేలితే—"

"నీమొహం. యుద్ధంలేదూ ఏమీ లేదు. నువ్వు నవనరంగా ఫీలవుతున్నావు" అని నవత అంటుండగానే రాజ్యలక్ష్మి ఏడవటం మొదలు పెట్టింది.

"నీకేమన్నా పిచ్చా? ఎందుకేడుస్తావు..."

"నాకు చచ్చిపోదామనిపిస్తోందే" అంటూ మళ్ళీ బావురుమంది రాజ్యలక్ష్మి.

"తెలుగు సినిమాలోలా చేస్తున్నావు. నువ్వు సినిమాల ప్రభావంతో ఉన్నావా లేక తెలుగు సినిమాలే నహజంగా తీస్తున్నారా?" నవ్వించింది నవత.

"నరేలే— నీకంతా నవ్వులాటగా ఉంది"

"నవ్వులాట కాదుకానీ, నువ్వంత వర్రీ అయి ఏడవటం ఎందుకు? కాస్త తెలివి తక్కువగా, బలహీనంగా ఉన్నావు. అతను అది గమనించి నిన్ను అవమానించాడు. మరెప్పుడూ అలా ఉండకుండా జాగ్రత్తపడాలి"

"నన్నేమనుకున్నాడు నవతా— ఆ ప్రశ్న నన్ను చంపేస్తోంది. నన్ను గౌరవంగా చూడలేకపోయాడెందుకు, అతను నాదగ్గరకు వచ్చి ముద్దుపెట్టుకుంటుంటే ప్రేమ ఉండి అలా చేస్తున్నాడనుకున్నానుగానీ కేవలం ఒక్క రాత్రి అతని శరీరబాధను తీర్చుకునే సాధనంగా నన్ను భావించాడనే విషయం గుర్తొచ్చినప్పుడల్లా అవమానంతో దహించుకుపోతున్నాను. ఎట్లా చెయ్యగలిగాడాపని?

నేనంత చీప్‌గా కనిపించానా?

నాకు శీలం పోయిందనో మరొకటో బాధ లేదు... భయంలేదు. నా బాధంతా స్నేహాన్ని గురించి, ప్రేమగురించి, పరస్పర గౌరవాన్ని గురించి— ఇది ఎవరికైనా అర్థమవుతుందో లేదో నాకు తెలియదు"

"నాకర్థమవుతుంది రాజీ" అంది నవత అనునయంగా రాజి భుజం మీద చెయ్యివేస్తూ.

"పేనాకు చెప్పావా... ఏమంది?"

"ఏమంటుంది? నువ్వు జాగ్రత్తగా ఉండాల్సింది అంటుంది. తను గోపాల్‌ను రెండేళ్ళుగా ఎలా దూరంగా ఉంచుతోందో చెప్పి కాస్త గర్వపడింది. అప్పుడే రేడియోలో సినిమాపాట వస్తోంది—

"నాకందరికన్నా ఆశలు ఉన్నా హద్దు కాదనగలనా" అంటూ— అది నిజమే కదా— నేను హద్దు దాటలేను అంది. నాక్కొంచెం బాధ అనిపించింది"

"హద్దు— దాటటం— తప్పు. ఇవేవీ నాకప్పుడు గుర్తురాలేదే— అదేదో చాలా సహజమైన విషయంలాగా అనిపించింది"

"అలా అనిపించిందిగదా— దాన్నలాగే స్వీకరించు. ఒక అనుభవం కలిగింది. అది కొంత సంతోషాన్నిచ్చింది. కొంత బాధనిచ్చింది. అయిపోయింది. దాని చుట్టూ కొంత భావజాలాన్నీ కొంత మితినీ, కొన్ని భ్రమలనూ అల్లి దీన్ని గందరగోళం చేసి నువ్వు అయోమయంలో పడకు"

"నేనూ ప్రయత్నిస్తున్నా నవతా— కానీ నాకే ఆశ్చర్యంగా ఉంది నా బాధకు. మన మీద పాతభావాల ప్రభావం ఎంతో ఉంటుందని నాకు బాగా అర్థమయింది.

ఈ సంఘటన చాలా చిన్నదనీ, ఏమీ ప్రాముఖ్యం లేనిదనీ, పట్టించుకో కూడదనీ ఎంత అనుకున్నా ఎందుకో బాధ, దుఃఖం, ఏదో కోల్పోయాననే ఫీలింగు, చచ్చిపోదామన్నంత ఆవేశం. నాకే ఇలా ఉంటే ఇక మామూలు అమ్మాయిలు ఎలా భరిస్తారు దీనిని—

"నిజంగా ఇది ముఖ్యమైన విషయమా? కాదా?"

"దానిని అలా ఆ ప్రశ్నరూపంలోకాకుండా అర్థంచేసుకోటానికి ప్రయత్నిద్దాం రాజీ-

మనల్ని మనం గౌరవించుకుంటాం. మన శరీరాలను గౌరవించుకుంటాం. ఆ శరీరం పొందే అనుభవాలు ప్రేమతో ముడిపడివుండాలని మనం గట్టిగా అనుకుంటున్నాం. ఆ ప్రేమ లేకుండా బలవంతంగా మన శరీరాలను అనుభవిస్తే మనకు కోపం వస్తుంది. ఆ అవమానానికి బాధకలుగుతుంది. ప్రేమ ఉన్నట్లు నటించి మోసంచేసినా మనకు కోపం, బాధ కలుగుతాయి.

ఏ విషయంలోనైనా బలాత్కారానికీ, అవమానానికీ మోసానికీ గురికాకూడదనే మనం





కోరుకుంటాం. అలా జరిగినపుడు బాధపడతాం. అంతే - అంతకుమించి ప్రాధాన్యత ఇవ్వటం అనవసరం. ఈ విషయాన్ని ఇలా అర్థంచేసుకోవాలని నాకు అనిపిస్తోంది.

నాకు తెలిసిందే కరక్టని కాదుగానీ నాకింతకంటే మంచి ఆలోచన రావటంలేదు'' తమకున్న పరిమితజ్ఞానంతో ఆ అనుభవాన్ని విశ్లేషించి అర్థంచేసుకునే ప్రయత్నంచేశారు ఆ ఇద్దరు ఆడపిల్లలు.

మర్నాడు విశాఖ ప్రయాణానికి రాజ్యలక్ష్మిని ఒప్పించింది నవత.

''రమణమూర్తి ఎలాగైనా నీకూ - నవీన్‌కూ పెళ్ళిజరిపించాలంటున్నాడు'' అంది నవత ఆ రాత్రి పడుకోబోతూ.

రాజ్యలక్ష్మి మాట్లాడలేదు.

''ఏంటి - నవీన్‌తో మాట్లాడి చూస్తే'' నవత మళ్ళీ అడిగింది.

''నాకిష్టం లేదు'' అంది రాజ్యలక్ష్మి.

నవత మాట్లాడలేదు. రాజ్యలక్ష్మి ఇంకా ఏదో చెబుతుందన్నట్లు వినటానికి సిద్ధంగా కూచుంది.

''అతను స్పష్టంగా'పెళ్ళి గురించి ఆలోచన లేదు. నేను తొందరపడ్డాను'అని అన్న తర్వాత మళ్ళీ అడగటమంటే ఈ సంఘటనవల్లనే గదా - అందరూ కలిసి గొడవచేస్తే గత్యంతరంలేక పెళ్ళాడతానంటాడనుకో -

ఆ పెళ్ళి ఎలా ఉంటుంది?

అతనికి నామీద గౌరవంలేదని నా బాధ.

బలవంతాన పెళ్ళి జరిగిందని అతనికి నామీద విముఖత.

ఆ నంసాగం ఎలా సాగుతుంది?

పెళ్ళికి కావాల్సినపునాదిలేకుండా ఎందుకా పెళ్ళి?''

నవత ఏం మాట్లాడలేదు.

''పునాది లేకుండా ఇది జరగలేదా అంటావేమో. ఔను... జరిగింది. ఆ సమయం అలాంటిది. అదే జరగకపోతే బాగుండేది అనుకుంటూ జీవితాంతం దానిని మొయ్యటం ఎందుకు? అందుకే ఇదింతటితో మర్చిపోతే మంచిదనిపిస్తోంది''

''ఔను - అదే మంచిది'' అంది నవత.

మరాడు రాత్రికి విశాఖ రెలెకా రు స్నేహితులిద్దరూ.

* * *

వసంతకిదంతా అర్థంచేయించటానికి నవత, రాజ్యలక్ష్మి కలిసి కష్టపడ్డారు. రాజ్యలక్ష్మి వసంతతో తన అభిప్రాయాలూ, ఫీలింగ్సూ అన్నీ విప్పిచెప్పుకుంది. నవత కాలేజీకి వెళితే వసంత దగ్గరేకూచుని ఏదో ఒకటి మాట్లాడుతుండేది.

రాజ్యలక్ష్మి ఉన్నన్నిరోజులూ వసంత ఆ అమ్మాయిని ఎంతో ప్రేమగా చూసుకుంది. ఆ పిల్లకు సంతోషం కలిగిస్తాయనిపించిన పనులు చిన్నచిన్నవైనా శ్రద్ధగా చేసింది.

రోజూ సాయంత్రం రాజ్యలక్ష్మి జుట్టు చిక్కుతీసి జడవేసి 'రోజూ నూనె రాసుకొంటే నీ జుట్టు బాగుంటుందని' సలహా యిచ్చేది.

రాజ్యలక్ష్మి ధైర్యంగా ఉండటం, నవ్వుతూ తిరగటం, స్నేహితులతో మామూలుగా ఉండటం ఇవన్నీ వసంతకు ఎంతో నచ్చాయి. 'ఇంతకుముందయితే రాజ్యలక్ష్మి పరిస్థితిలో ఉన్న అమ్మాయిని ఇంత ప్రేమించగలిగేదాన్నా' అనుకుంది వసంత.

''లావణ్య స్నేహితులు, నవత స్నేహితులూ. వచ్చేవాళ్ళు కానీ వాళ్ళతో తనకు పెద్ద సంబంధంఉండేది కాదు. మరీ చిన్నప్పుడైతే వాళ్ళను బైటనుంచే పంపెయ్యమనేది - ఇల్లంతా గొడవచేస్తారని విసుక్కునేది. పిల్లల స్నేహితులు వెళ్ళాకనే పిల్లలకు చిరుతిళ్ళు పెట్టేది. సురేష్ ఒకరోజు 'ఆ పిల్లలకు కూడా పెట్టకపోయావా' అంటే 'ఇక అలాగైతే సంసారం చేసినట్టే. ఈ వీధిలో పిల్లలంతా సాయంత్రానికి తయారవుతారు' అంటూ కసురుకుంది.

కాస్త పెద్దయ్యాక పిల్లలు తమ ముఖ్యమైన స్నేహితుల్ని ఇంటికి తెచ్చేవారు. కాఫీచేసి కేకేస్తే పిల్లలే తీసుకెళ్ళేవారు. వాళ్ళ గురించి తనకేంతెలియదు. పిల్లలెప్పుడన్నా ఆ ఫ్రెండు అలా, ఈ ఫ్రెండు ఇలా అని చెబుతుంటే తన మూడ్‌నిబట్టి కాసేపు మాట్లాడేది లేదా- చాల్లే సొద ఆపమని విసుక్కునేది.

ఇప్పుడు ఇక్కడ నవత స్నేహితులందరూ



తనతో ఎంతో స్నేహంగా ఉంటారు. ఎప్పుడోత ప్ప ప్రత్యేకంగా వాళ్ళే మాట్లాడుకోరు. వాళ్ళు రాగానే తనకు సంతోషంగా ఉంటుంది. రాజ్యలక్ష్మి విషయం తనసింత బాధపెడుతోంది. లావణ్యకోసమో, నవతకోసమో పడినంత ఆందోళనపడుతోంది.

ఆ అమ్మాయికి ఏదన్నా చెయ్యగలిగితే బాగుండు అనిపిస్తోంది. తన కుటుంబంలో లేనివ్యక్తుల గురించి ఇంత ఆలోచించటం, ఇంత ప్రేమించటం ఇదే మొదలు. కానీ ఇది బాగుంది.

రాజ్యలక్ష్మికి సహాయపడాలన్న కోరికతోపాటు అవసరమైతే తనకు రాజ్యలక్ష్మి సహాయపడు తుందనీ, తనను ప్రేమిస్తుందనీ నమ్మకం కూడా కలుగుతోంది. పరస్పరం ఆ నమ్మకం ఉండటం వల్లనేనా ఈ సంబంధం ఇంత హాయిగా ఉంది- అనుకుంది వసంత.

పదిహేనురోజులు గడిచిపోయాయి. ''ఇంకా సెలవుపెడితే మర్యాదగా ఉండదు. వెళ్తాను- అంది రాజ్యలక్ష్మి.

ఆ రోజు రాత్రికి టికెట్ తెచ్చుకుంది.

సాయంత్రం నవత వాళ్ళ 'కాలేజీ యూని యన్ మీటింగుంది' అంటూ వెళ్ళిపోయింది.

''నీరైలు ఎనిమిది గంటలకు కదా. నేను ఏడున్నరకంతా ఆటో తీసుకుని వస్తాను... వెళ్దాం'' అంది. రాజ్యలక్ష్మి అన్నీ సర్దుకుంది.

''నువ్వూ నవతా రెండు మూడునెలల్లో మద్రాను రండమ్మా'' అంది.

''నువ్వింకా నాలుగురోజులు ఉండకూడ దూ? ఇదిగో - ఈ కారప్పొడి సీసాకు ఓ కాగితం చుట్టి బ్యాగ్‌లో పెట్టుకో' అంది వసంత సీసా అందిస్తూ.

''ఎందుకమ్మా. నేను కొనుక్కుంటా--''

''కొన్నావులే-- తీసుకో. నీకిష్టమని కొరివి కారం చేస్తే'' ప్రేమగా కసిరింది వసంత.

''మా అమ్మకంటే నువ్వే దగ్గరయ్యావమ్మా'' అంది రాజ్యలక్ష్మి.

''అదేంమాట రాజీ - మీ అమ్మకంటే నేనెలా దగ్గర. మన పరిచయం నెల దాటలేదింకా''

''నిజమే కానీ నేను ఈ జన్మలో మా అమ్మతో చెప్పుకోలేని విషయాలు నీతో చెప్పుకున్నాన మ్మా. ఇంకా నా బాధలు చెప్పుకోగలిగిన ఆత్మీ యత సంపాదించుకున్నాను. మా అమ్మతో యిది కుదురదు--''

''ఎందుకని?'' ఆలోచనగా అడిగింది వసంత.

''ఎందుకంటే కారణం నాకూస్పష్టంగా తెలి యదు. నాదే తప్పనుకుంటా. ఆమెను అన్నం పెట్టే అమ్మగా తప్ప స్నేహితురాలిలా చూడలే దు. ఆమెకివన్నీ అర్థంకావు. నేను చెప్పుకోలే ను. మా ఇద్దరి మధ్యా ఎంతో దూరం ఉన్నట్టు ఉంటుం... ఫ్రీగా ఉండలేను.

అమ్మనన్ను చాలా ప్రేమిస్తుంది. నేనంటే చాలా ఇష్టం. మేం నలుగురం పిల్లలం. మా నలుగుర్నీ పెంచటమే జీవితంగా చేసుకుంది. అయినా ఆమెకు నేను అర్థంకాను. నన్ను అర్థంచేసుకోలేని ఆమెతో నేను అన్నీ చెప్పుకో లేను. కుటుంబ సంబంధాలు ఇలాగే ఉంటా యేమో--'' వసంత తానే రాజ్యలక్ష్మి తల్లయిన ట్లు కళ్లనీళ్లపర్యంతమై రాజ్యలక్ష్మిని దగ్గరగా తీసుకుంది.

అప్పుడే తలుపు తోసుకుంటూ లోపలకు వచ్చాడు చంద్రశేఖరం-

''ఇవాళేనా మీ ప్రయాణం'' అంటూ.

నవత కోసం రెండుమూడుసార్లు వచ్చిన చంద్రశేఖరంతో వసంతకు ముఖపరిచయం తప్ప చనువులేదు.

''కూచో బాబూ'' అందితను అక్కడినుంచి వెళ్లాలా అని ఆలోచిస్తూ.

''మీరివాళ ప్రయాణం మానేయకూడ దూ?'' అన్నాడు చంద్రశేఖరం.

''ఎందుకు... ఏమన్నా మీటింగుందారేపు'' ఆశ్చర్యంగా అడిగింది రాజ్యలక్ష్మి.

''మీటింగా పాడా -- మీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి. రెండు రోజుల్నించీ బుర్రంతా పాడుచేసుకుని ఇవాళ ఈ నిర్ణయం తీసుకున్నాను. రేపు రాత్రికి వెళ్దురుగాని - మానెయ్యండి''

''ఎందుకూ - పోనీ ఈసారి వచ్చినపుడు మాట్లాడతండి'' అంది రాజ్యలక్ష్మి.

''ప్లీజ్ - నేను చాలా సీరియస్‌గా అడుగు తున్నాను. మీరు రేపు వెళ్ళండి. వసంతగారూ...





మీరైనా చెప్పండి- నేనింతగా అడుగుతుంటే కాదనటం''

''ఏం మాట్లాడాలి'' రాజ్యలక్ష్మి సందేహంగా అంది.

''ముందు మీరు ప్రయాణం మానుకోండి చెబుతా''

వసంత తను అక్కడవుండటం బాగోదని లోపలికి వెళ్ళింది.

రెండు నిమిషాల తర్వాత రాజ్యలక్ష్మి లోపలకు వచ్చి ''అమ్మా - నవతొస్తే ఈ టికెట్ కాన్సిల్‌చేసి రేపటికి తీసుకోమను. నేనూ చంద్రం బీచ్‌దాకా వెళ్ళొస్తాం'' అని చెప్పి వెళ్లిపోయింది.

వసంతకు నవత వచ్చేదాకా ఆరాటం.

చంద్రం ఏంమాట్లాడతాడు. ప్రయాణం ఎందుకాపాడు- అని వసంత చెప్పిన మాటలు వింటూనే నవత మొహం వెలిగిపోయింది.

''అమ్మయ్య - ఆ బుద్ధావతారం ఇప్పటికి కదిలాడన్నమాట. చంద్రానికి రాజీ అంటే ప్రేమని నాకెప్పటినుంచో అనుమానం. ఏదీ టికెట్'' అంటూ హడావుడి పడింది.

''ఏమిటే నీ హడావుడి. అతని ఉద్దేశం ఏమిటి, ప్రయాణం ఎందుకాపాడు?'' ఆత్రంగా అడిగింది వసంత.

''బహుశ 'నిన్ను ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకుంటాను' అని చెప్పటం కోసమై ఉంటుంది'' అంది నవత సంతోషంగా నవ్వుతూ.

''రాజీ ఒప్పుకుంటుందా?''

''రానీ చెబుతుందిగా'' నవత స్టేషన్‌కి వెళ్ళింది. నవతా, రాజ్యలక్ష్మి ఒకసారే వచ్చేశారు.

''ఏమిటి - ఎందుకటా ప్రయాణం ఆపించాడు'' నవత అడిగింది.

''ఊహించు చూద్దాం'' అంది రాజ్యలక్ష్మి.

''ప్రేమిస్తున్నాను అన్నాడా లేదా?''

''అన్నాడు'' అంది రాజ్యలక్ష్మి నవ్వుతూ.

''నువ్వేమన్నావు?'' వసంత కంగారుగా అడిగింది.

''ఆలోచించి చెబుతానన్నాను''

''ఈ రెండుమాటలేనా మీరు మాట్లాడుకున్నది? అంతా చెప్పు. లేకపోతే చంపుతా'' అంది నవత.

''చెబుతాలే... ముందు అన్నం తిందాంపద. ఆకలేస్తోంది. అమ్మా ఆకలేస్తోంది'' అంది వసంతతో గారాంగా.

వసంతకు చంద్రశేఖరం మాటలకు సంతోషంగా ఉన్నా లోపలెక్కడో చిన్న అనుమానం కూడా పీడిస్తోంది.

''కొంపదీసి ఈ పిల్ల ఆ విషయం చెప్పలేదుగదా అతన్తో'' అని.

కంచాల్లో అన్నంపెట్టి అడిగేసింది.

నవత కూడా ఆందోళనగా చూసింది.

''ఎలా చెప్పాలో తెలియలేదు. అతనే ఎక్కువ మాట్లాడాడు. అతన్ని ఆపి - 'ఇదిగో నాకీ విషయం జరిగింది. నేనిలా ఫీలవుతున్నాను. ఈ విషయం గురించి మీకు అభ్యంతరం ఉంటుందేమో అని చెప్పలేకపోయాను.''

''అందుకే నా అభిప్రాయం ఉత్తరంలో రాస్తానని వచ్చేశాను'' అంది రాజ్యలక్ష్మి.

''ఇదంతా అతనికి రాస్తావా... ఎందుకూ?'' అంది వసంత కోపంగా.

''ఎందుకేమిటి-చెప్పాలిగదా-''

''చెప్పకపోతే ఏమవుతుందని అదంత ముఖ్యమైన విషయం కాదనే అనుకుంటున్నావు గదా''

''కావాలని దాయటం ఎందుకు? చెబితే ఏమవుతుంది''

''మీకు తెలియదు. చెబితే వినరు. జరిగిందేదో జరిగింది. అదంతా మర్చిపోవాలనుకున్నారు. మళ్ళీ ఎందుకీ పిచ్చిపనులన్నీ చేసి సమస్యలుకొని తెచ్చుకుంటారు'' వసంతకు తలమునకలుగా కోపం వచ్చింది.

''నాకెందుకు. మీ ఇష్టం. చెబితే వింటారు గనకనా'' అంటూ విసురుగా లేచి వెళ్ళిపడుకుంది.

వంటిల్లు సర్దినంతసేపూ రాజ్యలక్ష్మి, నవతా మాట్లాడుకుంటూనే ఉన్నారు. అవి స్పష్టంగా వినపడకపోయినా-

''ఇద్దరికిద్దరే- సరిపోయారు. నువ్వు కరెక్టు అంటే నువ్వు కరెక్టు అనుకోటానికి'' అనుకుంది వసంత కోపంగా.




నవత వంటింట్లో లైటు తీసి ముందు గదిలోకెళితే రాజ్యలక్ష్మి వచ్చి వసంత పక్కన పడుకుంది.

"అమ్మా ఈ విషయం దాయటం ఎందుకు? నేను నా ప్రాణ స్నేహితురాలనుకున్న నవతకు చెప్పాను. వీణకూ, రమణమూర్తికీ తెలును. చంద్రం దగ్గర దాయటమంటే అత నిమీద నమ్మకంలేకేగదా. అపనమ్మకంతో ప్రేమ మొదలెట్టటందేనికి?

అతను ఆ విషయాన్ని మామూలాగే తీసుకుంటే సమస్యేలేదు. అతనికి విషయంలో అభ్యంతరం ఉంటే కూడా సమస్యలేదు— నాకు తనే దూరం అవుతాడు. అతనికి నేను పెట్టే ఓ పరీక్ష అనుకో-

తర్వాత లేనిపోని సమస్యల కంటే ఇదే మంచిదమ్మా" బుజ్జగిస్తూ చెప్పింది రాజ్యలక్ష్మి.

"సరేలే... మీ ఇష్టం" అంది వసంత కాస్త మెత్తబడుతూ.

"మా ఇష్టంకాదు. అదే సరైన పద్ధతి. ఔనా కాదా చెప్పు"

"ఔనులే... పో-పోయి పడుకో" అంది వసంత. రాజ్యలక్ష్మి వెళ్ళింది.

మర్నాడు రాత్రి మద్రాసు వెళ్ళిపోయింది.



వసంత విశాఖపట్టణం వచ్చి ఆరునెలల యింది. ఈ ఆరునెలల్లో లావణ్య ఒకసారి వచ్చింది. ఉన్న రెండురోజులూ నవతను తిట్టటమే పని.

"నువ్వే ఇలా చేశావు. కుటుంబాన్ని వీధిన పడేశావు. మా అత్తగారి ముందు తలెత్తుకోకుండా చేశావు" అంటుంది.

"నేనేం చేశా"నని నవత అడిగితే-

"అమ్మను అక్కడినుంచి ఎందుకు తెచ్చావు. అమ్మ అక్కడుంటేనే గౌరవం. నాన్న ఇప్పుడావిడతో పబ్లిగ్గా ఉంటున్నాడు. అమ్మ ఆ ఇంట్లో ఉంటే అలా జరగదుగదా- ఏదో రహస్యంగా జరిగేది—" అంటుంది.

"అది అమ్మకెంత కష్టంగా ఉంటుంది. రోజూ దీనంగా నాన్న ముందు తిరగటం. నాన్న తప్పుచేసినవాడిలా తిరగటం. మాట్లాడటానికి కూడా సరైన మనుషులు లేకుండా ఒక్కతే ఆ ఇంట్లో ఉండటం అమ్మకెంత నరకంగా ఉంటుందీ? నా దగ్గరుంటే కాస్త ప్రశాంతంగా ఉంది. అమ్మ ఇప్పుడు హాయిగా ఉంది. నువ్వు దిగులు పడక్కర్లా" అంది నవత.

"అసలు నాన్నెందుకలా చెయ్యాలి" అంటుంది కాసేపు.

"నాన్ననడుగు - మమ్మల్నడుగుతావేం" అని నవత అంటే-

"అమ్మదే తప్పు. నాన్నను ఆకట్టుకోలేకపోయింది. ఏదో మగాడన్నాక ఇలాంటివి తప్పవులే అని సర్దుకోలేకపోయింది. ఇప్పుడందరూ ఏమనుకుంటున్నారు?"

"ఏమనుకుంటున్నారు?" అని నవత తీవ్రంగా అడిగితే-

"మీ అమ్మని మీ నాన్న ఒదిలేశాడటగా అని అడుగుతున్నారు. తలెక్కడ పెట్టుకోవాలో తెలియటంలా. ఏం చెప్పాలో తెలియటంలా"

మాట్లాడకుండా ఈ మాటలు వింటున్న వసంతకు ఒక్కసారి ఆవేశం ముంచుకొచ్చింది.

"అందరికీ చెప్పు... మా నాన్న మా అమ్మను ఒదిలేశాడు అని చెప్పు. నాకు లేని పరువుతక్కువ నీకేమిటి" అంటూనే ఏడ్చేసింది.

"నువ్వెందుకొచ్చావక్కా. అమ్మని ఏడిపించడానికా" అంటూ నవత కేకలేస్తే లావణ్య ఏడవడం మొదలెట్టేది. ఉన్న నాలుగురోజులూ ఇల్లు అశాంతిమయం చేసి వెళ్ళిపోయింది లావణ్య.

లావణ్యతో తనకున్న బంధమేదో తెగిపోయినట్లనిపించింది వసంతకు.

లావణ్యకు తను పరువుప్రతిష్ఠల సమస్య తప్ప మరేమీకాదు.

అన్నీ సరిగా ఉంటే తనచేత మరింత చాకిరీ చేయించుకునేది. తన బిడ్డలకి చాకిరీ చేయించుకునేది. అది కుదరదని తెలిశాక తనను మనిషిలాకాక సమస్యగా చూస్తోంది అనుకుంది వసంత. ఈ ఆలోచన వచ్చాక నవత స్నేహితులమీద ముఖ్యంగా వీణ, రాజ్యలక్ష్మి, సుందరీ వీళ్లమీద ప్రేమ మరింత ఎక్కువయింది.

"వాళ్లకు నేను చాకిరీ చేసే యంత్రాన్ని కాదు. అస్తులిచ్చేదాన్నీ కాదు. వాళ్లకో సమస్యనీ కాదు. సాటి మనిషిని. మనిషికి సాటిమనిషితో ఉండాల్సిన మానవసంబంధాలు మామధ్య ఉన్నాయి. లావణ్యకూ, నాకూ; సురేష్‌కూ, నాకూ మధ్య అవి లోపించాయి" అని తెలుసుకునేసరికి వసంతకు కొత్త జ్ఞానమేదో కలిగి కొత్త శక్తి వచ్చినట్లయింది.

సురేష్ అపుడప్పుడూ వచ్చి నవతను కలిసి వెళ్తున్నాడని కూడా వసంతకు తెలుసు.

ఒకరోజు నవత కాలేజీనుంచి వస్తూ ఓ పాకెట్ తెచ్చింది.

"ఏమిటిది?" అంటూ విప్పిచూసింది వసంత.

కొత్తబట్టలు.

"ఇవెక్కడివే?" అంటూ విప్పిచూస్తోంది.

"నాన్న తెచ్చాడు. మధ్యాహ్నం కాలేజీకి తెచ్చియిచ్చాడు"

వసంత చప్పున ఆ బట్టల్ని వదిలేసింది. నవత ఆ బట్టలు తీసి మడతపెట్టి పాకెట్‌లో పెడుతూ- "నాన్న హోటల్‌లో దిగాడమ్మా. సాయంత్రం వస్తానని చెప్పాను. చూస్తుంటాడు. నేను వెళ్తాను. నేనొచ్చేసరికి ఆలస్యమవుతుందేమో. నువ్వు అన్నం తినెయ్యి" అంది.

వసంతేమీ మాట్లాడలేదు. నవత స్నానం చేసి వెళ్లిపోయింది. 'సురేష్‌ని ఇక్కడికి రమ్మని చెప్పలేదని నవత అనుకుంటుందా - నవత ఎందుకు రమ్మనలేదు? నేను బాధపడతాననా. సురేష్ ఎలా ఉన్నాడు' వసంతకు సురేష్‌ని చూడాలని బలంగా అనిపించింది.

వీధిలోకి చూస్తూ గుమ్మం దగ్గరే నుంచుంది.

రాత్రి తొమ్మిది గంటలకు ఆటో వచ్చి ఇంటి ముందు ఆగింది.

ఆటోలోంచి ఇద్దరూ దిగారు.

వసంత కళ్లు పెద్దవిచేసుకుని చూసింది.

సురేష్ చిరునవ్వుతో నవత భుజం తడుతూ ఏదో చెబుతున్నాడు.

సురేష్ బాగున్నాడు. సంతోషంగా, ఉత్సాహంగా ఉన్నాడు. తను లేకపోవడం అనేది లోటుగానే లేదు. ఆ మనిషిలో తన గురించిన ఆలోచనే లేనట్లుంది. ఆటో వెళ్లేవరకూ అలాగే చూసింది వసంత. ఆ తర్వాతెప్పుడూ వసంత సురేష్ జ్ఞాపకాలతో కంటతడిపెట్టలేదు. అది అనవసరం అని ఆమె మనసులో గాఢంగా నాటుకుపోయింది.

ఇరవై సంవత్సరాల సహజీవనంవల్ల ఏమీ మిగలలేదు.

ఆ సహజీవనానికి అర్థంలేదు.

'అలాంటి జీవితం ఇంకో ఇరవై ఏళ్ళు గడిపి చచ్చిపోలేదనా ఏడవాలి' అనుకుంది వసంత.

ఆ తర్వాత ఇక్కడి జీవితం మీద వసంతకు ఆసక్తి ఎక్కువైంది.

ఈ పిల్లలు, వాళ్ళ రాజకీయాలూ, సంఘాలు, సమ్మెలు, చర్చలు - ఇవన్నీ ఆమెకు తెలియకుండానే ఆమెలో చోటుచేసుకున్నాయి.

★ ★ ★

రాత్రి పన్నెండుగంటలైనా నవత, వసంత నిద్రపోలేదు. అత్యవసరంగా కొన్ని కాగితాలు సైక్లోస్టయిల్ తియ్యాలని పార్టీవాళ్ళు ఇచ్చివెళ్లారు.

వసంతకు ఈ పని బాగా అలవాటయింది.

మొదట ఒకసారి అత్యవసరంగా కావాల్సివచ్చి సమయానికి ఎవరూలేక వసంతచేత పది పేజీలు సైక్లోస్టయిల్ తీయించారు. ఆ తర్వాత వసంతకు అది మామూలయింది. నెలకు పదిరోజులన్నా ఆ పని ఉంటోంది. అవన్నీ నవత పనిచేసే పార్టీవాళ్ల సిద్ధాంత చర్చలకు సంబంధించిన డాక్యుమెంట్లు.

స్టెన్సిల్ పేపర్‌మీద రాసి పంపేవాళ్ళు. వసంత వాటిని తెల్లకాగితాలమీద అచ్చొత్తేది.

ఆ చిన్న మిషనూ, ఇంకా రెండునెలల్లో




వసంతకు బాగా అలవాటైపోయాయి.

వసంతకు ఆ కాగితాలు చదివితే ఏమంత అర్థమయ్యేదికాదు.

నవతనడిగితే 'అవి అర్థంకావాలంటే ముందు చాలా పుస్తకాలు చదవాలమ్మా' అంటూ ఏవో పుస్తకాలు ఇచ్చేది. అవీ సరిగా అర్థమయ్యేవికావు.

పార్టీవాళ్లు తాము పనిచేస్తున్న ప్రాంతాల్లో జరిగిన పనుల గురించి ఇచ్చే రిపోర్టులు మాత్రం చాలావరకు అర్థమయ్యేవి.

అవి చదువుతుంటే ఉత్సాహంగా ఉండేది.

సమాజంలో జరిగే అన్యాయాలను ఎదిరించి పోరాడటం చాలా అవసరం- అనే విషయం వసంతకు అర్థమయింది. నవతావాళ్లు పాడే పాటలూ, విద్యార్థి సంఘంగా వాళ్లు చేసే పనులూ, పెట్టే మీటింగులూ - వీటిల్లో వసంతకు ఆసక్తి పెరిగింది.

ఆరోజు రాత్రి కూడా సైక్లోస్టయిల్ చేయాల్సిన కాగితాలతో కూర్చుంది వసంత.

నవత కూడా సహాయం చేస్తూ మేలుకునే ఉంది. ఎవరో తలుపు తట్టారు. వసంతకు భయం వేసింది. పోలీసుల గురించి ఆందోళన ఈమధ్య ఎక్కువైంది. ఎప్పుడో ఒకసారి పోలీసులు నవత కోసం వస్తారని ఆమెకు అనుమానంగా కాదు నమ్మకంగా ఉంది. అర్ధరాత్రి తలుపులు చప్పుడవడంతో కంగారుగా ఆ మిషన్నూ కాగితాలనూ మంచం కిందికి తోసేశారు. ఇంతలో చప్పుడు మరింత ఎక్కువయింది. నవతను 'నువ్వుండు' అంటూ వసంత వెళ్లి తలుపుతీసింది.

నలుగురైదుగురు వ్యక్తులు గబగబా లోపలికి వచ్చారు. ఇంటిముందు కారొకటి ఆగివుంది.

వసంతకు భయంతో మాటరాలేదు.

వసంత స్థితి చూసి వాళ్లలో ఒకాయన "నవత లేదా" అనడిగాడు.

అంతలో రమణమూర్తి లోపలకు వచ్చాడు.

నవత వచ్చింది.

"మీరా - రండి. ఎలా వచ్చారు?" అంటూ హడావుడి పడింది.

వచ్చినవాళ్లలో రమణమూర్తిని చూశాక వసంత భయం తగ్గింది.

"నేను పోలీసులనుకున్నాను" అంది రమణమూర్తితో.

వచ్చినవాళ్లలో పెద్దాయన నవతతో చెప్పాడు-

"రామ్మూర్తి పరిస్థితి ఏమీ బాగోలేదు. జబ్బేమిటో కూడా ఆ ఊళ్ళో డాక్టరికి తెలియలేదు. అక్కడ ఒకరోజు వున్నా ప్రమాదం అనిపించింది. హాస్పిటల్‌లో చేర్పడం మంచిది కాదనిపిస్తోంది. ఇక్కడే వుంచి తెలిసిన డాక్టర్ల చేత వైద్యం చేయించాలని తీసుకొచ్చాం. ముందుగా తెలియజేసే టైమ్ లేకపోయింది. అతను కార్లో వున్నాడు. తీసుకురామా - ఫరవాలేదా?" నవత చురుగ్గా తలుపువైపు నడిచి "రండి తీసుకొద్దాం" అంది.

నలుగురు కలిసి ఓ మనిషిని మోసుకొచ్చారు. తెల్లగా సన్నగా ఉన్న ఆ మనిషి స్పృహలో లేడు. అతన్ని లోపల గదిలో మంచంమీద పడుకోబెట్టారు.

"రమణమూర్తి ఉంటాడు. రేపు ఉదయాన్నే డాక్టర్ని తీసుకొచ్చి చూపించండి" అని చెప్పి రమణమూర్తికి డబ్బిచ్చి వాళ్లు వెళ్లిపోయారు.

నవత రామ్మూర్తి నుదుటిమీద చెయ్యివేసి.

"జ్వరం బాగా వుంది" అంది.

"వారం రోజుల నుంచీ అలాగే ఉందట. ఏం తిన్నా వాంతులవుతున్నాయట. ఆ చిన్న టౌన్లో వున్న డాక్టర్‌కి ఏమీ అంతుపట్టలేదు. టైఫాయిడ్, మలేరియాలాంటిదేమీ కాదన్నారు. రేపిక స్పెషలిస్టుకి చూపించాలి" అన్నాడు రమణమూర్తి.

"హాస్పటల్‌కి తీసుకెళ్లకుండా ఎలా?" అంది వసంత.

"మనకు తెలిసిన డాక్టర్లకు చూపించి వాళ్ల సలహా ప్రకారం చేద్దాం" అంది వసంత.

"రామ్మూర్తిగారు ఆరోగ్యం గురించి అసలు పట్టించుకోరు. రాత్రింబగళ్ళూ తిండీతిప్పలూ లేకుండా పనిచేస్తారు" అన్నాడు రమణమూర్తి.

నవతా, రమణమూర్తీ రామ్మూర్తి గురించి మాట్లాడుతుంటే వింటూ కూచుంది వసంత.

కాసేపటికి ముగ్గురూ పడుకున్నారు.

వసంతకింకా నిద్ర పట్టనేలేదు. రామ్మూర్తి

పెద్దగా మూలగటం మొదలుపెట్టాడు.

వసంత లేచి వెళ్లింది.

పుల్లల్లాంటి రెండు చేతుల్నీ నెత్తినపెట్టి అదుముకుంటున్నాడు. కళ్లనుంచి నీళ్లు కారుతున్నాయి.

వసంత దగ్గరకు వెళ్ళింది.

'తలనొప్పి కాబోలు ఏం చెయ్యాలి'

సంకోచంగానే అతని పక్కన కూచుని తల పట్టడం మొదలుపెట్టింది.

నుదుటిమీద చెయ్యి కాసేపు వుంచడం కష్టమవుతోంది. జ్వరం చాలా ఎక్కువుంది.

వసంత లోపలికి వెళ్ళి చల్లటినీళ్లతో తడిపిన గుడ్డ తెచ్చి నుదుటిమీద వేసింది.

అలా చల్లని బట్టతో తుడుస్తూ, తల నొక్కుతూ వుంటే అతను మళ్ళీ నిద్రపోయాడు.

అప్పటికి తెల్లవారింది.

నవత, రమణమూర్తి తయారై బయటికి వెళ్ళారు. వసంత పాలు కలిపి తీసుకొచ్చింది. రామ్మూర్తి లేచే పరిస్థితిలో లేడు. పక్కనే కూచుని స్పూన్‌తో కొంచెంకొంచెం పాలు నోట్లో పోస్తే నెమ్మదిగా తాగాడు. ఐదు నిమిషాల్లో ఉక్కిరిబిక్కిరవుతున్న అతన్ని చూసి హడలిపోయింది వసంత.

చాలా ఆయాసపడుతూ తాగిన పాలన్నీ వాంతి చేసుకున్నాడు.

పక్కబట్టలూ అతని చొక్కా తడిసిపోయాయి. ఆ హడావుడిలో లుంగీ కూడా తడిపేసుకున్నాడు.

వసంతకు కాలూ చెయ్యీ ఆడలేదు.

'ఏం చెయ్యాలి. ఎట్లా - ఏం చెయ్యకుండా ఎట్లా ఉండటం'

నెమ్మదిగా చైతన్యం తెచ్చుకుంది.

ఒక శుభ్రమైన బట్ట తీసుకుని అతని ముఖం తుడిచింది. చొక్కా విప్పదీసి మెడ కింద తుడిచింది.

అతన్ని ఒకపక్కకి జరిపి పక్కబట్ట లాగేసింది. ఇంకో దుప్పటికప్పి లుంగీ లాగేసింది. దుప్పటినే లుంగీలా మడిచి ఉపాయంగా ఇంకోపక్క వేసింది.

అతని బ్యాగ్ తీసి లుంగీ కోసం వెతుకుతుండగా రమణమూర్తి వచ్చాడు. అతనికంతా చెప్పింది వసంత. డాక్టరువచ్చి చూశాడు.

పాత రిపోర్టులన్నీ తిరగేశాడు.

మందులేవో రాసిచ్చి సెలైన్ పెట్టించి వెళ్లాడు.

ఆ రోజు పగలంతా ఏవో పరీక్షలు చెయ్యటానికి ఎవరెవరో వస్తూనే ఉన్నారు.

వసంత వంట ముగించి రామ్మూర్తి పక్కనే కూచుంది.

నవత కాలేజికి వెళ్లింది.

కృష్ణమూర్తి పరీక్షల కోసం డాక్టర్ల కోసం తిరుగుతున్నాడు.

రెండు రోజుల తరువాతగాని డాక్టర్లు ఆ జబ్బేమిటో గుర్తించలేకపోయారు.

లివర్‌కి సంబంధించిన జబ్బు. చాలా జాగ్రత్తగా చూడాలన్నారు.

రామ్మూర్తి భారమంతా వసంతమీదే పడింది.

నవత కాలేజీకి వెళ్లాలి.

ఆ ఇంట్లో ఎప్పుడూ వుండేవాళ్లుకాక ఇంకెవరన్నాఉంటే అనుమానం వస్తుందని ఎవరినీ ఒద్దన్నారు.

రామ్మూర్తి పోలీసులకు కనబడకుండా అజ్ఞాతవాసంలోకివెళ్లి మూడేళ్లయింది. కింద ఇంటివాళ్లడిగితే వసంత రామ్మూర్తి తన తమ్ముడనీ, ఇంకా పెళ్లికాలేదనీ చెప్పింది.

కింద ఇంటివాళ్లు బెంగాలీలు. వీళ్ల గురించి పెద్దగా పట్టించుకోరు.

నవత స్నేహితులూ మీటింగులూ వాళ్లకి అలవాటే.

ఇంట్లో పెద్దావిడ మాత్రం ఒకసారొచ్చి రామ్మూర్తినిచూసి వెళ్లింది.

వసంత పదిహేనురోజులపాటు రాత్రింబగళ్లూ రామ్మూర్తి పక్కనే గడిపింది.

అతనికి చెయ్యని సేవలేదు. అతనొక పురుషుడు, అతనికివన్నీ చెయ్యటం ఎలా అనే సంకోచం లేకుండా సర్వపరిచర్యలూ చేసింది.

చావు బతుకులమధ్య ఊగిసలాడుతున్న అతని ప్రాణాన్ని రెండు చేతులా గట్టిగా పట్టుకుని నిలబెట్టటానికి ప్రయత్నించింది.

ఇతను బతకాలి. ఎలాగైనా బతకాలి. చావ





టానికి వీలులేదు – అన్న ఆలోచనతప్ప మరొక ధ్యాన లేకుండా అతన్ని చూసుకుంది.

పదిహేనురోజుల తర్వాత అతనికి మొదటి సారి జ్వరం రాకుండా ఉంది. ఆ రోజు వసంత తన జీవితంలో ఏనాడూ పడనంత సంతోషప డింది.

"జ్వరం రాలేదు. ఇక ఫరవాలేదు" ఈ మాట నవతతో, రమణమూర్తితో కనీసం వెయ్యి సార్లు చెప్పివుంటుంది.

ఆ రోజే సెలైన్ కూడా తీసేశారు.

రాత్రి పదింటికి పాలు తాగించి మందులు వేస్తే రామ్మూర్తి హాయిగా నిద్రపోతున్నాడు.

"ఇవాళ అతనింక లేవరమ్మా -- నువ్వు నిశ్చింతగా నిద్రపో" అంటే వసంత వినలేదు. ఎప్పటిలా అతని తలవైపు చాపపరుచుకుంది.

నవత తల్లిని బలవంతంగా లాక్కెళ్లి తన మంచంమీద పడుకోబెట్టి తను కూడా పక్కన పడుకుంది.

మధ్య రాత్రిలో 'అయ్యో అయ్యో చెయ్యి కదిలించకు కాసేపుంటే అయిపోతుంది' అంటూ హడావుడిపెడుతున్న వసంత కేకలకు నవతకు మెలకువ వచ్చింది. తల్లిని కదిలించి లేపి 'ఏమిటి' అంది అయోమయంగా.

"నేనింకా రామ్మూర్తిగారి సెలైన్ ధ్యాసలోనే ఉన్నానే - ఆయన చెయ్యి కదిలించీ, ఆ సిరెంజి పీకెయ్యబోయి నానాగోలచేసేవాడు గదా - ఆ కలవరింతలతో మెలకువ వచ్చింది" అంటూ లేచింది.

"నువ్వు పడుకో- నేనక్కడే పడుకుంటాను"

అని వెళ్లి రామ్మూర్తి మంచం పక్కగా చాప వేసుకుని పడుకుంది.

రామ్మూర్తి గాఢంగా నిద్రపోవటం గమ నించి తను కూడా నిశ్చింతగా పడుకుంది.

మరొక పదిరోజుల్లో రామ్మూర్తి మామూలుగా లేచి తిరగగలిగాడు.

"మీరే బతికించారు నన్ను. మీరు లేకపోతే చచ్చిపోయేవాడిని" అని రామ్మూర్తి అన్నరోజు వసంతకు ఒళ్లు పులకరించింది.

"తన బతుకు వ్యర్థం కాదు. తన దగ్గర ఎంతో శక్తిఉంది. ఎంతంటే ఒక మనిషికి ప్రాణం పోయగలిగినంత. తన జీవితానికిప్పు డు అర్థం ఉంది. తను లేకపోతే కొన్ని పనులు జరగవు. కొన్నిపనులు తాను చాలా బాగా చేయగలుగుతుంది. ఆ పనులవల్ల ఎంతో ప్రయోజనం ఉంది. రామ్మూర్తి బతికితే ప్రజల కెంతో మేలు చేస్తాడు. ఆ రామ్మూర్తిని తను బతికించింది"

వసంతకు తన మీద తనకు నమ్మకం, గౌరవం కలిగాయి. సర్వ ప్రపంచాన్నీ ప్రే మించాలనే గాఢమైన కోరిక కలిగింది.

ప్రపంచంలో అందరి కష్టాలూ అన్ని అనారో గ్యాలూ అశాంతులూ తుడిచెయ్యగల శక్తికోసం ఆమె మనసు ఆరాటపడింది.

★ ★ ★

రామ్మూర్తి ఇంకొకవారంలో వెళ్లిపోతాడనగా గుంటూరునుంచి శాంత రోహిణి వచ్చారు.

రామ్మూర్తి వచ్చినప్పటినుండీ వాళ్లకు ఉత్త రాలు రాయటం మానేసింది.

వారానికో ఉత్తరంరాసే వసంత నెలా పది హేనురోజులకు కూడా రాయకపోయేసరికి రో హిణీ శాంతా కాస్త కంగారుపడ్డారు.

"మళ్లీ డిప్రెషన్‌లోపడిందా?" అని భయప డి చూద్దామని వచ్చారు.

నవత స్టేషన్‌కి వెళ్ళివాళ్ళను తీసుకొ చ్చింది.

రోహిణిని చూడగానే వసంత ఆమెను హడా వుడిగా రామ్మూర్తి దగ్గరకు తీసుకెళ్ళింది.

అతని అనారోగ్యమంతా చెప్పి "అసలు నువ్వు చూడు" అంటూ కంగారుపెట్టింది.

రోహిణి అన్ని రిపోర్టులూ చూసి, వాడిన మందులుచూసి ట్రీట్‌మెంట్ సరైనదే అంటే గాని వసంత తృప్తిపడలేదు.

శాంత వసంతను చిత్రంగా చూసింది.

ఆరోజు గడిచేసరికి వసంతలో వచ్చినమా ర్పు ఇద్దరికీ అర్థమయింది.

"నువ్విలా మారతావని ఒక్కనాటికీ అనుకో లేదే- రోహిణి ఫరవాలేదులే కొలుకుంటుంది అంటున్నా నేనైతే నువ్వు ఏ ఆత్మహత్యే చేసు కుంటావని భయపడ్డాను" అంది శాంత.

"ఇదంటా నవత సాధించింది" అంది రోహిణి.



"కానీ నవతకి ఈ రాజకీయాలు, ఈ జీవితం లేకపోతే వసంత ఏమయ్యేది?" అంది శాంత.

"ఏమయ్యేదాన్నోగాని- ఏమీ కాకూడదని మాత్రం అనుకుంటున్నానే- భర్త, పిల్లలేకాక బోలెడు జీవితం ఉంటుంది- ఆ జీవితం ఎంతో బాగుంటుంది అని తెలిస్తే ఎవరూ నాలాగా ఆ సంసారంలో కూరుకుపోరు. అంతగా కూరుకోకపోతే ఆ సంసారం కోసం చచ్చిపోరు. ఈ రాజకీయాలనే కాదు- మీరిద్దరూ మాత్రం- నీ స్టూడెంట్సు, నీ పేషెంట్లు- వాళ్ళకి మీ జీవితాలు ఎంత అవసరం. మన జీవితాలు ఇంటిచాకిరికే కాక సమాజంకోసం అనుకుంటే ఎంతబాగుందో చెప్పలేను" అంది వసంత.

"కానీ నాకీ రాజకీయాల మీద చాలా సందేహాలున్నాయి. నువ్వు మళ్ళీ కష్టాల్లోకి పోతావేమో అని నాకు భయంగా ఉంది" అంది శాంత.

"కష్టాలు... మనచుట్టూ ఉన్న జీవితం మనది కావాలిగానీ కష్టాలదేం ఉంది. ఒకప్పుడు పండక్కి పిల్లలకీ నాకూ కొత్త బట్టలు లేకపోతే అదే పెద్దకష్టం నాకు. పండక్కి



పిల్లలకన్నా కొత్తబట్టలు లేవే అని రెండురోజు లు విపరీతంగా బాధపడ్డాను. ఇప్పుడు కష్టాల కీ సుఖాలకీ కూడా కొత్త అర్థాలు నేర్చుకుంటు న్నా'' అంది వసంత.

"కష్టాలో సుఖాలో ఏవో ఒకటి జీవితం ప్రవహించాలి శాంతా- నిలవనీరులాగా ఉండ కూడదు. కొన్ని పరిధుల్లోనే చిక్కుకోకూడదు. జీవితాన్ని కాస్త విశాలంగా అనుభవాలతో నిండేలాగా చేసుకోవాలి. ఆడవాళ్ళ జీవితా లకు ఆ అవకాశం చాలాతక్కువ. ఈ రాజకీ యాల సంగతి నాకు తెలియదుగానీ వసంత కింత శక్తి ఇచ్చినవి మంచివే అయ్యుంటాయి అనిపిస్తోంది-'' అంది రోహిణి.

శాంత తన కాలేజీ విద్యార్థినుల్లో రాజకీయా ల్లో ఉన్నవాళ్ళే ఎలా డీసెంట్‌గా ఉంటున్నారో, మిగిలినవాళ్ళు ఎంత వెర్రిగా ఏ విలువలూ లేకుండా తయారవుతున్నారో చెప్పింది.

వసంత రాజ్యలక్ష్మి విషయం వాళ్ళిద్దరితో చెప్పింది. అమ్మాయిలు ఇంత ధైర్యంగా వివే కంగ నిజాయితీగా ఉండటం చాలా బాగుందన్నారు వాళ్ళు. వాళ్ళున్న రెండు రోజులూ సందడిసందడిగా గడిచిపోయాయి.

★ ★ ★

"మీ స్నేహితులొచ్చేసరికి నన్ను పూర్తిగా మర్చిపోయారు'' అన్నాడు రామ్మూర్తి నవ్వు తూ.

"అదేంకాదు. మీక్కాస్త ఆరోగ్యం వచ్చేసరికి నన్ను మరిచిపోయారు. మీ చదువు, మీ రాత మొదలుపెట్టారు'' అంది వసంత తనూ నవ్వుతూ.

"ఎల్లుండినేను వెళ్తాను'' అన్నాడతను.

"ఎక్కడికి?' అంది వసంత చాలా ఆశ్చ ర్యంగా.

"ఎక్కడికో ఇచోటికి వెళ్ళాలిగదా. ఆరో గ్యంగా ఉండికూడా ఇక్కడే ఉంటానంటే ఒప్పుకుంటారా?'' అన్నాడు నవ్వుతూ.

"ఇంకో పదిరోజులు విశ్రాంతిగా ఉంటే బాగుంటుంది'' అంది వసంత దిగులుగా.

రామ్మూర్తి వెళ్ళిపోతాడనే ఊహే ఆమెకు బాగోలేదు.

"ఇప్పటికే విశ్రాంతి ఎక్కువయిందిలెండి. పనులన్నీ ఆగిపోయాయి. వెళ్ళి పనిరాక్షసుడి నయితేగాని-''

"వెళ్ళి మళ్ళీ తిండీతిప్పలూ లేకుండా పనిచేసి ఆరోగ్యం చెడగొట్టుకుంటారా?''

"బాగుచెయ్యటానికి మీరున్నారుగా- దర్జాగా చెడగొట్టుకుంటాను''

ఇద్దరూ నవ్వుకుంటుంటే నవత వచ్చింది.

"రామ్మూర్తిగారు ఎల్లుండి వెళ్ళిపోతారట''-

ఎంత అన్యాయమో చూడమన్నట్లు చె ప్పింది నవతతో.

"అమ్మ మీకోసం బాగా దిగులుపడుతుంది. మీకు సేవచెయ్యటం బాగా అలవాటైంది. నిద్రలోకూడా అదే కలవరింత. ఓపని చె య్యండి- మీరున్న ప్రాంతాల్లో ఎవరికి జబ్బుచే సినా అమ్మ దగ్గరికి పంపెయ్యండి'' అంది నవ్వుతూ-

ఓరోజు సాయంత్రం చల్లగాలికి బీచ్‌కి వెళ్దా మని బయల్దేరారు నవత, వసంత.

ఇంటికి తాళంపెడుతుండగా చంద్రశే ఖరం వచ్చాడు "ఎక్కడకీ బయల్దేరారూ'' అంటూ.

"ఊరికే అలా సముద్రందాకా వెళ్ళొద్దా మని'' అంది నవత.

వసంతకు చంద్రశేఖరాన్ని చూడగానే రాజ్యలక్ష్మి అతనికి ఉత్తరం రాసి ఉంటుందని అర్థమయింది. ఏమంటాడితను అనే ఆదు ర్దాతో నిండిపోయిందామె మనసు.

"రండి... నేనుకూడా మీతోపాటు వస్తాను'' అంటూ గేటు తీశాడు.

ముగ్గురూ వెళ్ళి బీచ్‌లో కూచున్నారు.

సాయంత్రపు ఎండలో సముద్రం వింతగా మెరుస్తూ ముందుకొస్తోంది.

వసంత మనసుకూడా సముద్రమంత ఉద్వే గంగా ఉంది.

నవత కుతూహలం, ఆందోళన కలగలసిన చూపులతో చంద్రశేఖరాన్ని చూస్తూ.

"చెప్పండి'' అంది.

"నేను రాజ్యలక్ష్మికి ఇంతకుముందే ఉత్తరం రాసి పోస్టు చేశాను. మీతోకూడా మాట్లా డాలనిపించి ఇలావచ్చాను'' అన్నాడతను కాస్త

ఇబ్బందిపడుతూ.

వసంత అసహనంగా కదిలింది.

"రాజ్యలక్ష్మి రాసిన ఉత్తరం చూస్తారా"

అతను జేబులోంచి కాగితాలు తీస్తున్నాడు

"ఒద్దులెండి. తనేంరాసి ఉంటుందో నాకు తెలుసు. మీరేమనుకుంటున్నారో చెప్పండి" అంది నవత.

"నేనేమంటాను. రాజ్యలక్ష్మి నాప్రేమను ఎంతత్వరగా అంగీకరిస్తే అంత బాగుంటుందని ఎదురుచూస్తున్నాను"

వసంత మనసులోంచి పెద్దబరువు దించుకున్నదానిలా నిట్టూర్చింది.

"రాజీ మీ ప్రేమను అంగీకరిస్తుందని మీకర్థంకాలేదా" అనడిగింది నవత.

చంద్రశేఖరం అర్థంకానట్లు చూశాడు.

"మీ ప్రపోజల్‌ని అంగీకరించే ఉద్దేశమే లేకపోతే ఈ విషయం మీతో ఎందుకు చర్చిస్తుంది?"

ఇప్పుడు చంద్రం ముఖం విప్పారింది. అతని కళ్ళల్లో కాంతిచూసిన వసంతకు రాజ్యలక్ష్మి గురించి ఉన్నదిగులంతా పోయింది.

"రాజ్యలక్ష్మి నాతో ఆ విషయాన్ని ఏ దాపరికమూ లేకుండా చెప్పినందుకు నాకు చాలా గర్వంగా ఉందండి. తన నిజాయితీ, నామీద ఉన్న నమ్మకం ఇవన్నీ అర్థమయ్యాయి. రాజ్యలక్ష్మిలాంటి అమ్మాయి దొరకటం నాఅదృష్టం" అన్నాడు.

"మీరు మరీ ఆవేశపడుతున్నారు. ఈ ఆవేశం కలకాలం నిలుస్తుందా?" తమాషాగా అడిగింది నవత.

"అంటే" దెబ్బతిన్నట్లు చూశాడు చంద్రం.

"మీరిప్పుడేదో త్యాగం చేస్తున్నట్లు- తప్పుచేసిన ఓ పిల్లని క్షమిస్తున్నట్లు ఇప్పుడు ఉబ్బితబ్బిబ్బవుతారు. తర్వాత నువ్వు తప్పుచేశావు. నువ్వలాంటిదానివి ఇలాంటిదానివి అని జీవితాంతం సాధించిపెడతారు. అట్లాగయితే మీరు రాజీ గురించి మర్చిపోవటం మంచిది" అంది నవత చాలా కఠినంగా.

"అవేంమాటలు నవతా... ఎందుకలా మాట్లాడుతున్నావు?" వసంత కంగారుపడింది.

"ఫరవాలేదులెండి. ఆమాటలు పడటానికి ఒక మగవాడిగా నాకు అర్హతుంది. కానీ నేను మగవాడిగా ఉండకూడదని తీవ్రంగా ప్రయత్నించేవాళ్ళల్లో ఒకడిని. రాజ్యలక్ష్మి తప్పు చేసిందనో మరొకటనో అసలు అనుకోవటం లేదు"

"మరి రాజీ నిజాయితీపరురాలని ఎందుకు అనుకుంటున్నారు? అది చేసిన తప్పు మీతో చెప్పిందనేనా కాదా? అసలా విషయం మీతో చెప్పాల్సిన అవసరం ఏముంది? ఒకవేళ రాజీ ఏకారణం చేతనన్నా మీతో ఆవిషయం చెప్పకపోతే నిజాయితీలేనట్లూ, మోసంచేసినట్లు అవుతుందా? ఆ విషయానికి అంత ప్రాముఖ్యత ఉందని మీరు అనుకుంటున్నారా? ఒక మనిషిని కేవలం ఆ విషయం ద్వారా అంచనా వెయ్యటం మంచి చెడ్డలు ఆపాదించటం కరక్టేనా?"

నవత మాటలు వింటున్న వసంతకు ఆశ్చర్యానందాలతో మనసు నిండిపోయింది.

ఈ ఆడపిల్లలు ఎంత ఆత్మగౌరవంతో ఉన్నారు. ఎలా ఆలోచిస్తున్నారు. ఎంత ధైర్యంగా స్పష్టంగా విషయాలను చెప్పగలుగుతున్నారు, ఆడపిల్లలు ఇలాఉంటే ఎన్ని సమస్యలు తప్పుతాయి- అని ఆలోచిస్తూ నవతకేసి కొత్తపిల్లను చూసినట్లు చూస్తోంది.

చంద్రశేఖరం ఆలోచనలోపడ్డాడు.

కాసేపు ఆలోచించి తనలో తను మాట్లాడుకుంటున్నట్లుగా చెప్పాడు-

"నేను నవీన్‌కీ రాజ్యలక్ష్మికీ మధ్య జరిగిన విషయం చాలా ముఖ్యమైందనిగానీ, అదే రాజ్యలక్ష్మి మంచిచెడ్డల్ని నిర్ణయిస్తుందనిగానీ అనుకోవటం లేదు. అయితే ఆ విషయానికి సమజంలో ఒకరకమైన ప్రత్యేకత ఉంది. రాజ్యలక్ష్మి కాకుండా మరో అమ్మాయైతే ఆ విషయానికి ఆత్మహత్యదాకా వెళ్ళినా ఆశ్చర్యపడనవసరం లేదు.

అలాగే సాధారణంగా మగవాళ్ళు ఈ విషయాన్ని ఎలా తీసుకుంటారో కూడా మీకు తెలుసు.

రాజ్యలక్ష్మి ఈ విషయాన్ని తీసుకున్నతీరూ- నేను ఎలాంటి మగవాడినో తేల్చుకున్నాకగాని

నన్నుగురించి ఆలోచించగూడదని ఆమె అనుకున్నతీరూ నాకు నచ్చాయి.

ఆ రెండింటికోసమే నేనామెను నిజాయితీ అనో మరొకటో అంటున్నానుగానీ మరింకో ఉద్దేశంతో కాదు. ఆమేదో తప్పుచేసిందనీ, నేనేదో ఉద్ధరిస్తున్నాననే భ్రమలు నాకులేవు. నన్ను అపార్థం చేసుకోవద్దు'' అన్నాడు కాస్త సీరియస్‌గా.

నవత అతని సమాధానంతో సంతృప్తిపడిన ట్లు ఇంకేమీ మాట్లాడకుండా కూచుంది.

వసంతే చొరవతీసుకుని అడిగింది-

''మరి పెళ్ళి ఎప్పుడు చేసుకుంటారు?'' అని.

''నీకంతా తొందరమ్మా'' అని విసుక్కుంది నవత.

''ఆవిడ ఎప్పుడంటే అప్పుడు, అంతా ఆవిడ ఇష్టంమీదే ఆధారపడి ఉంది'' అన్నాడు చంద్రం.

''మీ ఉద్యోగాన్ని నమ్ముకోవచ్చా?'' అంది నవత.

''నా ఉద్యోగానికేం- కడుపులో చల్లకదలకుండా కూచుని చేసుకునేది'' అన్నాడు.

అతను ఓ బ్యాంకులో గుమస్తాగా పనిచేస్తున్నాడు.



**చూ**స్తూ చూస్తూ ఉండగానే సంవత్సరం గడిచిపోయింది. నవత మూడో సంవత్సరం పరీక్షలు అయిపోయాయి. శలవుల్లో హైదరాబాద్ వెళ్ళి పదిహేనురోజులుంది. వసంత ఏమీ బాధపడకుండానే నవతను పంపించింది.

వసంతకిప్పుడు చేతినిండా పని. ఇంట్లో ఎప్పుడూ ఎవరో ఒకరుంటారు. నవత స్నేహితులు, యూనియన్‌లో పనిచేసేవాళ్ళూ, అప్పుడప్పుడూ వచ్చే పార్టీ కార్యకర్తలు, పొరుగూళ్ళనుంచి వచ్చే విద్యార్థిసంఘసభ్యులు- ఇంట్లో ఎప్పుడూ సందడే.

వసంతకిప్పుడు బైటికి వెళ్ళి చెయ్యాల్సిన పనులుకూడా ఎన్నోఉన్నాయి. వాటన్నిటితో వసంతకు ఒంటరితనం అంటే ఏమిటో తెలియకుండా పోయింది.

అందుకే నవత- ''నువ్వీ పదిహేనురోజులూ రోహిణత్త దగ్గరకు వెళ్ళరాదూ'' అన్నా ఒప్పుకోలేదు.

''బొత్తిగా ఇల్లు తాళంపెట్టి వెళితే ఎలా? ఎప్పుడు ఏ అవసరం ఒస్తుందో. నువ్వు హైదరాబాద్ నుంచివచ్చాక నేను వెళ్తాలే'' అంది.

నవత నిశ్చింతగా హైదరాబాద్ వెళ్ళివచ్చింది. హైదరాబాద్ కబుర్లేమిటని వసంత ప్రత్యేకంగా అడగలేదు. నవతే తండ్రి గురించి నాలుగు ముక్కలు చెప్పింది. ''అత్తా వాళ్ళింట్లో రెండురోజులున్నానమ్మా- తగబోరు కొట్టిందనుకో. పాపం వాళ్ళ సుమిత్ర ఎంత దారుణంగా తయారయిందంటే చెప్పలేం. ఆపిల్లకు మెడిసిన్‌లో సీటురాలేదని అత్త రోజూ సాధించటంతో ఆపిల్ల తనెందుకూ పనికిరానిదాన్నా అనే ఆలోచనలో పడింది. ఇరవైనాలుగు గంటలూ చదువే- అత్తవాళ్ళింటికి పేపరుకూడా తెప్పించడంలేదు. అక్షరమ్ముక్క కనపడిందంటే అది మెడిసిన్ ఎంట్రన్సుకి సంబంధించినదే- ఒక తమాషా తెలుసా?

ఎనిమిది గంటలనుంచీ తొమ్మిది గంటల దాకా అత్తావాళ్ళింటి ఏరియాలో కరెంటుపోతుంది. అప్పుడిక బజర్ సెక్షన్ మొదలవుతుంది.

అత్తామామా ఇద్దరూ కొవ్వొత్తుల వెలుగులో పుస్తకాలు చూస్తూ టకటకా అడుగుతుంటారు. సుమిత్రకూడా టకటకా చెప్పేస్తూనే ఉంటుంది. సీటెందుకు రాలేదో మరి-''

ఆ సన్నివేశం గుర్తుకు తెచ్చుకుని కళ్ళనీళ్ళొచ్చేలా నవ్వింది నవత.

''పోనీ పాపం- ఎలాగైనా సుమిత్రను డాక్టర్ని చెయ్యాలని లక్ష్మి ఆరాటం- చదివించకపోతే





ఎలా?'' అంది వసంత నవ్వుతూ.

''అలా చదివిస్తే సీటు వచ్చినారాదు. అయినా అమ్మా ఒకవేళ సుమిత్ర డాక్టరయినా ప్రాక్టీసు చేసేదంతా వాళ్ళ అమ్మానాన్నలే- ఎవరికి ఆపరేషను చెయ్యాలి. ఎవరికొద్దు అన్నీ వాళ్ళే చెబుతారనుకుంటా- ఇప్పుడైతే వాళ్ళు ఏంతినమంటే అవే తింటోంది. వాళ్ళు ఏబట్టలు వేసుకోమంటే అవే వేసుకుంటోంది. నాకు ఆ వరసచూసి మాతృభక్తి పితృభక్తి కంటే హీనమైన పాపం మరొకటి లేదని పించింది''

''అయితే నామీద నీకు భక్తిలేదన్నమాట'' అంది వసంత నవ్వుతూ.

''లేదుగాక లేదు. అమ్మంటే నాకు ప్రేమ- ఇష్టం'' వసంతను ముద్దుపెట్టుకుంది నవత.

''సుమిత్రకు కూడా వాళ్ళమ్మంటే ప్రేమకా బట్టే అవన్నీ చేస్తోందేమో''

''అలా ఏంకాదు- లోపల తిట్టుకుంటూ ముఖం మాడ్చుకుని చేస్తుంది. భయంతో తన మాట సాగదని తెలిసిచేస్తుంది. అలాచె య్యటం కంటే వాళ్ళమ్మమాట కాదని తన ఇష్టం ఒచ్చినట్లు ఉంటేనే ఆమె మీద ప్రేమ ఉన్నట్లు- ''

''నీదంతా తలతిక్క వ్యవహారంలే- ''

''నాదికాదు- ప్రపంచమే తలతిక్కగా ఉంది''

నవత పోట్లాటకు సిద్ధమయింది.

''సరేలే- ఒప్పుకున్నాను గానీ ఈ పదిహేను రోజుల్నించీ వీణ ఒక్కసారికూడా రాలేదు. ఏమయిందో ఏమిటో ఇవాళ సాయంత్రం వాళ్ళి ంటికన్నా వెళ్ళిచూసొద్దాంపద. నేనొక్కదాన్నే వెళ్ళలేక ఊరుకున్నాను'' అంది.

''ఒక్కసారి కూడా రాలేదా?'' నవత ఆలోచ నలో పడింది.

''ఎవరొచ్చారు? రమణమూర్తి వచ్చాడా?''

''అతనొచ్చాడు. రెండుసార్లు. ఎంతలే పది నిముషాలుండి వెళ్ళాడు''

ఆ సాయంత్రం వసంతను వద్దని ఒక్కత్తే బయటకు వెళ్ళిన నవత రాత్రంతా ఇంటికి రాలేదు. వసంతకది అలవాటైనా కాస్త కంగార నిపించింది ముందుగా చెప్పి వెళ్ళలేదే అని.

అర్ధరాత్రి దాటాక పార్టీ మెంబరొకతను అంతకుముందు చాలాసార్లు వచ్చినతనే వచ్చాడు.

వసంతకు రెండుగంటల సేపు ఉపన్యాస మిచ్చాడు.

వసంతకు అతను చెప్పిన విషయాలు చాలావరకు అర్థంకాలేదు. పార్టీలో చాలా తప్పు లు జరుగుతున్నాయని అతను చెబుతున్నా డని మాత్రం అర్థమయింది.

''ఈ విషయాలు నవతతో చెప్పండి. ఈ ఉత్తరాలూ, ఈ కాగితాలూ ఆమెకివ్వండి'' అని ఓ కట్ట యిచ్చి అతను తెల్లవారుతుండగా వెళ్ళిపోయాడు.

మర్నాడు సాయంత్రానికిగాని నవత రాలే దు.

నవత ముఖం చూడగానే ఏదో పెద్దప్ర మాదం జరిగిందని అర్థమయింది వసంతకు.

''ఏమిటని'' అడిగితే-

''ఏవో పార్టీ గొడవల్లే'' అంది నవత.

రాత్రి మధుసూదన్ వచ్చాడంటూ అతని చ్చిన కాగితాలన్నీ ఇచ్చింది.

నవత రాత్రంతా ఓపిగ్గా కూచుని అవన్నీ చదివింది. మర్నాటినుంచీ నవత బైటికి కదల లేదు. ఎవరూ రాలేదు. వసంతకు ఊపిరాడన ట్లయింది.

''ఏమయింది? ఎందుకలా ఉన్నావు? ఎవ రూ రారేమిటి?'' అంటే నవత చాలాసేపు మాట్లాడలేదు.

చివరకు ''పార్టీలో చీలిక వచ్చిందిలేమ్మా'' అంది.

''చీలికా...ఎందుకు?''

''ఎందుకో ఎలాచెప్పాలో నాకేం అర్థంకా వటం లేదు. నాకేం బాగోలేదు. నాలుగు రోజు లు గడవనీ'' అంది.

వసంతకు నాలుగు రోజులు గడిచేసరికి పిచ్చెక్కినట్లయింది. నవత సరిగా తిండి తిన డంలేదు. మాట్లాడటం లేదు.

విషయమేమిటంటే '' ఏం లేదులే'' అంటుంది.

వసంతకు బాగా భయంవేసింది.

రాజ్యలక్ష్మికి టెలిగ్రాం ఇచ్చింది.

మూడోరోజుకి రాజ్యలక్ష్మి వచ్చేసరికే నవత కాస్త మామూలయింది.

అంతకుక్రితం రోజే సమత అనే అమ్మాయి, గోపీ శ్రీనివాస్‌లు వచ్చారు.

వాళ్ళతో కలిసి మాట్లాడాక నవతలో కాస్త జీవమొచ్చినట్లయింది.

రాజ్యలక్ష్మి వచ్చేసరికి ఇంట్లో కాస్త కదలిక వచ్చింది.

రాజ్యలక్ష్మి "ఏంటి కథ" అనడిగేసరికి-

"ఏముంది-పాతకథే. మళ్ళీ రెండు ముక్కలు" అని నవ్వగలిగింది నవత.

"ఈసారేమిటి కారణం. ఎందుకట చీలిక?" అడిగింది రాజ్యలక్ష్మి.

"అదీ పాతదే- మూడు ప్రపంచాల సిద్ధాంతం"

"మైగాడ్- మళ్ళీ మూడు ప్రపంచాలా- అదేం సిద్ధాంతమే?" అంది రాజ్యలక్ష్మి ఆశ్చర్యంగా.

"అదే నాకూ అంతుబట్టటం లేదే. చీలిన ప్రతిసారీ మూడు ప్రపంచాల సిద్ధాంతం అంటారు. తరవాత గొడవలన్నీ మామూలే. నన్ను మైనారిటీ చేసి నాఅభిప్రాయాలన్నీ తొక్కిపట్టారని ఒకరు-తనవైపు జనాన్ని కూడగట్టుకోటానికి కుట్రచేశారని మరొకరు-జరిగిన తప్పులకు మీరు బాధ్యులంటే మీరు బాధ్యులని నిందలేసుకోవటం-చివరకు మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని లాక్కొచ్చి అడ్డంపెట్టడం"

"మూడు ప్రపంచాలేమిటి?" అంది వసంత

"ప్రపంచంలో దేశాలన్నిటినీ మూడు గ్రూపులు చెయ్యొచ్చులేమ్మా- బాగా సంపన్న దేశాలు, ఓ మాదిరి దేశాలు, దరిద్ర దేశాలు- ఒక్కో గ్రూపూ ఒక్కో ప్రపంచం. సంపన్న దేశాలు దరిద్ర దేశాల్ని అణిచి పెత్తనం చేయాలని చూస్తుంటాయి"

"మరి అందులో పేచీ ఏమిటి?"

"ఏమీ లేదు"

"మరి దానికోసం చీలటమెందుకు?"

"అదేకదా అర్థంకాదు"

"ఒకవేళ అది సరికాదనుకో. ఇప్పుడేం కొంప మునుచుకుపోయిందట. మూడు ప్రపంచాల సిద్ధాంతంవల్ల కాదుగా ఇప్పటి మన సమస్యలు. ఇప్పుడు మన భూస్వాములకు వ్యతిరేకంగా జనాన్ని కూడగట్టటానికి ఆ సిద్ధాంతం అడ్డం వస్తుందా?"

"అది తెలియకే నాకు పిచ్చెక్కుతోంది"

"అదో మునుగులేవే- ఎవరు పెత్తనం చేయాలనే దగ్గర వచ్చిన పేచీలన్నీ మూడు ప్రపంచాల మునుగు కింద దాక్కుంటాయి" అంది రాజ్యలక్ష్మి.

"అందుకేనా వీణావాళ్ళంతా రావటంలేదు. మూడు ప్రపంచాల సిద్ధాంతమేమిటో నాకు తెలియనే తెలియదు గదా- దానికోసం నన్ను చూడటానికి రాలేదా?" వసంత విస్మయంగా అడిగింది.

"ఊ- వీణ మొన్న బజార్లో కనిపిస్తే పలకరించా- చాలా అయిష్టంగా ముభావంగా నాలుగు ముక్కలు మాట్లాడింది. నిన్నటిదాకా కలిసి పనిచేశాం. మూడు ప్రపంచాల సిద్ధాంతం దానికీ సరిగ్గా తెలియదు. పార్టీ లోపలి గొడవలు ఇద్దరికీ ఒకేసారి తెలిశాయి. అయినాసరే అదోవైపు చేరిపోయింది. నేనటురానని దానికి పైవాళ్ళెవరో గట్టిగా చెప్పినట్లున్నారు. బహుశా నాతో మాట్లాడొద్దని కూడా చెప్పారేమో- నాతో పలకటమే మానేసింది.

మేం కలిసి చేసిన పనులకూ, కలిసి గడిపిన జీవితానికీ ఇప్పుడు మామధ్య వచ్చిన విషయాలకీ ఏమీ సంబంధం లేదు. ఐనాసరే కనీసం స్నేహం అయినా మిగుల్చుకుందామనే ఆలోచనలేదు. ఎందుకిట్లా జరుగుతోందో అర్థంకాదు" నవత తలపట్టుకు కూచుంది.

రాజ్యలక్ష్మి తన శాయశక్తులా నవతను ఉత్సాహపరచాలని ప్రయత్నించింది.

రాజ్యలక్ష్మితోపాటు చంద్రశేఖర్ కూడా అక్కడే ఉండిపోయాడు.

చంద్రశేఖర్ చెల్లెలు సరళ రాజ్యలక్ష్మిని చూడాలని వచ్చి తనూ ఉండిపోయింది.

హాసపరిహాసాలతో మళ్ళీ ఇల్లంతా సందడయింది. నవత రాజ్యలక్ష్మి ఏదో ఒక కారణానికి





చంద్రశేఖరాన్ని దబాయించబోయేవారు-

వసంత, సరళ కలిసి చంద్రశేఖరం పక్షమై వీళ్ళిద్దరి నోరూ మూయించేవారు.

నలుగురు ఆడవాళ్ళూ తనగురించి కొట్లా డుకుంటుంటే చిద్విలాసంగా కూచునేవాడు చంద్రశేఖరం. అది గమనించిన నవత మన తగాదాలవల్ల మగవాడు సుఖపడుతున్నాడు మనం ఐక్యంకావాలనేది.

"చంద్ర మగాడు కాదులే" అని వసంత చంద్రంవైపు నుంచి ఒక్క అంగుళంకూడా కదిలేదికాదు.

సరళ కాసేపు ఊగిసలాడి మళ్ళీ వసంత వెనకాలచేరేది.

రాజ్యలక్ష్మి పదిరోజుల్లో వెళ్ళిపోయింది- మళ్ళీ నాలుగు నెలల్లో ట్రైనింగు ముగించి శాశ్వతంగా వస్తానని.

ఇంట్లోకి కావాల్సిన సరుకులేవో కొనుక్కొని వద్దామని వసంత బజారుకి వెళ్ళింది. నవత పరీక్షలకోసం చదువుతోంది. సంవత్సరమంతా ఆపనులూ ఈపనులూ అంటూ తిరిగిన నవత స్నేహితులు కూడా లైబ్రరీల్లోనో ఇళ్ళల్లోనో కూర్చుని చదువుతున్నారు. నవత కూడా పగ లంతా లైబ్రరీలో చదువుకుని సాయంత్రానికి ఇంటికి చేరుతుంది. పగలంతా వసంత తీరి కగా ఉండటంతో నవతనడిగి పుస్తకాలు తీసు కుని చదువుతోంది.

నవత ఇంటికి రాగానే తల్లి ఏ పుస్తకం ఎంతవరకూ చదివిందో అడిగి దానిగురించి ఏదో ఒకటి మాట్లాడేది. వసంత నచ్చిందంటే ఎందుకు నచ్చిందనీ, నచ్చలేదంటే ఎందుకు నచ్చలేదనీ, అర్థంకాలేదంటే ఎందుకు అర్థంకాదూ మనిద్దరం చదువు కుందాంరా-అంటూ రాత్రి పడుకునేవరకూ వసంతను సాధిస్తూనే ఉండేది. వసంతకు మొదట్లో చదివిన వాటిగురించి మాట్లాడటం ఇష్టంఉండేది కాదు. చేతనయ్యేదికాదు. నవత ను వినుక్కునేది. నవతమాత్రం తన పట్టు వదిలేదికాదు.

"నేను కూడా ఏదన్నా ఉద్యోగం చేస్తా" అనటం మొదలుపెట్టింది వసంత.

వసంతకు తేలికగా దొరికే ఉద్యోగం టీచర్ ఉద్యోగం. కానీ వసంతకు ఆ ఉద్యోగం చె య్యటం ఇష్టంలేదు. "నేను పాఠాలు చెప్పలే ను. చిన్నపిల్లలకు అర్థమయ్యేలా చెప్పటం నాకురాదు" అంటోంది.

రోహిణీ ఒకసారి ఉత్తరంలో రాసింది-

"నువ్వు నవతకోసం అక్కడుండే ఈ రెండే ళ్ళలో హాస్పిటల్ పనినేర్చుకుంటే తర్వాత నాదగ్గరకు రావచ్చు. నాదగ్గరకు వచ్చాకైనా నేర్చుకోవచ్చుగానీ ఇప్పుడు నీకు చాలా టైము వృథాగాపోతుందని చెబుతున్నాను. విశాఖపట్ట ణంలో ప్రాక్టీసు చేస్తున్న డాక్టర్ పతంజలి నా క్లాస్‌మేట్. మంచివాడు. అతని దగ్గరకు రోజూ కొంతసేపు వెళితే ఇంజక్షన్స్ ఇవ్వటం, కట్లు కట్టటంలాంటివి నేర్చుకోవచ్చు. నీ ఆసక్తినిబట్టి ఇంకా ఎక్కువ కూడా నేర్చుకోవచ్చు. నవత చదువయ్యాక నువ్వు నాదగ్గరకొస్తే నాకు నిశ్చింతగా ఉంటుంది.

కాస్త శ్రద్ధగా పేషెంట్లను చూసేవాళ్ళూ, నాకు సహాయపడేవారూ దొరకడం చాలా కష్టంగా ఉంది. నువ్వు వస్తే నాకు ఎన్నో సమస్యలు తప్పుతాయి. ఎంతో సహాయం చే సినదానివి అవుతావు. కేవలం నా స్వార్థంతోనే రాస్తున్నానీ ఉత్తరం" అంటూ రాసింది.

నవత కూడా ఈ ఆలోచన బాగుందన్నది. "మావాళ్ళకు ఎవరికి ఆరోగ్యం పాడయినా నీదగ్గరకు పంపుతాం" అంది ఉత్సాహంగా.

నవత పరీక్షలు అవగానే పతంజలిగారి దగ్గరకు వెళ్ళాలని అనుకుంది వసంత.

'రోహిణి దగ్గరకు వెళితే తనకూ బాగుంటుంది' అనుకుంటూ రోడ్డు దాటబోతు న్న వసంత చటుక్కున ఆగిపోయింది.

వీణ రోడ్డు దాటివస్తోంది. వసంత అక్కడే నిలబడిపోయి వీణను చూసి చిరునవ్వు నవ్వింది. వీణ ఇబ్బందిగా నిలబడిపోయింది.

"ఏం వీణా...కనబడటమే లేదు. బాగు న్నావా?" అంది వసంత.

"బాగానే ఉన్నాను" అంది వీణ నవ్వుతూ.

"ఇంటికి రావటమేలేదేం- ఇప్పుడు వెళ దాంరా" అంది వసంత.

"ఒద్దులేమ్మా" అంది వీణ.

"ఏం... ఎందుకురావు? నవతకోసం కాకపో యినా నాకోసమైనా రావచ్చుగదా- "

వీణ మాట్లాడలేదు.

"నవతకూ నీకూ మధ్య పేచీ ఏమిటి? మీరిద్దరూ అంత స్నేహంగా వుండేవాళ్ళుగదా. పార్టీలో చీలికవచ్చిందనుకో మీరిద్దరూ మాట్లాడుకోటానికి కూడా వీల్లేనంత దూరంకావాలా?"

"మా ఇద్దరి సిద్ధాంతాలు వేరైనాయమ్మా"

"ఏం సిద్ధాంతాలో నాకు తెలియదుగానీ నవతగానీ నువ్వుగానీ మీరు చెప్పే దోపిడీదార్ల పక్షమైనారని నేను నమ్మను. రేపు విద్యార్థులకు ఏదన్నా సమస్య వస్తే ఏంచేస్తారు? నవత సమ్మె చేయిస్తే నువ్వు అడ్డంపడతావా? ఎవరు చేయిస్తారు సమ్మె?"

"ఎవరికి బలం వుంటే వాళ్ళు చేయిస్తాం" బింకంగా అంది వీణ.

"మీరందరూ కలిసి చేయిస్తే సమ్మె బలపడుతుందిగా?"

"అవసరమైతే కలుస్తాం"

"మరి అలాంటప్పుడు ఒకరినొకరు శత్రువుల్లా చూసుకోవటందేనికి? అసలా చీలికలే అనవసరం అని అనుకుంటుంటే వీటికోసం మీ స్నేహాన్ని కాదనుకోవటం ఎందుకు? పోనీ సిద్ధాంత విభేదాలలా వుంచుకుని స్నేహం చెయ్యండి. ఒకరితో ఒకరు వాదించుకోండి. ఏది మంచిదో తేల్చుకోండి. మీ తేడాలమీద నవతతో ఎప్పుడన్నా మాట్లాడావా?"

నవత ఏమనుకుంటుందో అని కనుక్కున్నావా? ఎవరో చెప్పిన మాటలు విని వూరుకున్నావు. కనీసం వాటిని రుజువుచేసుకుందామని కూడా అనుకోలేదు"

వసంత ఆయాసంగా ఆగింది.

"నేనొక మాట అడుగుతాను. బాధపడకుండా సమాధానం చెబుతారా?" వీణ కాస్త కఠినంగా అడిగింది.

"చెప్పగలిగితే చెబుతాను"

"నవతా, వాళ్ళ నాన్నగారూ, మీరూ విడిపోయారు. మీరు మళ్ళీ ఆయనను చూడగలరా? మాట్లాడగలరా? నవత పెళ్ళిలోనో ఇంకో సందర్భంలోనో ఆయనతో కలిసి పనిచెయ్యగలరా? కలిసి కూచుని ఆలోచించగలరా? ఇంకొకళ్ళకు చెప్పటం తేలిక. మన సమస్యలు మనకే అర్థమవుతాయి- "

నివ్వెరపోయి వున్న వసంతను చూసి జాలేసిందో ఏమో- అనునయంగా-

"అమ్మా- మీరంటే నాకెంతో గౌరవం. నవతంటే కూడా నాకు ఇష్టమే. మేం మంచి స్నేహితులమే. కానీ మా ఆలోచనలు వేరయ్యాయి. ఒక విషయం గురించి నవత ఎలా ఆలోచిస్తుందో నాకు తెలుసు. అందుకే తనతో మాట్లాడటం అనవసరం అనుకున్నాను. నవతకు సిద్ధాంతంమీద పట్టులేదు. దానికి పని జరగటం ముఖ్యం. నాకు సిద్ధాంతం ముఖ్యం. ఎప్పుడన్నా కలిస్తే మాట్లాడుకుంటాంలే అమ్మా"

వసంత కాస్త తేరుకుంది.

"నేను మీకు చెప్పగలిగినదాన్నికాదు. కానీ మీరందరూ కలిసి పనిచెయ్యాలని నాకోరిక. ఈ కోరిక కూడా సిద్ధాంతానికి ద్రోహమేమో నాకు తెలియదు"

వీణకూ, వసంతకూ కూడా అక్కడినుంచి కదలాలని లేదు. మాటలు అయిపోయినట్లున్నాయి. ఏంచెయ్యాలో తెలియటం లేదు.

"ఎక్కడికి వెళ్తున్నావు?" అడిగింది వసంత.

"ఇంటికే- "

"మరింకేం... కాసేపు మాఇంటికి వెళదాం రాకూడదూ"

"మీరే మాఇంటికి రావొచ్చుగా"

"అన్నిటికీ పోటీ పెడుతున్నావు. సరే... మీ ఇంటికే వెళదాం పద" అంది వసంత.

వసంత అలా అంటుందని అనుకోని వీణ కాస్త ఇబ్బందిపడింది.

"ఎలా- బస్సులో వెళ్దామా?"

"ఒద్దు... రిక్షాలో వెళదాం పదండి" అంటూ ఓ రిక్షాను కేకేసింది.

"బాగా చదువుతున్నావా? నవత పగలంతా లైబ్రరీలోనే కూచుంటోంది. మీపరీక్షల హడావుడి చూస్తుంటే నాక్కూడా ఏదన్నా పరీక్ష రాయాలనిపిస్తోంది" చిన్నగా నవ్వింది వసంత.

"రాయొచ్చు" వీణ కూడా నవ్వింది.

"నాకు జీవితం పెట్టే పరీక్షల్లోనే సరిపోతోంది. యూనివర్సిటీ పరీక్షలెక్కడ రాయను?





ఒక పరీక్షలో పాసయ్యాననుకుంటే పిల్లలంద రూ కలిసి ఇంకోపరీక్ష పెట్టారు. ఇందులో పాసవుతాననే ఆశలేదు- ''

''మీరీ విషయాన్ని ఇంత సెన్సిటివ్‌గా తీసుకోకూడదమ్మా. మా స్నేహంకంటే ముఖ్యమైన విషయాలకోసం మా స్నేహం పోయింది''

''పోనవసరం లేదని నాకనిపిస్తోంది. సెన్సిటివో, అజ్ఞానమో మీ పరిభాషలో పెటీబూర్జువానో నాకు తెలియదుగానీ మూడు ప్రపంచాల సిద్ధాంతంకోసం మీ స్నేహం చెడటమెందుకు? మనదేశం సంగతులో ఇప్పుడు అర్జెంటుగా చెయ్యాల్సిన పనుల గురించో అసలు మీమార్గం గురించో తేడాలుంటే నేను అర్థంచేసుకుంటాను. అవేవీ లేవుగదా. దానికోసం ఒకరంటే ఒకరికున్న ఇష్టాన్ని చంపుకోవటం ఎందుకు?''

''మీకు తెలియదులేమ్మా''

''అమ్మాయ్ వీణా నాకింక కోపం వస్తోంది. ఏంటి నాకు తెలియంది? నాకూ, జనానికీ ఎవరికీ తెలియని, ఎవరికీ అర్థంగాని విషయాలతో ఏంచేస్తారు. అసలు మీ చీలిక విషయం నాకర్థంచేయించటం మీబాధ్యత. మీరేవేవో మాకర్థంకాని కారణాలు చెప్పి చీలిపోతామంటే మేంనోరుమూసుకుని కూచోవాలా. స్నేహితుల్లా పనిచేసిన వాళ్ళు చీలిపోయి ఒకళ్ళమీదఒకళ్ళు బురద చల్లుకోవటమేనా మీపని. నిన్న నవత చెబుతోంది- రామ్మూర్తిగారు పదేళ్ళనుండీ తప్పులు చేస్తున్నారని.
పదేళ్ళనుండీ తప్పులు చేస్తుంటే ఎవరూ ఎందుకు మాట్లాడలేదు? ఇప్పుడొక్కసారే ఆయన్ని తీసెయ్యటం, ఆయన వేరేపార్టీ పెట్టటం, ఇదంతా ఏమిటి?''

వీణ వసంత వంక ఆశ్చర్యంగా చూస్తోంది.

ఇంతలో ఇల్లు వచ్చింది.

''నేనీ మాటలు మాట్లాడినందుకే శత్రువునయిపోతానా? ఈ మాటలు నేను మీమీద కోపంతో మాట్లాడుతున్నానో, ప్రేమతో మాట్లాడుతున్నానో మీకు అర్థంకాకపోతే నేను చెయ్యగలిగిందిలేదు. అంతామాకు తెలుసు. ఎవరికీ ఏమీ తెలియదు అనే అహంకారంతో ఉండకండి. మీకు తెలియనివి ఉన్నాయి. అవి తెల్సుకోవాలి. మీకు తెలిసినవి అందరికీ తెలిసేట్లు చెయ్యాలి'' వీణ మౌనంగా ఇంట్లోకి నడిచింది.

వీణ వాళ్ళమ్మ బ్యాంకులో పనిచేస్తుంది. వసంతను చూడగానే-

''నేనే మీ ఇంటికి రావాలని చాలాసార్లు అనుకున్నాను. మీరిక్కడకు వచ్చి సంవత్సరన్నర అయింది. ఇంతవరకూ మిమ్మల్ని కలుసుకోకపోవటం నాతప్పే- క్షమించెయ్యండి'' అంది.

వసంత నవ్వి-

''మీకంటే మీ ఉద్యోగంతో ఖాళీ దొరకదు. నేనే రావలసింది- నాదే తప్పు'' అంది.

''ఏంటి... చూసుకోగానే ఎవరి తప్పులు వాళ్ళు చెప్పుకుంటున్నారు'' అంది వీణ మంచినీళ్ళు తెచ్చియిస్తూ.
''మాకు ఆత్మవిమర్శ చేసుకోవటం తెలుసు'' అంది వసంత నవ్వుతూ.

''అమ్మో- నీకిన్ని మాటలువచ్చని ఎప్పుడూ అనుకోలేదమ్మా చంపేస్తున్నావ్'' అంది వీణ.

వసుంధర, వసంత కాసేపు అవీయివీ మాట్లాడుకున్నారు.

వసంత వెళ్తానంటూ లేచింది.

''నవతను రమ్మని చెప్పండి'' అంది వసుంధర.

''మీరూ, వీణా మా ఇంటికి రండి'' అంది వసంత.

''ముందు మీరు'' వీణా అంది

''కాదు ముందు మీరు'' వసంత నవ్వింది.

''అబ్బా- చిన్నపిల్లలకంటే అన్యాయంగా మాట్లాడుతున్నావమ్మా'' అంది వీణ.

''మీరు మరీ పెద్దాళ్ళలాగా, గ్రామపెద్దల్లాగా తగాదాలువడుతుంటే మేం చిన్నపిల్లలంకాక తప్పుతుందా'' అంది వసంత బైటకు నడుస్తూ.

ఇంటికి వెళ్ళి ఇదంతా నవతకు చెప్పింది వసంత.

నవత తల్లివంక ఆశ్చర్యంగా చూసి-

''నువ్వు చాలా మారిపోయావమ్మా'' అంది.

''నువ్విన్ని విషయాలు ఇలా మాట్లాడగలవని నేనెప్పుడూ అనుకోలేదు''




"అవసరమొస్తే అన్ని తెలివితేటలూ అవే వస్తాయి. బ్రహ్మవిద్యలా ఏమిటి"

వసంత కూతురి ముందు సిగ్గుపడటానికి సిగ్గుపడింది.

★ ★ ★

"లావణ్య ఉత్తరం రాసింది. ఆ టేబుల్ మీద వుంది చూడు" అంది వసంత.

"ఏం రాసింది?" పెద్ద ఆసక్తిలేకుండా అడిగింది నవత.

"చదవరాదూ- ఊరికే బద్ధకిస్తావు"

"అబ్బా- అక్క ఉత్తరాలు చదవాలంటే నాకు పెద్ద బోరు. వాళ్ళఅత్తనీ, ఆడబిడ్డనీ ఆడిపోసుకోవటం తప్ప దానికింకోపనిలేదు. తనూ, తనభర్తా వీళ్ళిద్దరూ తప్ప లోకంలో ఇంకొకళ్ళెవరూ మంచివాళ్ళు లేరనుకుంటుంది. నాకు భలే జాలేస్తుంది అక్కను చూస్తే"

"నేను చెప్పిందేమిటి- నీవాగుడేమిటి" అంది వసంత నవత ధోరణిని ఆపుతూ.

"అదే- ఆ ఉత్తరంలో వాళ్ళ సంసారపుగొడవలు చదవటంలో నాకేం ఆసక్తిలేదు. విశేషాలేమన్నా వుంటే చెప్పు" అంది నవత తీరిగ్గా పడుకుని.

"విశేషమే ఉంది- లావణ్యకిప్పుడు మూడో నెల"

"నిజమా?" నవత సంతోషంగా నవ్వింది.

"భలే... అప్పుడే నువ్వు అమ్మమ్మవి"

నవత నవ్వుతుంటే-

"అప్పుడే ఏమిటి నాకు నలభై రెండేళ్ళు" అంది.

"ఆరోగ్యం బాగుందటనా? డాక్టర్ దగ్గరికి వెళ్ళిందా? పాపపుడితే బాగుండు. ఇంకా ఏడు నెల్లకా- అబ్బ- అన్నిరోజులు ఓపికపట్టాలా?"

నవత హడావుడి చూసి నవ్వింది వసంత.

"నీ హడావుడి బాగానే వుందిగానీ లావణ్య నన్ను వెంటనే బయల్దేరి రమ్మని రాసింది"

"ఎందుకూ?- నిన్ను చూడాలని ఉందేమో. వెళ్ళమ్మా. అక్కకి ఇష్టమైనవన్నీ ఒండిపెట్టొచ్చు. నాకు తెలుసు. ఈవంకతో అక్క తనకిష్టమైనవన్నీ తింటుంది. బాగా లావెక్కుతుంది- వెళ్ళిరామ్మా" అంది నవత ఉత్సాహంగా.

"వెళ్ళిరావటం కాదు. ఇక ఎప్పుడూ తనదగ్గరే ఉండాలట. తన దగ్గర ఉండటానికి వచ్చెయ్యమంటుంది"

"అదేంటి- ఎందుకలా" నవత ఆశ్చర్యపోయింది.

"ఉత్తరం చదవమంటే చదవకుండా ప్రశ్నలేస్తావు. చదివి మాట్లాడు" అంటూ తనే ఉత్తరం తెచ్చిఇచ్చింది.

ప్రియమైన అమ్మకు-

నీకు చాలా మంచి శుభవార్త రాస్తున్నాను. నాకిప్పుడు మూడోనెల. నిన్ననే డాక్టరు దగ్గరకు వెళ్ళి పరీక్షచేయించుకున్నాను. బాగా నీరసంగా ఉంది. ఏమీ తినబుద్ధికావటం లేదు. వంటగదిలోకి వెళితేనే వాంతొస్తుంది. ఎలాగో బలవంతాన వంటచేసి బయటపడుతున్నాను. పళ్ళూ, పాలూ తప్ప ఏమీ తినటంలేదు. మీ అల్లుడుగారు నా అవస్థచూసి "మీఅమ్మను రమ్మని రాయి" అన్నారు. నాకయితే చాలా ఆశ్చర్యంవేసింది. ఆయన తనంతటతాను నేనడక్కుండానే నిన్ను రమ్మన్నారు. నిజంగానా? నిజంగానా? అని రెండు మూడుసార్లడిగాను.

'నిజంగానే- అక్కడేం తోస్తుంది ఆవిడకు. నీకుసాయంగా ఉంటుంది. నువ్వు హైరానాపడకుండా ఆవిడ చూసుకుంటుంది. ఇప్పుడనే కాదు- రేపు బాబు పుట్టిన తర్వాత కూడా ఆవిడ యిక్కడే ఉండొచ్చు. నీకు పిల్లల్ని పెంచటం ఏంవచ్చు. ఆవిడ ఇక్కడుంటే నీకు దిగులుండదు. ఆవిడను తప్పకుండా రమ్మను'అని చాలాసేపు మాట్లాడారు. ఆయనకి నేనంటే ఎంతోప్రేమ. నాకు ఎట్లాగైతే సుఖంగా ఉంటుందా అని ఆలోచిస్తారెప్పుడూ. నాకు ఎప్పట్నించో నిన్ను ఇక్కడకు పిలిపించుకోవాలని ఉంది. నువ్వు అన్నిరకాల వంటలూ చేసిపెడితే హాయిగా తినొచ్చుగదా అనుకునేదాన్ని. వంట చెడగొట్టిన రోజల్లా నువ్వు గుర్తొస్తావు. కానీ మాఅత్తగారి సంగతీ, ఆడబిడ్డ సంగతీ తెలుసుగా వాళ్ళకు భయపడి ఆమాట అనలేకపోయాను. ఇప్పుడైతే ఆయనే స్వయంగా చెప్పారుగదా. మా అత్తగారు ఎప్పుడు ఏ సూటిపోటి మాటన్నా "నాకేం తెలియదు. మీ అబ్బాయిగారినే అడగండి. ఆయన ఇష్టప్ర



కారం ఆయన రమ్మంటేనే మాఅమ్మ వచ్చింది" అని కుండబద్దలు కొట్టినట్టు చెప్పే స్తాను. నువ్వు వెంటనే బయల్దేరిరా. నవత కాలేజీకి వెళితే నీకొక్కదానికీ ఎంతబోరుగా ఉంటుందీ?

వెంటనే బయల్దేరు.

వచ్చేప్పుడు జంతికలు, చలిమిడి మొదలై నవన్నీ చేసి తీసుకొస్తే ఇక మా అత్త మాట్లాడ టానికేమీ ఉండదు. చీరె- ఇంకా ఏమేమి తేవాలో నీకే బాగాతెలుసు గదా- అన్నీ తీసుకొ చ్చెయ్. మనవైపునుంచి ఏ చిన్నలోటు జరి గినా మా అత్త దాన్ని కొండంత చేసి ప్రచా రంచేస్తుంది.

అసలు నువ్వు హైద్రాబాదులోనే వుంటే మనింట్లో ఎంత వైభవంగానో సీమంతం జరు పుకునేదాన్ని- వాటన్నిటికీ ఎలాగూ నోచుకోలే దు. మిగిలినవన్నా సక్రమంగా జరపాలి. అప్పు డే నేనిక్కడ తలెత్తుకుని తిరగగలిగేది.

నువ్వు వెంటనే బయల్దేరు- టెలిగ్రాం ఇచ్చి బయల్దేరితే ఎవరో ఒకరం స్టేషన్‌కి వస్తాం.

ఇట్లు

లావణ్య

ఆ ఉత్తరం చదివి నవత మాట్లాడలేదు.

ఉత్తరం టేబుల్‌మీద పెట్టి మళ్ళీ మంచంమీద పడుకుంది.

వసంతే "వెళ్ళనా?" అని అడిగింది.

"నీ ఇష్టం" అంది నవత.

"నా ఇష్టమేలే- నీసలహా ఏంటి" అంది వసంత.

నవత మాట్లాడలేదు.

"మాట్లాడవేం" అంది వసంత.

"అక్కడగ్గరకు వెళ్ళటం వాళ్ళ పిల్లల్ని పెంచటం అదంతా ఒక కుటుంబంలా ఉండటం - నీ కూతురూ అల్లుడూ మనవలూ వీళ్ళతో ఉండటం - ఆ జీవితం కావాలను కుంటే వెళ్ళొచ్చు. అక్కకు సాయం చెయ్య టంలో ఆలోచించాల్సిందేమీ లేదు. కానీ - వాళ్ళందరి అనుమతితో ఆ సాయం చె య్యటం మాత్రం నాకు బాగోలేదు.

అసలా ఉత్తరమే నాకు బాగో లేదు. నా సంగతి తీసెయ్. నీకు లావణ్యంటే ఎంత ప్రేమో నాకు తెలుసు. ఈ సమయంలో తన దగ్గర ఉండాలనిపిస్తే వెళ్ళమ్మా" అంది నవత.

ఈసారి వసంత మాట్లాడకుండా కూచుంది.

"ఏంటమ్మా"అంది నవత ఆ మౌనాన్ని భరించలేనట్లు.

"మరి నువ్వేం చేస్తావు" వసంత హఠాత్తుగా అడిగింది.

"నేనా - నేనేం చేస్తాను. ఈ ఏడాదితో చదువు పూర్తి అవుతుంది. ఏదో ఓ ఉద్యోగం చూసుకుంటాను. నా సంగతెందుకిప్పుడు" అంది. అలా అన్నదే గాని నవతకు ఎందుకో ఆగకుండా దు:ఖం వచ్చింది.

అటు పక్కకు తిరిగి పడుకుని నిశ్శబ్దంగా ఏడుస్తోంది. వసంత మెల్లిగా లేచివచ్చి నవత పక్కన కూచుంది. వీపు మీద చెయ్యి వేసి.

"ఎందుకేడుస్తున్నావ్?" అని అడిగింది

నవత ఒక్కసారిటు తిరిగి తల్లి ఒళ్ళో తలపెట్టుకుని బావురుమంది.

"ఊరుకో పిచ్చిపిల్లా.. ఎందుకేడుస్తు న్నావు"?

"నేనేం చెయ్యనమ్మా... నేను నా జీవితం ఎలా గడపాలనుకున్నానో అలా గడపలేకపోతు న్నా. నాజీవితం అనుకున్నది నా జీవితం కాకుండా పోతున్నది. వీణ, రమణమూర్తి, సత్యం వీళ్ళందరూ కావాలమ్మా నాకు అందరం స్నేహంగా కలిసి పనిచెయ్యాలి. అందరం కలిసి సమాజాన్ని మార్చాలిఎట్లా"?

నవత చాలాసేపు అలాగే ఏడుస్తూ ఉండిపో యింది.

"నవతా - నేను ఇరవై ఏళ్ళపాటు ఏది జీవితం అని నమ్మానో అది జీవితం కాదని తేలిపోతే ఏం చేశాను?"

నవత బిత్తరపోయి తల్లి వంక చూసింది.

"మీ నాన్న, నేనూ మంచి భార్యాభర్తల మనీ, నేను లేకపోతే మీ నాన్న ఏ పనీ చేసుకోలేడనీ, భర్తా, ఇల్లూ, పిల్లలే నా జీవిత మనీ, పిల్లలకు పెళ్ళిళ్ళు చేసి వాళ్ళ సంసారా లు చూస్తూ వాళ్ళ పిల్లల్ని పెంచుతూ బతక టమే జీవితమని ఎంత గట్టిగా నమ్మాను!





ఎంత హఠాత్తుగా ఆ జీవితం అదృశ్యమయింది. ఇప్పుడు ఆ జీవితం అసలు జీవితమే కాదనుకుంటున్నాను. ఇప్పుడు నేను నిజంగా నీ కోసం బతుకుతున్నాను. భార్యాభర్తలు విడిపోవటం ఘోరం కాదమ్మా అన్నావు. సరిపడని భార్యాభర్తలు విడిపోవటమే మంచిదమ్మా అన్నావు. భర్తే భార్యకు లోకం కాదమ్మా అన్నావు. ఇప్పుడు ఏవో తేడాలొచ్చి మీ సంఘంవాళ్ళు విడిపోయారు. దానికి ఇంత దు:ఖపడాలా? ధైర్యంగా ఉండొద్దూ?" నవత తల్లివంక చూస్తూ ఉండిపోయింది.

"సంఘం విడిపోకపోతే బాగుండేది. నిజమే కానీ విడిపోయింది గదా - ఎవరికి మంచిదని తోచినరీతిలో వాళ్ళు నడవండి. ఆ పని మాత్రం ఆపకండి. మీ అందరి ఆశయం ఒకటే గదా - ఎప్పటికైనా కలుస్తారనే ఆశతో ఉండండి. వెళ్ళి శోభతో నువ్వే మాట్లాడు. నీలా ఆలోచించేవాళ్ళంతా కలసి ఈ సమస్య గురించి ఆలోచించండి. ఏదో ఒకటి చెయ్యండి. అంతేగాని దీనికి భయపడి అన్నిపనులూ మానేసి ఏడుస్తూ కూర్చుంటే ఎట్లా? ఏమవుతుంది? మనందరం కలిసి సమాజాన్ని మార్చాలి అనుకుని ఏదో ఒక ఆటంకం రాగానే ఆగిపోదామా? ఏదో ఒకటి చేద్దాం - మనకు మంచిదనిపించింది, సమాజానికి పనికొచ్చేది ఎన్ని పరిమితుల్లోనైనా ఎంత చిన్నగానైనా చేద్దాం. ఉత్సాహంగా ఉండు. అలా నీరసంగా ఏడుస్తూ ఉండకు -"

వసంత మాటలు వింటూ ఆలోచనలోపడింది నవత.

ఆ రోజు సాయంత్రం సుందరి కోసం ఎదురుచూస్తూకూచుంది వసంత. సుందరి నవతవాళ్ళ విద్యార్థి సంఘంలో పనిచేసిన అమ్మాయి. బి.ఎ చదివింది. సంవత్సరం క్రితం ఆ సంఘాలలో పనిచేసే అబ్బాయినే ప్రేమించి పెళ్ళి చేసుకుంది. అతను పూర్తిగా సంఘం పనుల్లోనే తిరుగుతుంటాడు. సుందరికి అనకాపల్లిలో ఓ ప్రైవేటు కంపెనీలో టైపిస్టు ఉద్యోగం దొరకటంతో అక్కడే ఉంటోంది.

సుందరికిప్పుడు తొమ్మిదో నెల. తల్లిదండ్రులకు ఇష్టంలేని పెళ్ళిచేసుకుంది గాబట్టి సుందరిని వాళ్ళు పురిటికి రమ్మని పిలవలేదు. వాళ్ళు పిలవకుండా వెళ్ళటానికి సుందరి అభిమానపడింది. ఒక్కత్తే ఆ రోజుని ఎదుర్కోటానికి భయపడుతోంది. సుందరి పరిస్థితి గమనించి వసంత తనదగ్గరకు రమ్మంది.

"ఆ మూడు నెలల సెలవులో నువ్వు నాదగ్గరే ఉండు. నీకు మొహమాటంగా అనిపిస్తే పేయింగ్ గెస్ట్‌గా ఉండు. నీ భారాన్నీ నీకు పుట్టేబిడ్డ భారాన్నీ నామీద వేసెయ్యి. నువ్వు నిశ్చింతగా ఉండు" అంది వసంత. సుందరి కూడా సంతోషపడింది. ఆరోజు నుంచి సెలవు పెట్టి సుందరి విశాఖపట్నం వస్తోంది. వసంత ఆరు గంటల నుంచీ ఎదురుచూస్తుంటే ఏడు గంటలవుతుండగా ఆటో ఇంటి ముందు ఆగింది. వసంత వెళ్ళి సూట్‌కేస్ అందుకుని లోపలకు తెచ్చింది. సుందరి వస్తూనే ఆయాసపడుతూ మంచం మీద కూచుంది.

"తొమ్మిదోనెల నిండేవరకూ పని చెయ్యకపోతే పదిపదిహేనురోజులు ముందే శలవుపెట్టకూడదూ? ఎంత హైరానా పడుతున్నావో చూడు" అంటూ కాఫీ కలుపుతోంది వసంత.

"శలవులు డెలివరీ అయ్యాక అవసరం కదా- ఎక్కువరోజులు పాపతో ఉండొచ్చని-" అంటూనే "అమ్మా" అని అరిచింది సుందరి.

కాఫీ ఫిల్టర్ పక్కనపెట్టి వచ్చేసరికి సుందరి మంచంమీద వాలిపోయింది.

"ఏంటీ సుందరీ బాగోలేదా?"

"నడుంనొప్పిగా ఉంది ప్రయాణం కదా" అంటూ లేచి బాత్‌రూంకి వెళ్ళింది.

వసంతకేదో అనుమానం తోచి బాత్‌రూం దగ్గరే నిలబడింది.

"అమ్మా" అని మళ్ళీ కేకేసింది సుందరి.

"ఏంటి- తలుపు తియ్యి" అంది వసంత.

"అమ్మా- ఏంటిది- చీరంతా తడిసిపోతోంది- ఆగటంలేదు" అంది సుందరి కంగారుపడుతూ.

"ఉమ్మనీరు పోతోందా" అంటూ వసంత హడావుడిగా సుందరిని పట్టుకుంది. నెమ్మదిగా నడిపించుకుంటూ తెచ్చి మంచంమీద పడుకోబెట్టింది.

"నేను ఆటో తెస్తానుండు- ఆస్పత్రికి



వెళ్లాం" వసంత పర్సుతీసుకుని ముందు గది లోకి వెళ్లబోతుంటే సుందరి పెద్దగా కేకపెట్టింది. వసంతకు దడ వచ్చేసింది. సుందరి నొప్పితో అల్లాడుతోంది. రక్తంతో పక్కబట్ట తడుస్తోంది. వసంత ధైర్యం చేసి చూసింది. బిడ్డ తల నల్లగా కనిపిస్తూనే ఉంది. వసంతకేం చెయ్యాలో పాలుపోలా- అయోమయంగా అనిపించింది.

క్షణంలో తేరుకుని పక్కింటికి పరుగెత్తింది. వాళ్లబ్బాయిని డాక్టరుకోసం తరిమింది.

"దగ్గర్లో ఏ డాక్టరుంటే ఆ డాక్టర్ని ఆడైనా మగైనా సరే" అతని తొందరపెట్టి పక్కింటామెను తీసుకుని వచ్చేసరికి సుందరి ఒళ్లంతా చెమటలతో తడిసిపోతోంది. ఫాన్ వేసి నెమ్మదిగా సుందరి కాళ్లదగ్గర కూచుంది. బిడ్డ తల బైటికి వచ్చింది.

"డాక్టరొచ్చేవరకూ ఆగదు- రండి" అంటూ పక్కింటామె నెమ్మదిగా బిడ్డను పట్టుకుంది.

వసంత తనూ చెయ్యివేసింది. ఇద్దరి చేతుల్లోకి నెమ్మదిగా జారిందా పసికందు.

వసంత ఆ బిడ్డను చేతుల్లోకి తీసుకుంది. సుందరి సొమ్మసిల్లినట్టు పడిపోయింది.

పక్కింటామె పొయ్యి వెలిగించి నీళ్ళు కాస్తోంది. వసంత ఆ నెత్తుటి ముద్దని చేతుల్లోకి పట్టుకూచుంది. బుల్లినోరు విచ్చుకుని ఆ పాప కీచుగొంతుతో అరుస్తోంది.

అంతలో డాక్టర్ని వెంటబెట్టుకొని వచ్చాడు పక్కింటి కుర్రాడు.

ఆ డాక్టరు వస్తూనే వసంతను పట్టుకుని తిట్టటం మొదలెట్టింది.

"మీకు కాస్తన్నా జ్ఞానంలేదా? ఒకరోజు ముందు హాస్పిటల్లో చేర్పొద్దా. ఏమన్నా జరిగితే ఏంచేసేవారు. మీ అమ్మాయి అన్నాగానీ మీకింత నిర్లక్ష్యమా- మీ ధైర్యానికి మెచ్చుకోవాలి" అంటూ వసంతని చివాట్లేస్తూ తను చెయ్యాల్సిందంతా చేసింది.

వసంత మాట్లాడకుండా డాక్టరు చెప్పినట్లు చేసింది. ఓ గంటలో ఇంట్లో అంతా ప్రశాంత వాతావరణం ఏర్పడింది.

పక్కింటావిడా, కుర్రాడూ కూడా వెళ్ళిపోయారు. నవత తొమ్మిదింటికి వచ్చేసరికి సుందరి నిద్రపోతోంది.

"ఎప్పుడొచ్చిందీ? ఎప్పుడు నిద్రపోయింది?"

అంటూ సుందరి మీదపడి లేవబోతున్న నవత సుందరి పక్కనే ఎర్రగా కదుల్తున్న ఆకారాన్ని చూసి కెవ్వున అరిచింది.

వసంత వంటింట్లోంచి వచ్చి నవ్వుతోంది.

"ఎప్పుడు పుట్టింది? అక్కడే డెలివరీ అయిందా బుద్ధి లేకపోతే సరి"

"అక్కడ అవలా- ఇక్కడే మనింట్లోనే నీ మంచం మీదే కన్నది" అంది వసంత.

నవత నిశ్చేష్టురాలయింది.

"ఎప్పుడొచ్చింది? ఎప్పుడు కన్నది?"

"ఏడింటికొచ్చి ఏడున్నరకంతా కన్నది"

"నిజంగా- మనింట్లోనే- ఇక్కడే- నిజంగా"

నవత ఆశ్చర్యంగా మంచంచుట్టూ తిరుగుతోంది.

"పిల్లల్ని కనటం ఇంత తేలికా?"

"అది పిల్లల్ని బట్టి ఉంటుందిలే- నువ్వు నన్ను రెండు రోజులు వేధించి వేధించి గాని పుట్టలేదు" అంది వసంత నవ్వుతూ.

"నిజంగానా అమ్మా. సోసారి- నాకు తెలవదుగదా" వసంత మెడ చుట్టూ చేతులు వేసి దీనంగా అంది నవత.

"చాల్లే వేషాలు- శుభ్రంగా స్నానం చేసి అప్పుడు పాప నెత్తుకో" అంది వసంత.

"అమ్మో నాకు భయం- పడేస్తానేమో" అంటూనే బాత్‌రూంలోకి దూరింది నవత.

పాపతోపాటు ఇంట్లో హడావుడి మొదలయింది. ముగ్గురు పెద్దవాళ్ళూ కలిసి కృషి చేసినా వేలెడులేని ఆ చిన్నపిల్లకు కావాల్సినవి అందించటంలో ఘోరంగా విఫలమవుతున్నారు. వీళ్లు పాలు కలిపినప్పుడు అది తాగదు. తాగదులే అనుకున్నప్పుడు హఠాత్తుగా లేచి రాగం మొదలుపెడుతుంది. పాలు కలిపి తెచ్చే అయిదారు నిమిషాల్లో అందరినీ గడగడలాడించేస్తుంది. వీళ్లు నిద్రపోయేటప్పుడు మేలుకుంటుంది. వీళ్లు మేలుకున్నప్పుడు నిద్రపోతానంటుంది. వీళ్లు అన్నానికి కూచుంటే చాలు ఎంత గాఢనిద్రలో వున్నానరే ఎవరో తట్టిలేపినట్లే లేస్తే మధ్యలో చేతులు





కడుక్కొచ్చి ఎత్తుకు కూచోవాల్సిందే. ఎవరో ఒకరు అన్నం తింటుంటే ఇంకొకరు ఎత్తుకోవచ్చునుకున్నా కుదరనివ్వదు. అన్నం తినేవాళ్లు మధ్యలో లేచివచ్చి ఎత్తుకునేదాకా రాగం ఆపదు. ఇక యిలా కాదని సుందరి ఎత్తుకుంటే వసంత అన్నం కలిపి సుందరికి తినిపించటం, వసంత ఎత్తుకుంటే సుందరి అన్నం కలిపి వసంతకు తినిపించటం మొదలుపెట్టారు. ఒకరోజిలా జరిగాక ఇద్దరికీ ఎవరన్నా తినిపిస్తే తినటం బాగానే ఉంటుందని పించి అలాగే చెయ్యటం మొదలుపెట్టారు. వీళ్ళిద్దరినీ చూసి నవత నాకూ తినిపించాల్సిందేనని పేచీ పెట్టింది. మొత్తానికి ఇల్లంతా అరాచకమైపోయింది. పెద్దవాళ్లు ముగ్గురూ చిన్నపిల్లలైపోయి ఆ పసిదాన్ని ఆడించటం మొదలుపెట్టారు.

పాపను నిద్రపుచ్చటం పెద్ద కళైపోయి ఆ కళలో వసంత ఆరితేరింది. మంచం మీదో, కుర్చీలోనో కూర్చుని పాపను ఒళ్ళో పడుకోబెట్టుకుని కాళ్లు ఊపుతూ ఏదో ఓ పాట పెద్దగా రాగం తీస్తూ ఉండాలి. ఏ పాటా రాకపోతే ఊఁ అనో ఆఁ అనో పెద్దగా రాగం తీస్తుండాలి. వసంత ఆ పాటలు పాడటంలో సహజంగానే సుందరికంటే ముందుంది. చిన్నప్పుడు లావణ్యకూ, నవతకూ తనతల్లి పాడిన పాటలు గుర్తు తెచ్చుకుని మరీ పాడుతోంది.

పుట్టిన పదిహేనురోజుల్లోనే నిద్రపోవటానికి తన పద్ధతంటూ ఒకటి కనిపెట్టుకుని ఆ పద్ధతికి పెద్దవాళ్లను అలవాటుచేసిన పాప పట్టుదలకు ఆశ్చర్యానందాలతో తలమునకలవుతూ వసంత పాడుతోంది.

''చిన్నారీ పొన్నారీ చిలుకవూ నీవు
పొన్నంగీ ఏడవకూ పోసేము పాలు''
''దూరానా కొండెరుపు దొండపండెరుపు
తోటల్లో నీ అమ్మాయి తొలకరి మెరుపు-హాయి''

అంటూ గొంతెత్తి ఏ బిడియమూ లేకుండా ఇష్టం వచ్చినట్లు అరిచి పాడుతున్న వసంత హఠాత్తుగా ఆగిపోయింది.

ఎదురుగా సురేష్-

లేచి నుంచుంటే పాప నిద్రలేస్తుందనే విషయం గుర్తొచ్చి లేవాలనే ప్రయత్నం కూడా చెయ్యలేదు వసంత.

''నవత...'' అంటూ మాటల కోసం తడుముకున్నాడు సురేష్.

''నవత చదువుకోటానికని తన స్నేహితురాలి ఇంటికి వెళ్లింది. పరీక్షలింకా నాలుగురోజులే ఉన్నాయి. ఇదిగో ఈ పాపతో ఇక్కడ చదువు సాగటంలేదు. కూచోండి... వచ్చే టైమయింది'' అంది కుర్చీ చూపిస్తూ. సురేష్ చాలా తడబడుతూ ఇబ్బందిగా కూచున్నాడు.

''ఈ పాప...''

''సుందరి అని నాకూ నవతకూ స్నేహితురాలు. ఆ అమ్మాయి ఇక్కడే మా ఇంట్లోనే ప్రసవించింది. పదిహేనురోజులయింది, సుందరి స్నానానికి వెళ్లింది. ఈ పాప ఎంత తెలివిగలదో చెప్పలేం'' ఒళ్ళో పాపని మెల్లిగా ముద్దుపెట్టుకుంది.

సురేష్ వసంతనే ఆశ్చర్యంగా చూస్తున్నాడు. కొంచెం చిక్కినట్లున్నా వసంత చాలా బాగుంది. ఉత్సాహంగా ఉంది. ఆమె నవ్వులో, కళ్లల్లో, మాటల్లో అతనికి ఇంతకుమునుపు తెలియని చురుకుదనం-

అమ్మబాగానే ఉంది అని నవత చెబుతున్నప్పటికీ ఇంత బాగా ఉంటుందని సురేష్ కలలో కూడా అనుకోలేదు. వసంత గుర్తొచ్చినప్పుడల్లా అతనికి పెద్ద నేరం చేసిన అనుభూతి కలిగేది. వసంత జీవితం నాశనంచేశానా అనే ప్రశ్న పెద్ద మేకులా తలలో దిగబడేది.

'కానీ తాను విడిపోయి వసంత జీవితం. బాగుచేశానా' అనే అనుమానం వచ్చిందిప్పుడు.

అంతకుముందు వసంత ముఖంలో ఈ విశాలత్వం లేదు. కుంచించుకుపోయినట్లు ఉండేది. కళ్ళల్లో పెదవుల్లో ఎప్పుడూ ఎవరిమీదో ఒకరిమీద కంప్లయింటు ఉండేది. ఒకరకమైన జంకు ఆమె ప్రతి కదలికలో కనిపించేది.

ఇప్పుడా లక్షణాలేమీ లేవు. సురేష్‌కి వసంత భార్యలా లేదు. ఆడదానిలా లేదు. సాటిమనిషిలా ఉంది. నవ్వటంలో మాట్లాడటంలో ఏ బెరుకూ, ఏ బిడియం లేని ఒక అవ్యక్తమైన స్వేచ్ఛ ఆమెను నడిపిస్తున్నట్లు ఉంది.

ఒడిలో బిడ్డతో ఆమె మానవిలా ఉంది.

"లావణ్యా సంగతి నీకు తెలుసా? నిన్ను రమ్మని రాశానంది" గొణిగాడు సురేష్.

"ఔను... రాసింది- కానీ నాకెక్కడ కుదురుతుంది- ఉత్తరం రాయటానికే కుదరలేదు. ప్రసవించాక వెళ్లి పదిరోజులుండి రావాలి"

సురేష్ నివ్వెరపోయాడు.

లావణ్యంటే ప్రాణాలు విడిచే వసంత లావణ్యా తనకేమీ కాదన్నట్లు మాట్లాడుతోంది.

ఇంతలో సుందరివచ్చి పాపను తన చేతుల్లోకి తీసుకుంది.

"నవతవాళ్ళ నాన్నగారు" వసంత పరిచయం చేసింది. సుందరి విస్తుపోయింది.

పాపను పడుకోబెడతానంటూ లోపలి గదిలోకి నడిచింది.

వసంత సుందరి వెనకాలే వచ్చి-

"పాప పక్కలో నేను పడుకుంటాలే- నువ్వెళ్ళి కాసేపు ఆయనతో ఆ మాటా ఈ మాటా మాట్లాడు. నాతో మాట్లాడటానికి చాలా ఇబ్బందిపడుతున్నాడు. నవత వచ్చే వేళయింది. కాసింత టీపెట్టి ఇవ్వు" అంది. సుందరి ఆశ్చర్యంతోనే వంటింట్లోకి వెళ్ళి 'టీ' పెడుతోంది.

వసంతకు వీణ గుర్తొచ్చింది.

"నేనే గెలిచాను వీణా... నాకతని మీద కోపంలేదు. ఇరవై రెండేళ్ళు కాపురం చేశాం. విడిపోయాం. ఎవరి జీవితం వాళ్ళది. నా జీవితం ఇపుడు నా చేతుల్లో ఉంది. నా కష్టసుఖాలు నావి. నా ఉనికికో అర్థం ఉంది. నేను ఒక వ్యక్తి భార్యనీ, ఇద్దరు పిల్లల తల్లినీ మాత్రమే కాదు, సమాజంతో సజీవ సంబంధం ఉన్న ఓ పౌరురాలిని నేను. నా పరిస్థితులను మార్చుకోగలను. నా జీవితాన్ని మార్చుకోవటం కోసం చేసే ప్రయత్నంలోనే నాకు ఆనందం దొరుకుతోంది. ఈ ఆనందం ఏ ఆనందంకంటే తక్కువదికాదు. నేను కోల్పోయిందేమీలేదు. భర్త ఇంట్లో తప్ప ఆడదానికి సుఖంలేదని అన్నదెవరోగాని అది అబద్ధం. ఇవాళ నేనున్నంత ఆత్మగౌరవంతో ఎవరూలేరు. భర్త లేకపోతే ఒంటరితనం అన్నదెవరోగాని అది అబద్ధం- ఇవాళ నా చుట్టూ మనుషులే-" వసంత ఆలోచనలలోపడి కొట్టుకుపోతుండగా నవత వచ్చింది. తండ్రిని చూసి ఆనందపడింది. ఇద్దరూ కాసేపు కబుర్లు చెప్పుకున్న తర్వాత సురేష్ మెల్లిగా అన్నాడు-

"అమ్మను చాలా మార్చావు- చాలా ఆశ్చర్యంగా ఉంది".

...నవత నవ్వింది.

"నేనేం మార్చలేదు నాన్నా- అమ్మ స్వభావం అలాంటిది. చాలా తెలివి, ఎంతో ఓపిక, మనుమల్ని ప్రేమించే స్వభావం, సహాయం చేసే గుణం ఇవన్నీ ఆమెలో ఉన్నాయి. కానీ ఇవేవీ ఆమె నీ భార్యగా, మా తల్లిగా మాత్రమే ఉన్నపుడు బైటికి రాలేకపోయాయి. వచ్చే అవకాశంలేదు. ఆ ఇంట్లో మగ్గిపోయింది. అమ్మకున్న శక్తి మనకెవరికీలేదు నాన్నా" అంది. సురేష్‌కి ఏమర్థమయిందో ఏమర్థంకాలేదోగాని మౌనంగా ఉన్నాడు.

★ ★ ★

ప్రియమైన లావణ్యాకు-

నీ ఉత్తరం అంది చాలారోజులే అయినా జవాబు రాయటానికి తీరిక దొరకటంలేదు. ఇక్కడ నవత స్నేహితురాలు సుందరి మనింట్లో ప్రసవించింది. చక్కని పాప పుట్టింది. ఆ పాప సందడితోనే సరిపోతోంది మా ముగ్గురికీ. నీ సంగతి తెలిసి నేనూ నవతా, చాలా సంతోషించాం. నవతకు కూతురు కావాలట. నీ ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకో. డాక్టరు దగ్గరకు క్రమంతప్పకుండా వెళ్ళి పరీక్షలు చేయించుకో. నేను ఇప్పుడు రావటంలేదు. నీ ప్రసవం అయ్యాక వస్తాను. అవసరమైతే పది పదిహేనురోజులుంటాను.

నేను ఓ వారంరోజుల్లో గుంటూరు రోహిణి అత్త దగ్గరకు వెళ్తున్నాను. అత్తకు ఆసుపత్రి పనుల్లో సహాయపడుతూ అక్కడే ఉంటాను.

లావణ్యా... దీనివల్ల మళ్ళీ నీ పరువుపోతుందని భయపడకు. ఈ అమ్మ ఒక వ్యక్తిగా తన బతుకు తను బతుకుతుందని గర్వపడు. మీ అమ్మ నలుగురికి సేవచేస్తోందని సంతోషపడు.

నిజంగానమ్మా- నేనిప్పుడు చాలా సంతోషంగా ఉన్నాను. నా జీవితం నా చేతుల్లో ఉంది. అంతేకాదు, ఎవరి జీవితాలు వాళ్ళచేతుల్లో ఉండాలనే విషయం తెలిసింది. ఆ




జ్ఞానం రావటం మనిషికి చాలా అవసరం. న్యాయంగానీ అన్యాయంగానీ నాకు నేను చేసుకునేస్థితిలో ఉన్నాను. ఎవరో అన్యాయం చేశారని ఏడుస్తూ జీవితం ముగించే స్థితి నుంచి బైటపడ్డాను.

ఇరవైఏళ్ళ సంసారంలో మీ నాన్నకు భార్యగా మీకు తల్లిగా బతికాను.

మీ నాన్న నన్ను ప్రేమించలేదు. నేనూ మీ నాన్నను ప్రేమించలేదు. ప్రేమించాలనే విషయం కూడా నాకు తెలియదు. మీ నాన్న నా భర్త. భర్తకు ఏం చెయ్యాలో, భర్త దగ్గర్నించి ఏం సాధించుకోవాలో నాకు సమాజం చెప్పింది. అదే చేశాను. ఒక భర్తకు భార్య ఏం చెయ్యాలని బోధిస్తారో, ఒక బిడ్డకు తల్లి ఏం చెయ్యాలని బోధిస్తారో అవే నేను చేశాను. వాటిల్లో ఏ లోపమూ జరగకుండా చేశాను.

కానీ నేను ఓడిపోయాను... ఓడిపోక తప్పదు. ఇసుక పునాదులమీద ఏ భవనమైనా ఎలా నిలబడుతుంది? ఆ ఇసుక పునాదుల మీద మన జీవితాలు నిర్మించుకోవాలని మనకు నమ్మకంగా చెబుతున్నవారిపై నాకివాళ పట్టరానికోపం వస్తోంది. మీ నాన్న నేను దూరమైనందుకు ఏమీ బాధపడలేదు. చాలా సంతోషంగా, ఉత్సాహంగా ఉన్నాడు. ఇరవై సంవత్సరాలు ఎవరినైతే నా జీవితానికి గమ్యం అనుకున్నానో ఆ మనిషికి నేను లేకపోతే ఏ చింతాలేదు అని తెలిశాక నేనేమైపోవాలి? నా రక్తమాంసాలు పంచి ఇచ్చి అన్ని చాకిరీలూ చేసి ప్రాణంలా పెంచిన కూతురికి నేను పరువుప్రతిష్టల సమస్యగా తప్ప కనిపించలేదంటే–

తనకు చాలా అవసరం అనిపించినప్పుడు తప్ప నేను గుర్తు రాలేదంటే-

నేనేమవ్వాలి?

ఇంకెవరైనా అయితే ఏమయ్యేవారో చెప్పలేను కానీ నేను మనిషినయ్యాను. భార్యగా తల్లిగా కాకుండా మనిషిలా నిలబడ్డాను.

నన్ను మనిషిలా చూసే నవతే దానికి కారణం కావచ్చు. నేను ఆదర్శ భార్యగా జీవించాలనిపెట్టుకున్న గమ్యమే తప్పు అనీ, అది నన్ను ఎప్పటికీ ఒడ్డుకు చేర్చదనీ ఏదో ఒక రూపంలో నన్ను ముంచితీరుతుందనీ నాకు ముందు తెలియదు.

ఆ సంగతి తెలుసుకోవటం ఆడదానికి పెద్ద జ్ఞానోదయం. నాకా జ్ఞానోదయం అయింది.

నా జీవితగమ్యం నిర్ణయించుకునే అవకాశం వచ్చింది. కూతురిగా, భార్యగా, తల్లిగా బతకటం అలవాటైన నాకు మొదట్లో చాలా భయంవేసింది.

ఏ భద్రతా లేదే అనిపించింది.

ఏ ఆధారమూ లేకుండా ఏమైపోతానా అనిపించింది. ఎంత కష్టంగానో అనిపించింది. క్రమక్రమంగా-

నా కాళ్ళల్లోకి కదలిక వచ్చింది.

నా కళ్ళు చూడటం నేర్చుకున్నాయి.

నా నోరు మాట్లాడుతోంది.

నాలో జీవశక్తి నిండి ప్రవహించటం మొదలయింది.

నేను మనిషినయ్యాను.

లావణ్యా... నన్ను మనిషిలా చూడటం నేర్చుకో- నీకు చాకిరీచేసిపెట్టే అమ్మలా చూడటం మానుకో-

ఈ మాటల్ని నిర్లక్ష్యం చెయ్యకు.

ఇవాళ ఈ మాటలు నీకు అర్థరహితంగా కనిపించవచ్చు.

కానీ తల్లీ... ఆడదానికి జీవితంలో ఏదో ఒకరోజు మనిషిగా మానవిగా మారాల్సినరోజు వస్తుంది. మానవిగా మారాలనే కోరిక బలవత్తరంగా కలిగే ఆ క్షణాలకోసం నా ఈ మాటల్ని జాగ్రత్తగా నీ మనసులో దాచుకో-

మనిషిగా మారాల్సిన ఆరోజు వచ్చినపుడు అట్లా మారేశక్తి లేకపోతే, మారటానికి ఏ ఆధారమూ దొరక్కపోతే మనం సర్వనాశనం అయిపోతాం. మనమంటూ మిగలం. అందుకని మన ప్రాణాలు ధారపోసి అయినాసరే మనుమల్లా మారటానికి కావాల్సిన శక్తి సంపాదించుకుని తీరాల్సిందే-

ఈ నా మాటల గురించి ఆలోచిస్తూ ఉండు నిన్ను నా కూతురిగానో, మనోహర్ భార్యగానోకాక ఒక వ్యక్తిలా గుర్తించగలిగేరోజు కోసం ఎదురు చూస్తుంటాను.

ప్రేమతో వసంత.








## భర్తని అదుపులో ఉంచుకోవడమెలా?

భార్యాభర్తలన్నాక మధ్యమధ్య తగాదాలు రావడం సహజం. అలాగే అవన్నీ మళ్ళీ అంతే సులువుగా సమసిపోవడంకూడా మామూలే. అసలు సాధారణంగా భార్యాభర్తల మధ్య అంకురించే విభేదాల్ని వారంతటవారే పరిష్కరించుకోవచ్చు. అయితే రాజీకుదిర్చే నెపంతో చేరే మధ్యవర్తులే వారి వారి అంతరాంతరాల్ని విశ్లేషిస్తూ, విమర్శిస్తూ వారి మధ్య మరింత ఎడంకలిగేలా చేస్తుంటారు. ఈ సత్యం గమనించిన దంపతులెవ్వరూ తమ మధ్య మూడోవ్యక్తి ప్రవేశించడాన్నెంతమాత్రం సహించరు.

చైనాలోని స్త్రీలకు పురుషులతోపాటు సమానత్వమే కాక సంపూర్ణ స్వేచ్ఛకూడా లభిస్తోంది. వారికి లభించే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అపారం. అంతేకాదు కుటుంబ మొత్తం మీద

'స్త్రీ'దే ముఖ్యపాత్ర, అజమాయిషీ కూడా.

చైనాలో అసంతృప్తి కారణంగా ఏ భర్తయినా కుటుంబాన్ని విడచి ఎక్కడికైనా వెళ్లే అవకాశం కొంచెమైనా ఉందిగాని, స్త్రీకి మాత్రం లేదు. ఎందుకంటే ఆమే ఇంటికి సర్వాధికారిణి, అలాంటప్పుడు తన కుటుంబాన్ని వదలి తానెక్కడికి వెళ్లగలదు?

కొంతమంది భర్తలు తమ భార్య ప్రతిభాపాటవాలకంటె ఆమెలోని సహృదయతకే ప్రాధాన్యతఇస్తారు. ఓ పెద్ద జనరల్ భార్య ఓ చిన్న వార్తాపత్రికలో టైపిస్టుగా పని ప్రారంభించింది. జనరల్‌దానికేమీ అభ్యంతరం చెప్పలేదు. నైట్ షిఫ్టులున్న రోజున అర్ధరాత్రి రెండుగంటలవేళ ఆఫీసునుంచి పదికిలో మీటర్ల దూరాన ఉన్న తమ ఇంటికి సైకిలుమీద వచ్చినా ఆయన ఆమెను ఏమీ అనేవాడుకాదు. మరికొన్నేళ్లకి ఆమె ఆ పత్రికలోనే పనిచేస్తూ అంచెలంచెలుగా పెరిగి ఉన్నతస్థానం చేరుకుంది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటుంది. కావాలంటే జనరల్ ఆమెను తన సెక్రటరీగా నియమించుకోవచ్చు. కాని అలాచేయడం ఆ ఇద్దరికీ ఎంతమాత్రం ఇష్టంలేదు. పరస్పరానురాగం, గౌరవం, అవగాహన, సమాధానపడడం వంటి గొప్పలక్షణాలున్న ఏదంపతులైనా వారిలా సుఖంగా, సంతోషంగా ఉండగలుగుతారు.

విఫలమైన వివాహాల్ని రద్దుచేయడానికిగాను 'విడాకులు' ప్రవేశపెట్టింది చట్టం. చాలామంది దీన్ని మొదట చిన్నచూపు చూసినా అది అమలులోకివచ్చింది.

అయితే ఏ భార్యాభర్తలైనా విడాకులు తీసుకోబోతున్నారంటే, సమాజంలో చాలామంది బాధపడతారు. ఇరుగుపొరుగు మొదలుకొని పత్రికా విలేకరులవరకు వాళ్ళని కలపాలనే ప్రయత్నిస్తారు. మధ్యవర్తిత్వం వహిస్తారు. రాయబారాలు నడిపిస్తారు.

కానైతే ఇలా మధ్యవర్తులు జోక్యంచేసుకోకుండా ఆ దంపతుల్నే ఏకాంతంగా వదిలితే మంచిది. వారి నిర్ణయాలు వారు తీసుకుంటారు. సైకలాజికల్‌గా ఆలోచించే డాక్టర్లు, సైకాలజిస్టులు వారిమధ్య సయోధ్య నెలకొల్పడానికి ప్రయత్నిస్తే మరింత మంచిది.



చైనాలో దీనికి సంబంధించిన కథ ఒక టుంది.

హెంగ్ నియాంగ్ అనేఆమె పెద్ద అందగత్తె మాత్రంకాదుగాని, ఓ మోస్తరు ఆకర్షణగానే ఉంటుంది. ఆమె, ఆమె భర్త ఎంతో అన్యోన్యంగా ఉంటారు. అయితే ఆమె భర్తకు ఆమె అంటే భయంకన్నా ప్రేమే ఎక్కువ.

వీరి పొరుగునే ఝూ అనే ఆమె ఉంది. ఆమె అపురూప సౌందర్యవతి. అయితేమాత్రమేం ఆమె భర్త 'ఝూ'ని లెక్కచేసేవాడేకాదు. ఇది ఝూకి ఆశ్చర్యంకలిగించింది. తనెంత అందంగాఉన్నా తన భర్త తనని పట్టించుకోడు, హెంగ్ సాధారణంగా ఉన్నా ఆమె భర్త ఆమెనే అంటిపెట్టుకుంటాడేమిటా అని అదే విషయాన్ని హెంగ్‌ని అడిగింది. అప్పుడామే కొన్ని సలహాలు చెప్పింది. వాటిని తు.చ తప్పకుండా పాటించింది ఝూ. ఇంకేముంది తర్వాత ఆమె భర్త మంత్రంవేసినట్లు ఆమెచుట్టే తిరగసాగాడు.

ఇంతకీ ఏమిటట ఆమె సలహాలు?

'చాలామంది ఆడవాళ్లు అందంగా ఉన్నా భర్తల్ని ఆకర్షించడానికి ప్రయత్నించరు. కనుకొసల కదలికతో సామ్రాజ్యాల పునాదులే పెళ్ళగించారు కొందరు లలనామణులు. భర్తముందు కొంచెం బెట్టుగా, పట్టుగా ఉంటూ చూపులతో, విరితూపులతో అతని దృష్టినాకట్టుకోవాలి. అంతేగాని కొంచెం బిగువు నడలించినా మగవాడికి చులకనైపోతారు ఆడవాళ్లు.' ఇదే విషయం.

కాబట్టి ఆడవాళ్లు ఈ విషయాలు తప్పనిసరిగా గుర్తుంచుకోవాలి.

## ఉత్తరాలపిచ్చి

ప్రజా సమస్యలపై కొందరు పాఠకులు వార్తాపత్రికల సంపాదకులకి లేఖలు రాస్తుంటారు. తమ పేరుతో ముద్రితమైన ఆ లేఖను చూసుకుని కొందరు గర్వపడతారు. మరికొందరు సమస్యను ప్రభుత్వంతోపాటు పదిమందికీ తెలియపరచామని, త్వరలో దానికి పరిష్కారమో గంపడుతుందని తృప్తిపడతారు. పత్రికలకు లేఖలు రాయటం తమ హాబీగా చేసుకుంటారు కొంతమంది. ఇంగ్లాండ్‌లోని నాటింగ్ హేమ్‌కి చెందిన హెన్రీలాస్ వర్త్ ఒకేఒక పత్రికకి వేలసంఖ్యలో ఉత్తరాలురాశాడు. 1884లో ఆయన తన మొదటి ఉత్తరంరాసి పంపాడు. ఆ తరువాత అదే పత్రికకి మొత్తం 6234 జాబులురాసి రికార్డు సృష్టించాడు. ఆ కారణంగా ఆ పత్రికలో పనిచేసిన సిబ్బందిలోమూడు తరాల వారికి ఆయన దస్తూరి పరిచయమైపోయింది. వివిధరకాల సమస్యలపై ఆయన తన జాబులలో విపులంగా చర్చించేవాడు.

రెవరెండ్ జె.ఆర్ ఫిలిప్స్ 40 సంవత్సరాల కాలంలో వేర్వేరు పత్రికలకు మొత్తం 69 వేల ఉత్తరాలు రాశాడు. ఆయన రాసిన జాబులు కొన్ని ప్రజలలో తీవ్రసంచలనాన్ని కలిగించాయి. ఓ కార్మికుడు తన కన్నకూతురిని సరస్సులోపడేసి హత్యచేశాడు. న్యాయస్థానం అతనికి మరణశిక్ష విధించింది. ఫిలిప్స్ ఆ కేసుపై దినపత్రికలలో ఉత్తరాలద్వారా అతనికి మరణశిక్ష విధించటం అన్యాయమని వాదించాడు. ఆయన పత్రికలలో రాసిన ఉత్తరాలు పాఠకులలో ఆసక్తినిపెంచాయి. ఆయన వాదనలో న్యాయం ఉందని పాఠకులు గ్రహించారు. అంతా కలిసి ఒక ఉద్యమాన్ని లేవనెత్తారు. కార్మికునికి విధించిన మరణదండన రద్దుచేయాలని ప్రభుత్వంపై ఒత్తిడితెచ్చారు. ప్రభుత్వం ప్రజల ఒత్తిడికి తలవొగ్గి మరణశిక్షను రద్దుచేసింది.

ఇంగ్లాండ్‌లో పత్రికలకు ఉత్తరాలు రాయటంలో రికార్డు నెలకొల్పిన మరో వ్యక్తి సైమన్. అతను విద్యార్థిదశలోనే చిన్నపిల్లల సమస్యలపై పత్రికలకు రాయటం మొదలుపెట్టారు. గృహిణులు పిల్లలను పెంచటంలో ఎటువంటి సమస్యలను ఎదుర్కొంటున్నదీ, వాటిని పరిష్కరించుకోవటానికి వారెంత కష్టపడేదీ ఆయన పత్రికల్లో జాబులశీర్షికలో రాసేవాడు. అతను ఉపయోగించే భాష, శైలి ప్రత్యేకంగా ఉండేవి. కొందరు పాఠకులు అతని ఉత్తరాలపై విమర్శలవర్షం కురిపించేవారు కాని అతని ఉత్తరాలవలన పాఠకులలో సామాజిక సమస్యలపై మంచి అవగాహన ఏర్పడింది. విద్యా





ర్థిగా ఆయన 800 ఉత్తరాలురాసి రికార్డు నెలకొల్పాడు.

ఇటలీకి చెందిన ఎలగైరోనా వివిధ రంగాలలో పేరు ప్రఖ్యాతులుగాంచిన వ్యక్తుల్ని ఉత్తరాల ద్వారా పాఠకులకి పరిచయం చేశాడు. పేరుపొందినవారు, కీర్తి గడించినవారు చనిపోయిన తరువాత వారి స్మారక చిహ్నాలను ఎవరూ పట్టించుకోరనీ, అవి దైన్యస్థితిలో ఉన్నాయనీ ఆయన ఉత్తరాలద్వారా వెలుగులోకి తెచ్చాడు. అతని ఉత్తరాలు ప్రభుత్వాన్ని మేల్కొల్పాయి. పాడుపడిన స్మారక చిహ్నాలను, కట్టడాలను పునరుద్ధరించటానికి ప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకుంది. ఆయన రాసిన 200 ఉత్తరాలు ఆయన మరణానంతరం పుస్తకరూపంలో ముద్రింపబడ్డాయి కూడా!

పత్రికా సంపాదకులకి అందే ఉత్తరాలలో అన్నీ ముద్రణకి పనికిరావు. పాఠకులు తమ వ్యక్తిగత సమస్యలను రాస్తారు. వాటిని పరిష్కరించటానికి సహాయపడమని కోరతారు. ఆస్ట్రేలియాకు చెందిన ఒక పాఠకుడు అమెరికాలోని ఒక పత్రికా సంపాదకునికి ఓ లేఖరాశాడు. రూపవతి, నీలంరంగు కురులుగల యువతిని తనకోసం చూడమన్నదే ఆ లేఖసారాంశం. ఆ పని నిమిత్తం కొంత డబ్బుకూడా ఆ సంపాదకునికి పంపాడతను. తన పత్రికలో అటువంటి అమ్మాయికోసం ప్రచురించి ఆ సంపాదకుడు అతనికోరిక తీర్చాడో లేదో తెలియదు.

## స్మృతి వాటిక

ఒక ఉత్తమ ప్రయోజనంకోసం చందాలిచ్చి తమపేరు నిలవాలని కోరుకునేవారికి, తనమిత్రుడి బర్త్‌డే జ్ఞాపకార్థం ఖరీదైన హొటల్లో ఎంతడబ్బయినా ఖర్చుపెట్టటానికి సిద్ధమయేవారికి, లేక తన దగ్గరి బంధువొకరి తీపిగుర్తుకోసం ఖర్చుచేయాలనుకొనేవారికి అంతకంటె గొప్పదైన ఒక అపురూపమైన, అపూర్వమైన విశిష్టావకాశం ఇప్పుడు ఢిల్లీలో లభ్యమౌతోంది. ఎవరి గుర్తుకోసం డబ్బు వినియోగమవుతుందో వారిపేరు, వినియోగించినవారి పేరు అక్కడ శాశ్వతంగా నిలుస్తుంది, 'దానితోపాటు పరిసరసౌందర్యం, వాతావరణ నైర్మల్యమూ హెచ్చుతుంది. ఈ ఉద్దేశాలకోసమే ఢిల్లీలో 'స్మృతి వాటిక' అనే సంస్థ ఆవిర్భవించింది.



స్మృతి వాటిక సంఘం ఒక రిజిస్టర్డ్ సంస్థ. ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ దీనికి అధ్యక్షుడు. ఢిల్లీ రింగ్‌రోడ్ ఈశాన్యదిక్కున రాళ్ళురప్పలతో కూడిన 15 ఎకరాలభూమికి ఇప్పుడు స్మృతివాటిక అనే పేరుపెట్టబడింది. దీన్నిజ్ఞాపకాల తోట అని కూడా అనవచ్చు. ఇక్కడ ఎవరైనా సభ్యుడుగా చేరి ఎవరిజ్ఞాపకం కోసమైనా ఒక మొక్కను నాటవచ్చు. ఒక్కోసభ్యుడు కనీసం 32 మొక్కలనునాటే అవకాశం వుంది. అలా నాటిన ప్రతిచెట్టు ఎవరి జ్ఞాపకార్థం నాటబడిందో, ఎవరు నాటారో ఒక ఫైబర్‌గ్లాస్ ఫలకంమీద రాసి వుంచుతారు. ప్రతి వార్షికోత్సవ సమయంలో నాటబడిన చెట్టు పెరుగుదలను సూచించే ఫొటోలను ఆయాసభ్యులకు పంపుతారు. స్మృతివాటికలోని ఏమొక్కకయినా రెమ్మలు, పూవులు గిల్లటం ద్వారా చిత్రహింస కలిగే అవకాశమే వుండదు. ఆ 15 ఎకరాలజ్ఞాపకాల తోటను సదా 25 మంది తోటమాలులు కావలా కాస్తుంటారు. ఒకవేళ ప్రమాదవశాత్తు ఎవరైనా నాటిన మొక్క మరణించేట్లయితే సంఘమే అక్కడ వారిపేరు మీదే మరోమొక్కను నాటే జవాబ్దారి వహిస్తుంది.

స్మృతివాటిక ఉద్యానంలో 1500 మొక్కలు నాటే అవకాశం వుంది. కాని, కంచెకు దగ్గరగా వేప, సిల్వర్ ఓక్ మొదలైన మొక్కలు నాటబడ్డాయి. ఆ మొక్కలసంఖ్యే ఐదువేల వరకు వుంటుంది. అలంకారిక సస్యంబోగన్‌విల్లా ఎక్కువగా వుంది. స్మృతివాటికలో చెట్టు నాటాలనుకొనే వ్యక్తి నుండి సంస్థ 1150 రూపాయలు వసూలుచేస్తుంది. వాటిలో 700 రూపాయలవరకు మొక్క సంరక్షణకు, ఫైబర్‌గ్లాస్ ఫలకాలకు, ఇతర స్టేషనరీ కోసం ఖర్చుపెడుతుంది. మిగిలిన డబ్బుతో సస్యజీవకణ పరిశోధనా లేబరేటరీని నిర్మిస్తారు. సస్యాల్ని గురించి పరిశోధనలుచేసే ప్రతిభావంత జీవశాస్త్రజ్ఞులకు 'పరిశోధనా ధనసహాయం' ఇచ్చేవిషయాన్నిగురించి కూడా సంఘం ఆలోచిస్తోంది. 'పరిసర నైర్మల్యం', 'శక్తి క్రోడీకరణ'లకు సంబంధించిన అనేక కార్యక్రమాలను స్మృతి వాటిక సంఘం సిద్ధంచేసుకుంది.

1976లో ప్రపంచ వనమహోత్సవం రోజున ప్రారంభమైన స్మృతివాటికలో ఇప్పటికి ఐదుగురు విదేశీయులతో కలిపి మొత్తం 64 మంది మొక్కలను నాటారు. ఢిల్లీలో సుమారు 2000 హెక్టార్ల నిరుపయుక్త భూముల్లో వివిధ ప్రాంతాల్లో స్మృతి కుంజ, స్మృతినికుంజ, స్మృతి ఉద్యాన, స్మృతి ఉపవన అనేపేర్లతో నాలుగు జ్ఞాపకాల తోటలు అస్తిత్వంలోకి రాబోతున్నాయి. తూర్పు ఢిల్లీలోని సుమారు ఐదెకరాల స్థలాన్ని కూడా ఇదే ఉద్దేశానికి ఉపయోగిస్తారు. ఢిల్లీలో ప్రారంభించబడిన ఈ స్మృతివాటిక ప్రణాళికతో ప్రభావితమైన అనేక సంఘాలు వివిధ పట్టణాలనుండి ఈ సంబంధమైన వివరణలు, రిపోర్టులను అడుగుతున్నాయట.





# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకావు.

---

కూపన్

**డిసెంబర్ 'చతుర' నవల: మానవి**

సమీక్షకుని పేరు : ..........................................

చిరునామా : ..........................................

..........................................

..........................................

..........................................

# రమణీయ ప్రాంతాల రాజస్థాన్

రాజస్థాన్ మన దేశ చరిత్రలో ఉన్నతోన్నత శిఖరాల నధిరోహించి. సమస్త వైభవాల్ని చవి చూసిన రాష్ట్రం. రాజులకి నిలయం అనే అర్థం ధ్వనించే ఈ ప్రాంతం అరివీర భయంకరులైన. రసపుత్ర సింహకిశోరాలకు జన్మభూమి. కోటలూ. మందిరాలూ. రాజమహళ్ళూ. తోటలూ. జలాశయాలతో అందాలకే నిర్వచనంగా ఉండే రాజస్థాన్ నేటికీ తన ప్రాభవాన్ని కోల్పోలేదు. ఆకాశ సౌధాలతో. ఉద్యానవనాలతో. హస్తకళల ప్రావీణ్యతా ప్రదర్శనలతో. గత వైభవ చిహ్నాలతో ప్రకృతి సౌందర్యానికి పరాకాష్ఠగానే అలరారుతోంది.

ఆరావళీ పర్వతాలూ. చంబల్. లూనీ నదులూ. థార్ ఎడారి ప్రాంతాలూ, వివిధ జంతువులతో నిండి ఉన్న అడవులూ, నెమళ్ళు నర్తించే తోటలూ రాజస్థాన్‌లో కనిపిస్తాయి. ఇక్కడి ప్రజలు రాజపుత్రులు, బ్రాహ్మణులు, జాట్లు, ఘూర్జరులు, మేవాడతీయులు, గాడులియాలహరులు, పటేళ్ళు, ఆహీర్లు మొదలైన తెగలుగా ఉన్నారు.

మన దేశంలోని అన్ని ప్రాంతాల వలెనే రాజస్థాన్ ప్రజలూ హోళీ, దసరా, దీపావళి పండుగలను ఘనంగా చేస్తారు. గాంగౌర్, తీజ్‌లు స్థానికంగా జరుపుకునే పండుగలు. పంటలు చేతికందిన సందర్భంలో గౌరీదేవిని అర్చిస్తూ వసంత ఋతువులో గాంగౌర్ పండుగను



ఉదయపూర్‌లోని జగ్‌మందిర్

చేసుకుంటారు. కార్తీక మాసంలో లక్షలాది మంది యాత్రీకులు పుష్కరిణిలో పుణ్యస్నానాలు చేసి తీజ్ పండుగను జరుపుకుంటారు. ఈ సందర్భంగా ఒంటెబళ్ళ పరుగు పందాలు జరుగుతాయి. ఒంటెల్ని అలంకరించి, ఎంబ్రాయిడరీ అల్లిన బ్లాంకెట్లు జీనులుగా కప్పుతారు. రాత్రికి నీటిలో వేలాది దీపాలను వదులుతారు.

కార్తీకమాసం అంటె నవంబరులోనే బికనీర్‌కి 8 కి.మీ. దూరంలో నున్న కోలాయిత్ సరస్సు వద్ద కపిలముని జాతర జరుగుతుంది. భాద్రపద మాసం అంటే ఆగస్టు- సెప్టెంబరులో జైసల్మేర్ జిల్లాలోని పోకరన్ దగ్గర రాందేవ్‌జీ జాతర జరుగుతుంది. గుర్రాల బొమ్మల్ని రాందేవ్‌జీకి కానుకగా సమర్పిస్తారు. యుద్ధాల్లో ప్రాణాలర్పించిన అమరవీరుల స్మృత్యర్థం జోథ్‌పూర్‌లోని మాండోర్‌లో ఆగస్టులో వీర్‌పురీ జాతర చేస్తారు. అజ్మీర్‌లో సూఫీసంత్ షేక్ మొయినుద్దీన్ చిష్టీ గౌరవార్థం జరిపే ముస్లిముల ఉర్సుమేలా జగత్ప్రసిద్ధి చెందింది. యావద్భారతం నుండేగాక పాకిస్తాన్ మొదలైన ముస్లిం దేశాల నుండి యాత్రికులు ఇక్కడికి ఉర్సును పురస్కరించుకొని వస్తారు. ఈ సందర్భంగా జరిగే కవాలీలు, హిందూ-ముస్లిం కవులు పాల్గొనే ముషాయిరా కవి సమ్మేళనాలు అక్బర్, పాదుషా హయాంనుండే ఆనవాయితీగా వస్తున్నాయి.

అందాలు ఉట్టిపడే చిత్రకళ రాజస్థాన్‌లో సమృద్ధిగా కనిపిస్తుంది. అది ప్రేమ, భక్తి విశ్వజనీనతను ప్రతిబింబించటం సర్వే సర్వత్రా కనిపిస్తుంది. కవిత్వం, సంగీతం, పెయింటింగ్ మొదలైన కళలు ఇక్కడ బహుముఖ ప్రాశస్త్యం పొందాయి. 17,18 శతాబ్దాల్లో రాగమాల పెయింటింగులు అత్యధికంగా వ్యాప్తిలోకి వచ్చాయి. ఆ రోజుల్లో జైపూర్, జోధ్‌పూర్, బికనీర్, కిషన్‌గఢ్, బుందీ, కోట మొదలైనవి కళామ తల్లికి నెలవులుగా భాసించాయి.

భారతీయ శిల్పకళకు 'స్వర్ణయుగం'గా చెప్పదగిన 4-6 శతాబ్దాలలోని గుప్తుల పాలనాకాలంలో శిల్పకళ అపురూప వైభవాన్ని చవిచూసింది. 6-11 శతాబ్దాల మధ్య కూడా ఎన్నో ఉన్నత ప్రమాణాలతో, శిల్పకళా ప్రావీణ్యతతో ఎన్నో ప్రాకారాలు వెలిశాయి. తదనంతరం సంభవించిన ముస్లిం దాడుల్లో కొన్ని విధ్వంసం కాగా, వారి కళాప్రావీణ్యతకు నిదర్శనగా మరికొన్ని మిగిలి ఉన్నాయి. జోథ్‌పూర్‌కి దగ్గర్లో ఉన్న ఓసియా గ్రామంలో 16 మందిరాలున్నాయి. 6-9 శతాబ్దాలలో ప్రాచీన గుప్తుల ఒరవడిలో డామర్‌లో రాతి మందిరాలున్నాయి.



- చిత్తోడ్‌లోని మీరాబాయి మందిర్



జైపూర్ - సిటీప్యాలెస్ మరియు చంద్రమహలు

చిత్తొడులో కాళికామాత ఆలయం, బుందీలో శివాలయాలు ఏడవ శతాబ్దపు శిల్పకళకు దర్పణాలు. ఉదయ్‌పూర్‌కు 12 మైళ్ళ దూరంలో ఏకలింగజీ మహాదేవాలయం 8వ శతాబ్దంలో బప్పారావత్ నిర్మింపచేశాడు. ఈ మందిరంలో కనిపించే శిల్ప ప్రతిభ అనన్యసామాన్యం. మేవాడ్ రాజు రాణాకుంభ 15వ శతాబ్దంలో ఎన్నో ఆలయాల్ని నిర్మింపచేశాడు. మౌంట్‌ఆబూలో దిల్వారా ఆలయం, రానక్‌పూర్ ఆలయం, జైసల్మార్, చిత్తోడ్‌గఢ్ ఆలయాల్లోని చలువరాళ్ళపైని శిల్ప సౌందర్యం, ఆలయ నిర్మాణాలు ఆకర్షణీయంగా వున్నాయి. చిత్తోడ్, కుంభాల్‌గఢ్, రణథంబూర్, జోధ్‌పూర్‌లలోని శిల్ప సంపదకు అంతులేదు. 1468లో రాజపుత్రుల వీరత్వానికీ, త్యాగనిరతికీ చిహ్నంగా, తన జయకేతనంగా, రాణాకుంభ అపురూపమైన జయస్థంభాన్ని నిర్మించాడు.

జైపూర్:- పింక్‌సిటీ గా ప్రసిద్ధి చెందిన జైపూర్ రాజస్థాన్ ధరిత్రికి రాజధానీ నగరం. యావత్ప్రపంచానికే ఆకర్షణగా మారిన ఈ నగరాన్ని మహారాజా సావాయిజైసింగ్ 1727లో కట్టించాడు. నగర విస్తీర్ణంలో ఏడవవంతు ఆవరించుకున్న సిటీపాలెస్‌లోకి ఏడు దారుల ద్వారా ప్రవేశించవచ్చు. దీని ఆవరణలోనే జిలేబీచౌక్ అనే మరొక అత్యంతాకర్షణీయమైన భవనం ఉంది. 1900లో మహారాజా సావాయి మాధోసింగ్ "ముబారక్ మహల్" ను ఒక దివ్య భవనంలా కట్టించాడు. దీని కుడ్యాలమీది చిత్రాలు అతిమనోహరంగా ఉన్నాయి. ఇందులో పూర్వపాలకుల ఆభరణాలు, దుస్తులూ భద్రపర్చారు.

రాజఠీవితో శిరసెత్తిన దివానెఖాస్, దివానె ఆమ్ అనే గులాబీరంగు భవనాల్లో పెద్దపెద్ద హాళ్ళు, ఆర్చీలు, గ్యాలరీలు ఉన్నాయి. ఈ గ్యాలరీల్లోనే కూర్చుని రాణులూ, అంతఃపుర కాంతలూ రాజసభను తిలకించేవారట. దివానేఖాస్‌కి ఈశాన్యదిశలో ఏడంతస్థుల చంద్రమహల్ అనే అపురూప భవనంలోనే గోవిందజీ ఆలయం ఉంది. సావాయి జైసింగ్ మధుర నుండి గోవిందజీ విగ్రహాన్ని తెచ్చి ఇక్కడప్రతిష్ఠించాడు.

**హవామహల్:** జైపూర్ నగరం నడిబొడ్డులో వున్న ఈ వాయుభవనంలో శిల్పకళాచాతుర్యం అడుగడుగునా ఉట్టిపడుతోంది. ఎంతో సుందరంగా తీర్చిదిద్దబడిన ఈ భవనాన్ని 1799లో మహారాజా సవాయి ప్రతాపసింగ్

నిర్మించాడు. అయిదంతస్థుల ఈ భవనానికి లెక్కలేనన్ని చిన్నచిన్న కిటికీలుండి విస్తృతంగా గాలివీస్తుంది గనుక దీనికి హవా మహల్ అని పేరొచ్చింది.

**రాంనివాస్ గార్డెన్:** దీన్ని మహారాజా రాంసింగ్ నిర్మించాడు. అందమైన లాన్లతో, ప్లేగ్రౌండులతో, జంతుప్రదర్శనశాలలతో ఇది శోభిస్తూ హృదయరంజకంగా ఉంటుంది.

ఇవేగాక ఇంకా జైపూర్ పరిసర ప్రాంతాలలో ఆల్బర్ట్‌హాల్- మ్యూజియం, రాంబాగ్ పాలెస్, ఈశ్వర్‌లాట్, నహర్‌గఢ్, గెయిటోర్, జల్‌మహల్, గాల్టా, సిసోదియా, రాణకాబాగ్, పురానాఘాట్, సాంగానర్ మొదలైనవి తప్పక దర్శించితీరవలసిన స్థలాలు.

**అజ్మీర్:** జైపూరు నుండి 132 కి.మీ. దూరంలో ఆరావళీపర్వతాల సమీపంలోని మతపరమైన పుణ్యస్థలం అజ్మీరు. 'అజేయమైన మేరువు' అని దీనికి అర్థం చెప్పుకోవచ్చు. 7వ శతాబ్దంలో అజయపాల్ చౌహాన్ దీనిని నిర్మించాడు. అజ్మీరు పట్టణానికి చివరి పాలకుడు పృథ్వీరాజ్ చౌహాన్. ఈయన ఆస్థాన కవి చాంద్ బర్దాయ్ "పృథ్వీరాజ్‌రాసో" అనే తన చారిత్రాత్మక గ్రంథంలో ఇక్కడ వీరగాథల్ని అద్భుతంగా వర్ణించాడు.

ఖ్వాజా సాహెబ్ దర్గా ఇక్కడేవున్నందున ఇది ముస్లిములకు తీర్థయాత్రాస్థలంగా మారింది. 1143లో ఆఫ్ఘనిస్తాన్‌లో జన్మించి 1162లో మనదేశానికి, 1190లో అజ్మీరుకు వచ్చి 1236లో దివంగతులయ్యేవరకూ ఇక్కడే వుండి ఆధ్యాత్మిక బోధలు చేశారు ఖ్వాజా సాహెబ్. ఇవి దేశవిదేశ ప్రజలనాకర్షించి భక్తివిశ్వాసాల్ని పెంపొందించాయి. ఈయన జ్ఞాపకార్థమే ముస్లింనెల రజాబ్‌లో మొదటి ఆరురోజులు ఇక్కడ ఉర్సు జరుగుతుంది.

**సోనీజాకీనసియా:** మొదటి జైన తీర్థంకరుడైన వృషభదేవుని మందిరం 'సోనీజాకీనసియా' 1865లో నిర్మించబడింది.

**తారాగఢ్‌కోట:** మహారాజా అజయదేవుడు నిర్మించినది ఈ కోట. ఇందులో అయిదు నీళ్ళ టాంకులూ, ఓ మసీదూ ఉండటం విశేషం.

**ఢాయీదిన్‌కా ఝోంపడా:** ప్రపంచంలో గొప్పగా చెప్పుకోదగిన భవనాల్లో ఇదొకటి. తారాగఢ్ కొండల పాదసీమలో అలరారుతున్నట్లు కనిపించే ఈ భవనాన్ని 1153లో 'రాజా విశాల్‌దేవ్ విగ్రహరాజ్' ఒక సంస్కృత కళాశాలగా కట్టించాడు. కాని 1192లో మహ్మద్‌ఘోరి దీనిని మసీదుగా



జైపూర్‌లోని హవామహలు

మార్చాడు. ప్రార్థన చేసుకునేందుకు అనువుగా రెండున్నర రోజుల వ్యవధిలో పూర్తిచేయమని ఘోరి ఆదేశించినందుకూ, వారా వ్యవధిలోనే నిర్మించినందుకూ దీనికీ పేరు వచ్చింది.

**అనాసాగర్:** పృథ్వీరాజ్ చౌహాన్ తాతగారైన చౌహాన్‌రాజ్ అనాజీ 1135-1150 మధ్యకాలంలో శత్రువులను నిర్జించి, నెత్తురుతో తడిసిన అక్కడి ధరాస్థలిని ప్రక్షాళన చేయగోరి ఈ సరస్సును తవ్వించాడు. ఇక్కడే జహంగీర్ దౌలత్‌బాగ్ అనే సుందరోద్యానవనాన్ని వేయించాడు.

**పుష్కర్:** అజ్మీరుకు 7 మైళ్ళదూరంలో ఉన్న పుష్కరిణి వద్ద ప్రతి కార్తీకపౌర్ణమికి జాతర జరుగుతుంది. బ్రహ్మదేవుని ఆలయం, సావిత్రీ మందిరం, శ్రీ వైకుంఠనాథ్‌జీ ఆలయం మొదలైన గుళ్ళల్లో దక్షిణాదిన కనిపించే శిల్పకళాప్రాభవం దృగ్గోచరమవుతుంది.

**మాగ్జిన్:** మాగ్జిన్ అనే అక్బరుకోటలోని భవనంలో ప్రస్తుతం అరుదైన విగ్రహాలు, పాత నాణేలు, రాజపుత్రుల, మొగలుల పెయింటింగులు భద్రపర్చారు.



చిత్తౌడు - విజయస్థంభం

**చిత్తౌడ్‌గఢ్:** అజ్మీరు నుండి 95 మైళ్ళు, ఉదయపూర్ నుండి 70 మైళ్ళదూరంలో చిత్తోడ్‌గడ్‌కోట ఉంది. 700 ఎకరాలస్థలంలో ఉన్న ఈ కోట నిర్మాణంగురించి పలు అభిప్రాయాలున్నాయి.

**మహారాణా కుంభ భవనాలు:** రాజపుత్ర సంస్కృతి ప్రతిబింబించే ఈ భవనాలు రాణాకుంభ నిర్మించాడు. సూరజ్ గోఖడా, జనానా మహల్, కన్వర్ పాదమహల్, శివాలయం ఇందులోని భాగాలే.

**సాత్‌బీస్‌దేవరా (27 ఆలయాలు):** ఎంతో నాజూకైన శిల్పకళాసంపదతో కనిపించే ఈ జైనదేవాలయ సముదాయంలో 24 చిన్నవీ, 3 పెద్దవీ ఆలయాలున్నాయి.

**కుంభశ్యామ మందిరం:** ఈ వైష్ణవాలయాన్ని 1449లో మహారాణా కుంభ నిర్మించాడు. దీనిలోని మండపాలు, స్థంభాలు చూడముచ్చటైనవి. ప్రముఖ భక్తురాలు, కవయిత్రి మీరాబాయి మందిరం దీని సమీపంలో ఉంది.

**విజయస్తంభం:** 1448లో మహారాణా కుంభ, మాల్వాకి చెందిన సుల్తాన్ మహ్మద్ ఖిల్జీనీ, గుజరాత్‌కి చెందిన సుల్తాన్ కుతుబుద్దీన్‌షాని ఓడించిన సందర్భంలో తన విజయ సూచకంగా దీనిని నిర్మించాడు. సమిధేశ్వర మహాదేవ మందిరం, కీర్తిస్తంభం, మహాసతి, గోముఖకుండం, జైమల్‌పత్తా భవన సముదాయం, రాణీ పద్మినీదేవి భవనాలు, జైన మందిరం, కాళీమందిరం ఇక్కడి చారిత్రక దర్శనీయస్థలాలు.

**ఉదయ్‌పూర్:** నగరం చుట్టూరా సుందరోద్యానవనాలతో ఉదయ్‌పూర్ మనోహరంగా ఉంటుంది. దీనిని 1559లో మహారాజా ఉద



చిత్తౌడు - సాత్‌బీస్ దేవరా

య్‌సింగ్ నిర్మాణం కావించాడు.

**సిటీప్యాలెస్:** ఈ భవనసముదాయం పిఛోలా సరస్సుపైనున్న వంతెనపై వుంది. ఈ భవన సముదాయం సాంప్రదాయశైలిలో వుండి కనువిందుచేస్తుంది. ఇవి రాజస్థాన్‌లోనే అతిపెద్ద భవంతులని చెప్పవచ్చు. వీటిని లండన్‌లోని విండ్సర్ ప్యాలెస్‌తో పోలుస్తారు.

**పిఛోలా సరస్సు:** పిఛోలా సరస్సుపై 15వ శతాబ్దంలో తొలిసారిగా బంజారాతెగకు చెందిన ప్రజలు వంతెన నిర్మించారు. ఆ తరువాత మహారాణా ఉదయసింగ్ దీనిని దృఢంగా కట్టించాడు. ఈ డామ్‌ని బడీపూల్ అంటారు.

**జగ్‌నివాస్:** ఇది చుట్టూనీళ్ళతో ఆవరింపబడివున్న పేలస్. 1754లో నాలుగెకరాల స్థలంలో చలువరాతి పలకలతో మహారాణా జగత్‌సింగ్ దీనిని నిర్మించాడు.

**జగ్‌మందిర్:** దీనిని మహారాణా కరణ్ సింగ్ ముందుగా నిర్మించినా 16వ శతాబ్దంలో మహారాణా జగత్‌సింగ్ దీనిని పునర్నిర్మాణం కావించాడు. తాజమహల్ నిర్మాణానికి స్ఫూర్తి నిచ్చిందీ మందిరమేనని పరిశోధకుల అభిప్రాయం.

**జగదీశ్ ఆలయం:** ఈ జగన్నాథుని ఆలయాన్ని 1651లో రాణా జగత్ సింహ నిర్మించాడు.

**సహేలియోంకి బారి:** ఫతేసాగర్ లేక్‌ని ఆనుకుని వున్న ఈ తోటను కన్నెపిల్లల కోసమని 18వ శతాబ్దంలో మహారాణా సంగ్రామ్ సింగ్ వేయించాడు. సిమెంటుతో కట్టిన వంతెనలూ, గొడుగులూ, అరుగులూ, ఫౌంటేన్‌లూ, విశ్రాంతి గదులూ, వాటిలో అతి చక్కని పెయింటింగులూ, అద్దాలూ, మనోరంజకమైన ఆట వస్తువులూ ఏర్పాటు చేశాడు.

**ఫతేసాగర్ లేక్:** దీనిని 1678లో మహారాజా జైసింగ్ నిర్మించాడు. కానీ అధిక వర్షాలకు ఈ సరస్సు పాడయినపుడు మహారాణా ఫతేసింగ్ అప్పట్లోనే ఆరు లక్షల రూపాయల వ్యయంతో దీనిని పునరుద్ధరించాడు. ఇందులో నెహ్రూ ఆయిలాండ్ పార్క్, జెట్ ఫౌంటెన్, గురుగోవింద్ సింగ్ రాక్ గార్డెన్, మోతీమాశ్రీ ప్రతాప్ మెమోరియల్, భారతీయలోక్ కళా మండల్, పటేల్ సర్కిల్ వంటి దర్శనీయ స్థలాలున్నాయి.

ఇక ఉదయపూర్ పరిసరాలలో—

**ఏకలింగజీ ఆలయం:** ఉదయ్‌పూర్‌కి 22 కి.మీ దూరంలోని ఈ పాలరాతి మందిరాన్ని 1473-1509ల మధ్య మహారాణా రాజ్‌మల్ నిర్మించాడు. ఈ మందిరంలో మరెన్నో చిన్నచిన్న మందిరాలున్నాయి.



ఉదయ్‌పూర్‌లోని లేక్‌పిఛోలా - సిటీప్యాలెస్

మౌంట్ అబూలో ఉన్న దిల్వారా జైనమందిర అంతర్భాగం

**నాగ్దా ఆలయం**: ఏకలింగజీకి 4 కి.మీ. దూరంలో ఉన్న ఈ గుడి అతి ప్రాచీనమైనది.

**హల్దీఘాట్**: మహారాణా ప్రతాప్‌సింగ్‌కు మొగల్ పాలకులతో 1576లో ఈ ప్రదేశంలోనే ఘోరమైన సంగ్రామం జరిగింది.

**నాథ్ ద్వారా**: ఉదయ్‌పూర్‌కి 48 కి.మీ దూరంలో గల ఈ నాథ్ ద్వారా ప్రసిద్ధి చెందిన వైష్ణవ యాత్రాస్థలం. ఇందులో ఆరాధ్య దైవం శ్రీకృష్ణ భగవానుడు. కృష్ణుని స్థానికులు శ్రీనాథ్‌జీ అని సంబోధించేవారు గనుక శ్రీనాథ్‌జీ మందిరంగానే ఈ ఆలయం పిలువబడుతోంది. ఔరంగజేబు దండయాత్రలకు భయపడి మథుర నుండి కృష్ణ విగ్రహాన్ని మహారాణా రాజ్‌సింగ్ 1669లో తెచ్చి ఇక్కడ ప్రతిష్ఠించాడు.

**కన్‌క్రోలి**: నాథ్ ద్వారాకు 16 మైళ్ళ దూరంలో వున్న ఈ ఆలయం ద్వారకాధీశుడైన శ్రీకృష్ణుని నిలయం.

రాజ సమండ్ లేక్, కుంభల్ గఢ్, జైన మండ్‌లేక్, వృషభదేవ్‌జీ జగత్ మందిరం, రానక్‌పూర్ జైన మందిరం మొదలైనవి ఉదయ్‌పూర్‌పరిసరాలలోచూడదగినస్థలాలు.

**మౌంట్ అబూ**: ఈ కొండ ప్రాంతం వేసవి విడిదిగా యాత్రీకుల్ని విశేషంగా ఆకర్షిస్తుంది. జగద్విఖ్యాతి చెందిన దిల్వారా జైన మందిరాలు ఇక్కడే ఉన్నాయి. అబూ చుట్టూరా అడవులూ, గ్రానైట్ రాళ్ళూ ఉన్నాయి. అబూ ఉదయపూర్‌కి 116 మైళ్ళ దూరంలో ఉంది.

ఈ మౌంట్ అబూ వద్దగల ఒక ప్రత్యేక స్థలం నుంచి సూర్యాస్తమయదృశ్యం వీక్షిస్తారు సందర్శకులు. ఇది ఒక మధురమైన అనుభూతి. మండే గోళంలా అగుపిస్తూ, కనువిందు చేసే అస్తమించే సూర్యుడు కొండల కోనల దాపుల్లోకి క్రుంగే దృశ్యం అత్యంత మనోహరంగా కనిపిస్తుంది.

**నక్కీలేక్**: కొండలతో, పొడవైన పచ్చని చెట్లతో ఉన్న ఈ పరిసరాలలో గుహలు అధికంగా ఉన్నాయి. దేవతలు ఈ రహస్య స్థలాన్ని తమ గోళ్ళతో తవ్వారని హిందువుల నమ్మకం. చంపాగుఫా, హాథీగుఫా, రాంజరోభా ప్రముఖమైన గుహలు.



15వ శతాబ్దపు జోధ్‌పూర్ కోట

**రఘునాథజీ మందిరం**: నక్కీ లేక్ పరిసరాలలోనే ఉన్న ఈ రామాలయం 14వ శతాబ్దానికి చెందినదని తెలుస్తోంది. దీని పక్కనే దులేశ్వర మహాదేవుని శివాలయం ఉంది.

**అర్బుదాదేవి ఆలయం**: అర్బుదాదేవిగా విరాజమైన ఇక్కడి దేవత దుర్గాదేవికి మరో పేరని చెబుతారు. ఈ ఆలయం అత్యంత పురాతనమైనది.

**దిల్వారా జైన మందిరం**: మౌంట్ ఆబూకి 1½ మైళ్ళ దూరంలో వున్న దిల్వారాలోని ఈ జైన మందిరం ఎంతో ప్రసిద్ధిగాంచింది. విమల్ వాసాహి, తేజ్‌పాల్ మందిరాలు భారతీయ శిల్ప కళకు కాణాచిలా వున్నాయని సందర్శకుల అభిప్రాయం. ఇవేగాక అచలేశ్వర మహాదేవాలయం, అచల్‌గడ్, గురుశిఖరం, గోముఖ్ ఇక్కడి ప్రసిద్ధ స్థలాలూ, దేవాలయాలు.

**జోధ్‌పూర్**: జైపూర్‌కి 192 మైళ్ళ దూరంలో ఉన్న జోధ్‌పూర్ని రావ్ జోధాజీ 1459లో నిర్మించాడు. మార్వాడీ తెగ ప్రజలతో నిండి వున్న ఈ చారిత్రాత్మక నగరం రాజస్థాన్‌లోని ఎడారి ప్రాంతంలో ఉంది.

**జోధ్‌పూర్ కోట**: నగరం మధ్యలో ఉన్న ఈ కోట 490 అడుగుల ఎత్తులో ఉంది. జయపోల్, లోహపోల్, ఫతేపోల్ అనే మూడు ప్రవేశ ద్వారాలను కలిగి ఉంది. కోట ఎర్రరాయితో కట్టబడి ఆకర్షణీయంగా ఉంది. ఇందులోనే



జోధ్‌పూర్ ఫోర్టులోని దౌలత్‌ఖానాచౌట్.





మోతీమహలు, పూల్ మహలు, శృంగార చౌకీ, ఫతేమహలు, చండికాదేవి ఆలయం, రాణీ సాగర్ సరస్సు ఉన్నాయి. జస్వంత్ థాడా, ఛితార్ పేలస్, మాండోర్ గార్డెన్, బాల్సమండ్ లేక్, ఓసియా ఇక్కడి ఇతర దర్శనీయ స్థలాలు

**భరత్‌పూర్**: రాజస్థాన్‌కి ముఖద్వారంగా చెప్పుకోదగిన భరత్‌పూర్‌లో ఎన్నో అందమైన ఉద్యానవనాలూ, జలాశయాలూ ఉన్నాయి. ప్రతి రాయిలోనూ ఇతిహాసపు గౌరవగాథలు నిద్రిస్తున్నాయి. అద్భుతమైన భవనాలూ, రాచ మహళ్ళూ శిరసెత్తి చూస్తున్నాయి. అయినా కేవలం ఉద్యానవనాల కారణంగానే భరత్‌పూర్ సందర్శకులని విపరీతంగా ఆకర్షిస్తోందంటే అతిశయోక్తి కాదు.

సుమారు రెండున్నర వందల సంవత్సరాల క్రితం భరత్‌పూర్‌ని జాట్ రాజులు స్థాపించారు. ప్రాసాదాలూ, జలాశయాలూ వారి సౌందర్యపిపాసకు అద్దంపడతాయి. తమ అస్తిత్వానికీ, స్వాతంత్ర్యానికి భంగం కలిగిన పరిస్థితుల నెదుర్కొనే సమయంలో జాట్ ప్రభువులు చూపిన అసమాన శౌర్యం, త్యాగాలకి ప్రతీకలుగా కోటగోడల ప్రాకారాలు నేటికీ నిలిచి ఉన్నాయి.

భరత్‌పూర్‌లోని 'లోహగఢ్' దుర్గం ఆ రోజుల్లో అత్యంత సురక్షితమైనదిగా, అజేయమైనదిగా భాసించింది. కానీ 1805లో లార్డ్‌లేక్ ఆంగ్ల సైన్యం నాలుగు నెలల సుదీర్ఘ మోహరింపు కారణంగా పరాజయంపాలు అయింది. ఇక్కడి నుండి 32 కి.మీ. దూరంలో వున్న 'డీగ్'లో జాట్ పాలకులచే 'సురమ్య మహలు' అనే ఉద్యానవనం నిర్మించబడింది. దీనిని ముక్తకంఠంతో ప్రశంసించిన ప్రఖ్యాత కళాకోవిదుడు ఇ.బి. హావెల్ దీనిని వెనిస్ నగరంలోని విశాలమైన కాలువ చెంతకు తీసుకువెళ్ళి అమరిస్తే వెనిస్‌కే గర్వకారణమైన ఉద్యానవనంగా విరాజిల్లుతుందని రాశాడు.

**డీగ్**: ఢిల్లీనుండి 153 కి.మీ. దూరంలో ఉన్న 'డీగ్' నేడు ఒక పట్టణమూగాక, పల్లెగాక మధ్యస్థ దశలో అతి సాధారణ ప్రాంతంగా



డీగ్ - శీష్‌మహల్

మిగిలింది. ఒకప్పుడు ఎంతో వైభవం చవి చూసి అందాలతో అలరారిన ఈ నగరశోభలు ఈనాడు మిణుకుమిణుకుమంటున్నా పట్టించుకునేనాథులే కరువయ్యారు. ఆనాటి ఢిల్లీ, ఆగ్రాల నేలిన మొగల్ చక్రవర్తులను ధైర్యంగా ఎదిరించి నిలిచిన జాట్ వీరులు ఈ గడ్డపైనే తమ రాజ్యచక్రం తిప్పారు. శిల్పులతో, వ్యాపారులతో, స్వర్ణకారులతో డీగ్ వీధులు ఆనాడు కిక్కిరిసి వుండేవి.

1725లో జాట్ శాసకుడు బదన్‌సింహ డీగ్‌లోని రాచమహళ్ళ నిర్మాణానికి శ్రీకారం చుట్టాడు. ఈయన 1723 నుండి 1756 వరకు రాజపుత్ర ధరణి నేలాడు. ఈ నగర నిర్మాణం 75 సంవత్సరాలపాటు నిరంతరంగా కొనసాగింది. బదనసింహుని పుత్రుడు సూరజ్‌మాల్ 1756 నుండి 1763 వరకు పాలించగా, అతని కుమారుడు జవాహర్‌సింహ 1764 నుండి 1768 వరకు పాలించాడు. ఈ మూడుతరాల



భరత్‌పూర్ సింహద్వారం 'సింహపోల్


సింహపోల్ - రాజమహళ్ళ ముఖ్యద్వారం

పాలనలోనే లెక్కలేనన్ని మండలాలూ, చెరువులూ, రమ్యమందిరాలూ, అధునాతన భవనాలూ నిర్మింపబడ్డాయి. షాజహాన్ నిర్మాణాల ప్రభావం వీటిపై ప్రముఖంగా కనిపిస్తుంది.

డీగ్‌లోని ఓ రాజమహలును ప్రత్యేకంగా వనుపురంగు బలువారాళ్ళు, ఎర్రరాళ్ళు, తెల్లని పాలరాళ్ళనువంద కిలోమీటర్ల దూరం నుండి తెప్పించి కట్టించారు.

'సింహపోల్' అనే పేరున్న సింహద్వారం గుండా నగర ప్రవేశం చేయవలసి ఉంటుంది. ప్రవేశద్వారాన్ని చూస్తే చార్‌బాగ్ వంటివి మొగల్ పద్ధతులననుసరించి నిర్మించారని స్పష్టమవుతుంది. విశాలమైన తోటలు, అంతఃపురాలు, జలాశయాలు అన్నింటిపైనా మొగల్ ప్రభావం కనిపిస్తుంది. గోపాల సాగర్, రూపసాగర్ అనే రెండు సరస్సులున్నాయి. వీటి


భరత్‌పూర్ రూప్‌సాగర్



జోధ్‌పూర్ - రాజప్రాసాదపు అంతర్భాగం

డీగ్ - సూరజ్‌మల్ హవేలి

తీరంలో రాజసమొలికిస్తూ ఠీవిగా నిల్చున్నట్లు గుపించే భవనాలను చూడటం ఓ అందమైన అనుభవం.

మహారాజా సూరజ్‌మల్ నిర్మించిన నాలు గంతస్తుల మహలు 'గోపాల భవన్' ఇక్కడి ఉత్కృష్టమైన నిర్మాణంగా చెప్పవచ్చు. దీనిని బ్రజ భూముల పౌరాణిక నాయకుడు శ్రీకృష్ణభగవానుని పేరు మీద నిర్మించారు. తూర్పు దిశ నుండి చూస్తే ఈ భవనానికి ఒకే అంతస్తున్నట్లు కనిపించినా పశ్చిమ భాగం నుండి చూస్తే ఇందులో నాలుగు అంతస్తులు కనిపిస్తాయి. తూర్పు ప్రవేశ ద్వారం దగ్గర జలాశయాలను బలుపరాళ్ళతో నిర్మించారు.

షాజహాన్ ఆగ్రాలో నిర్మించిన 'దీవానె ఆమ్'తో సరిపోలిన 'దీవానె ఆమ్'ను ఇక్కడ కూడా జాట్ పాలకులు నిర్మించారు. ఉత్తర దక్షిణ విభాగాల్లో నల్లని మెరిసే రాళ్ళతోనూ, తెల్లని పాలరాయితోనూ చేసిన రాజసింహాసనాలున్నాయి. వీటిని ఢిల్లీ నుండి జవాహర్‌సింహ దోచుకుని తెచ్చాడని చరిత్రకారుల కథనం. గోపాల భవనానికి సరిగ్గా ఎదురుగా పాలరాతితో తయారుచేసిన ఓ ఊయల ఉంది. కళాత్మక విలువలతో శోభించే ఈ ఊయల ఇక్కడొక ఆకర్షణ. దీనిపైన 1630-31 నాటి ఇతిహాసిక శిలాశాసనం పార్సీ భాషలో చెక్కబడి ఉంది. షాజహాన్ భార్య నూర్జహాన్ వాడుకునేదని చెప్పే ఈ రమణీయమైన ఊయల కూడా ఢిల్లీ నుండి దోచుకొని తెచ్చిందే!

ఈ మహలుకు ఇరువైపులా శ్రావణ, భాద్రపదాలనే మరో రెండు అందమైన భవనాలు నిర్మింపబడి ఉన్నాయి. వీటిపై కప్పులూ, సెజ్జలనీడలూ, గోడలూ, గోపాల సాగరంలో ప్రతిబింబించి వింత అందాల్ని ప్రదర్శిస్తాయి. ఈ రెండు మండపాల వద్ద కూర్చొని వర్షాకాలపు చల్లదనాన్ని పొందవచ్చు.

జవాహర్‌సింహ్ తన తండ్రి స్మృత్యర్థం 'సూరజ్‌భవన్' నిర్మించాడు. ఈ భవనం పై కూడా మొగల్ కళా ప్రభావం ఉంది. మధ్యమధ్య వున్న జలాశయాలు ఈ భవనానికి మరింత శోభల్ని సంతరించి పెట్టాయి. నేలపై కూడా కళాత్మకంగా చెక్కిన నగిషీలు కనిపిస్తాయి. గ్రీష్మకాలంలో మహారాణులు ఇక్కడ

భరత్‌పూర్‌లోని గోపాలసాగర్

విశ్రాంతి తీసుకునేవారు.

ఇక్కడ చెప్పుకోదగిన మరొక భవనం కేశవ భవన్. దీనినే బారాదర్ అని కూడా అంటారు. దీని నిర్మాణం కూడా వేసవి విడిదిని పోలి ఉంది. ఇందులో కూడా సూరజ్‌భవన్‌లోలాగే అయిదు అందమైన జలాశయాలున్నాయి. మండువేసవిలో కూడా కేశవ భవనంలో కూర్చుని వర్షఋతువులోని ఆహ్లాదానందాలను పొందవచ్చు. ఇది ఆనాటి శిల్పకళాకారుల ప్రతిభకు పరాకాష్ఠ. భూగర్భం నుండే జలాశయాలకు కాలువలు అమర్చారు. జలాశయాలు సదాపరిశుద్ధమైన నీటితో వుండేవి. కేశవ భవనం అంతర్భాగంలోని పైకప్పు కూడా నగిషీ చేయబడిఉన్నందున సూర్యకిరణాలు నీటిపై బడి పైకప్పుపై ప్రతిబింబించి ఇంద్రధనస్సును తలపించేవి. పైకప్పు వద్ద చిన్న గుండ్రాళ్ళు పంక్తులుగా గొట్టాల్లో సమాంతరంగా అమర్చేవారు. నీటి ఉధృత ప్రవాహం వేగంగా భూగర్భ కాలువల ద్వారా ప్రవహించినపుడు పైనున్న గుండ్రాళ్ళు దొర్లి మేఘ గర్జనుల ధ్వనులు పుట్టించేవి. దీనితో వర్షం కురిసే అనుభూతి కలిగేది. ఇంతటి అపురూప కల్పనా పటిమను ఆనాడే మన శిల్పులు ప్రదర్శించారు.



డీగ్ - కేశవభవనం

జైసల్మేర్‌లోని రాజమందిరం

జలాశయ నిర్మాణాల్లో ఆనాటి శిల్పి ఎంత ఎత్తుకు ఎదిగాడో ఉద్యాన వనంలోని 500 జలాశయాలను చూసి అంచనా వేసుకోవచ్చు. దక్షిణదిశలో నిర్మించిన కిషన్‌భవన్‌లో వున్న 40 కి.మీ. పొడవూ, 31 మీటర్లు వెడల్పూ వున్న విశాల జలాశయానికి మిగతా ఈ 500 జలాశయాలూ కలుపబడి ఉన్నాయి. దీని లోతు 2 మీటర్లుంది. ఇందులో 50 రంధ్రాలుండి అన్ని జలాశయాలకూ కలుపబడతాయి. బావుల నుండి ఎద్దులతో నీళ్ళు లాగించి జలాశయాలు నింపేవారు. కుండంలోని ఈ 50 రంధ్రాలలో విడివిడిగా రంగులు కలపటం వలన జలాశయాలలో రంగురంగులనీళ్ళు నిండేవి. నేటికీ ఈ రంగునీళ్ళ జలాశయాల్ని ఆగస్టు-సెప్టెంబరుల్లో జరిగే జనవంత ఉత్సవాల్లో మనం చూడవచ్చు.

ఇక్కడ నందభవన్, హరదేవభవన్, శీషమహల్ మరికొన్ని ఆకర్షణీయమైన భవనాలు. రూపసాగరానికి కొద్ది దూరంలో మహారాజా సూరజ్‌మల్ నిర్మించిన విశాలమైన కోట, దాని చుట్టూ అగడ్తలు ఉన్నాయి. ఒకనాటి ఈ వైభవాలు నేడు కళాత్మక భవనాల్లాగే నిర్లక్ష్యానికి గురై చిరనిద్రాభంగిమలో పడి ఉన్నాయి.

ప్రపంచ ప్రసిద్ధి పొందిన ఆగ్రాలోని తాజమహలుకు 98 కి.మీ. దూరంలోనే ఉన్నా చారిత్రాత్మికమైన భరత్‌పూర్ గురించి పర్యాటకులకు తెలియకపోవటం విచిత్రం. అశ్రద్ధ వల్ల ఇక్కడి దివ్యభవనాలూ, గోడలూ, శిలాశాసనాలూ, జలాశయాలు రోజురోజుకీ శిథిలావస్థకు చేరుకుంటూ వుండటం కళాభిమానులకు విచారం కలిగిస్తోంది.

రాజస్థాన్‌లో ఇంకా జైసల్మేర్, బికనీర్ కోట, బుందీ, రణథంబూర్ వంటి దర్శనీయస్థలాలు అనేకం ఉన్నాయి. అజ్ఞాత శిల్పుల ప్రతిభలో ఊపిరి పోసుకున్న శిలలు ఈనాటి తమ దుర్భర దుస్థితికి రోదిస్తున్నవా అన్నట్లు కనిపిస్తుందిక్కడి ప్రస్తుత వాతావరణం. భారతీయ పురాతత్వశాఖ, పర్యటన విభాగాలు శ్రద్ధ తీసుకుని రాజస్థాన్ వైభవాల్ని రక్షించే ప్రయత్నం చేసినపుడే కళాప్రియులకి ఆనందం, కళాస్రష్టలకు శ్రమ ఫలితం లభిస్తుంది.

— జ్యోతిరాణి



# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే. అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లానువేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# చతురకతలు

## అసలు కారణం

"హాయ్... పుట్టింటి నుంచి శ్రీమతిగారెప్పుడో ఊడిపడ్డట్టున్నారే!"

ఇంట్లోకి అడుగుపెడుతూనే ఆనందాశ్చర్యాల్తో పలకరించాను.

ఇందిరేం మాట్లాడలేదు.

సాధారణంగా గలగలమని మాట్లాడుతూ ఉండే ఇందిర పుట్టింటి నుంచి తిరిగి వచ్చిందంటే చాలు ఇక చెప్పనక్కర్లేదు. పుట్ల కుపుట్లు కబుర్లు మోసుకొస్తుంది. చెప్పింది చెప్పకుండా నాన్‌స్టాప్‌గా వారం రోజులపాటు ఊదరకొట్టేస్తుంది. అలాంటిది ఈసారి ఇంత మౌనంగా ఉండడం నాకు వింతగా తోచింది.

"ఏవిటోయ్ ఇందూ అలా ఉన్నావ్? మీ వాళ్లంతా కులాసాయేగదా?" మళ్లీ అడిగాను.

దానికీ జవాబులేదు. నిర్లిప్తంగా నావైపోసారి చూసి వంటింట్లోకి వెళ్లిపోయింది.

ఆమె ప్రవర్తన నాకేం అర్థంకాలేదు.

భారంగా నిట్టూర్చి పడక గదిలోకి కదిలాను.

బట్టలు మార్చుకుని వచ్చి కుర్చీలో కూర్చుని పేపర్ చేతిలోకి తీసుకున్నాను.

రెండు నిముషాల తర్వాత కాఫీ కప్పుతో వచ్చింది ఇందిర.

ఆమె ముఖం వంక పరిశీలనగా చూశాను.



పున్నమిచంద్రునిలాంటి ముఖం కళతప్పి ఉంది. దిగులు, నిస్పృహ ముఖమంతా పరుచుకొని ఉన్నాయి.

“ఇందూ ఏమైంది? అలాఉన్నావ్? ప్లీజ్ చెప్పవూ... ” కాఫీ కప్పు అందుకుంటూ మరోసారి అభ్యర్థించాను.

మళ్లీ మౌనమే సమాధానమైంది.

“తాతగారింట్లో బాగా అలవాటయ్యారు పిల్లలు. నానీకి-బాబీకి ఇక తల్లీదండ్రీతో పని లేకుండా పోయినట్లుంది. ఏమన్నా విసిగించారా ఏం?” కాఫీ చప్పరిస్తూ కూపీ లాగేందుకు ప్రయత్నించాను.

ఫలితం శూన్యం.

నాకేం చేయాలో తోచలేదు. మెల్లగా ఆమెని దగ్గరకు తీసుకుని, “పిచ్చి ఇందూ... నీ బాధేమిటో చెప్పకుండా నీలో నువ్వే కుమిలిపోతావేం? దాన్ని పంచుకునేందుకు నేను లేనా?” అనునయంగా అడిగాను.

అంతే!

అప్పటివరకూ బలవంతంగా దిగమింగుకున్న దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికింది. రెండు కళ్ళూ జలసాగరాలైపోయాయి.

“అరె... ఏమిటా ఏడుపు? అసలేంజరిగిందో చెప్పు...” సుతారంగా కన్నీరు తుడుస్తూ ప్రేమగా అడిగాను. “నానీగానీ బాబీగానీ...”

“అబ్బే! అదేంగాదండీ! మరే... మరేం....”

“ఆఁ చెప్పు...”

“ఉదయం బస్‌లో వస్తూంటే సిటీలోకి రాగానే ఎక్కిన ఓ కాలేజీ కుర్రాడు...” బెక్కుతూ మొదలెట్టిందామె.

నాలో ఆతృత హెచ్చింది. కొందరు కుర్రాళ్ళు బస్సుల్లోను, బజార్లవెంటపోయే ఆడవాళ్లని ఎలా ఏడిపిస్తారో నాకు బాగా తెల్సు.

“ఏంచేశాడా రాస్కెల్?” నాలో పట్టలేని ఆవేశం వచ్చింది.

“...... నా ప్రక్కసీటు ఖాళీగా ఉంటే....”

“వచ్చి నీప్రక్కనే కూర్చున్నాడా?” నా పిడికిళ్లు బిగుసుకున్నాయి.





ఇందిర మౌనంగా ఏడుస్తోంది.

కొన్ని క్షణాలు గడిచాయి. నన్ను నేను నిభాయించుకుని మళ్లీ అడిగాను.

"తర్వాత ఏమైంది?"

"వాడు .... వాడు .... కూర్చోలేదండీ"

నాలో విపరీతమైన టెన్షన్....

"సీటు దగ్గరగా వచ్చి నిలబడ్డాడు..."

"బస్‌లో ఇంకెవరూ లేడీస్ లేరా?"

"లేకేమండీ... నా ముందు సీట్లో ఒకామె కూర్చునుంది".

"సరే... ఈ వెధవ నీ ప్రక్కనే కూర్చుని ఏమన్నా గొడవ చేశాడా?"

"లేదండీ... దగ్గరగా వచ్చి నిలబడి..." దుఃఖంతో ఆమె గొంతు పూడుకుపోయింది.

"ఏమన్నా కూశాడా?"

"ఊహూఁ..."

"మరి?"

"... ఆంటీ, మీరాముందు సీట్లో కూర్చుంటారా నేనిక్కడ కూర్చుంటా నన్నాడండీ..." ఘొల్లుమంది ఇందిర.

నాకేం అర్థంకాలేదు.

"వాడేం చేయందే ఆ ఏడుపెందుకు?" విసుగ్గా అన్నాను.

"అది కాదండీ... బుల్లి గడ్డం, దట్టమైన మీసాలున్న అంతపెద్ద కాలేజీ కుర్రాడికి నేను ఆంటీ నేమిటండీ? నేనంత ముసల్దానిలా కనబడుతున్నానా చెప్పండి?" అంటూ మళ్లీ రాగం అందుకుంది ఇందిర.

-ప్రతాపచంద్ర

## ప్రయాణం

విజయవాడ వెళ్ళే బస్సు కాకినాడలో తెల్లవారు ఝామున బయల్దేరింది. రామం, లలిత సామాను సర్దుకొని సీట్లలో స్థిమితపడ్డారు. పెళ్ళయ్యాక వాళ్ళు కలసిచేసే మొదటి ప్రయాణం ఇది. బస్సుబయల్దేరింది.

"నాకు నచ్చని చాలా విషయాల్లో ఇదొకటి" రామం చెబుతున్నాడు.

ఏమిటి అన్నట్టుచూసింది లలిత.

"సాధారణంగా భార్యాభర్తలు కలసిప్రయాణంచేస్తుంటే బస్సు బయల్దేరిన పదినిముషాలకల్లా అది పగలో, రాత్రో మరిచిపోయి బస్సని కూడా చూడకుండా, భర్తగాడి భుజంమీద వాలిపోవడం" అన్నాడు ఎదుటిసీట్లో దంపతులనుచూపుతూ.

లలితకు నవ్వొస్తోంది కానీ ఆమెకు అతని ధోరణి తెలుసు!

"అలాంటి పిచ్చివేషాలు నాకిష్టముండవు లలితా! అయినా, పెళ్ళికాకముందు, మొగాడంటేనే ముడుచుకుపోయి, అష్టవంకర్లూ తిరిగిపోయే ఈ అమ్మాళ్ళకు పెళ్లైన మర్నాటినుండే అంతధైర్యం ఎలావస్తుందో, పదిమందిలో కూడా అలా ఎలా ప్రవర్తించగలరో?"

"పాపం, మరీ నిద్దరొస్తే ఏంచేస్తారండీ" కొంటెగా రెచ్చగొడుతూ అంది లలిత.

"నిద్దరా పాడా... వెధవ్వేషాలు! మగాడు బయటకుపోయిందగ్గర్నుంచీ ఇంట్లో వీళ్ళు చేసే పని నిద్దరోవడమేగా - అసలునంగతి అదేంకాదులే"

"మరేఁవిటండీ?"

"ఇదిగో... వీడు నా భర్త,వీడిమీద సర్వాధికారాలూ నాకున్నాయి, నేనంచేసినా పడే వెర్రి వెధవవీడు అని పదిమందికీ తెలియడంకోసం"

లలితకు ఈసారి నవ్వాపుకోవడం కష్టమైంది. ఎదురుగా నవ్వితే బాగుండదని కిటికీలోంచి బయటకు చూస్తూ ఆవని కానిచ్చింది.

తిరిగి మొదలెట్టాడు రామం "పాపం ఆవెర్రి మొగుడు ముందావాడు ఈ భుజం బరువుతో కూర్చోలేక, చదువుకోనూలేక, కదలనూలేక తననిఎవరైనా చూస్తున్నారేమోనని కళ్ళు మూసుకొని మౌనంగా ఆ బాధ భరిస్తాడు. అయినా పగటి ప్రయాణంలోకూడా ఈనిద్దరేమిటి! అదిగో అముందు సీట్లోచూడు మహాతల్లి, అప్పుడే జారేసింది తలకాయని మొగుడిమీదికి"

లలితకు చిరాకేసింది. అసలే ఇది మొదటి ప్రయాణం! సరదాగా కబుర్లు చెప్పుకుంటూ వేరుశనగకాయలో, మొక్కజొన్నపొత్తులో తింటూ ప్రయాణించక ఈ నీతులే





మిటి? అనుకుంటూ ఇంక 'టాపిక్' మార్చకపోతే లాభంలేదని

"ఏవండీ- ఇందాక కొన్న 'సితార' ఓసారివ్వండి" అంది.

రామం, లలితకు సితార ఇచ్చి తానేపత్రిక తెరిచాడు

మండపేటలో బస్సాగింది.

చల్లటిగాలి శరీరానికి సోకి ప్రాణం ఎటో తేలిపోతోంది.

అందులోనూ పుష్‌బ్యాక్ సీటు ఇంచుమించు పడుకున్నట్టేవుంది. రెప్పవాలిస్తే రామం చంపేస్తాడేమోనని లలిత బలవంతంగా నిద్రఆపుకుని పత్రిక చదువుతోంది.

బస్సులోసగంమంది నిద్రలోకి జారిపోయారు

'ఇంత చల్లటి గాలీ ఇంతఖాళీ ప్రయాణాల్లో తప్ప మరెప్పుడు దొరుకుతుంది. అయినా నిద్దరోతే తప్పేమిటి చాదస్తంగానీ. ఆలోచిస్తున్న లలిత భుజం బరువనిపిస్తే క్రీగంట చూసింది రామం తల లలిత భుజంమీద పడేసి సన్నగా గుర్రుపెడుతున్నాడు. ఈ బరువు తనకి బాధగా లేదు. పైగా వింత అనుభూతినిస్తోంది.

తణుకులో బస్సాగింది. కండక్టర్ ప్రయాణికులనుద్దేశించి "కాఫీలు టీల. తాగేవాళ్ళు వెళ్ళిరావచ్చు" అని దిగిపోయాడు.

ప్రయాణీకులు కళ్ళుతెరుచుకుంటూ బస్సు దిగుతున్నారు

ఉలిక్కిపడిలేచాడు రామం. చింతనిప్పుల్లాంటి కళ్ళు రెండునిముషాల్లో తెప్పరిల్లాయి.

"ఏవండీ, మనం కూడా కాఫీ తాగుదాం" అంది లలిత.

"పదపద" మొహంచాటేసుకుంటూ, తూలుతూ లేచాడు రామం.

మళ్ళీ బయల్దేరింది బస్సు. ఈసారి లలిత తల ధైర్యంగావాలిపోయింది. రామం భుజంమీద.

—పెండ్యాల సుబ్బారావు

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428 CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD/402